# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

సెప్టెంబరు 1979

సంపుటము : 56 సంచిక : 9

విడిపత్రిక వెల రూపాయిన్నర



# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1979



(*)

# జీవనది

## డాక్టర్ ఎరియాల రామకృష్ణ

ఉదయం హృదయంలో మకాం వేసి
రంగులతో ప్రాంగణాలు ముస్తాబుచేసి
ప్రవాళాల గవాక్షాలు బార్లా తీసి
వృక్షాలనూ పక్షుల పక్షాలనూ చూసి
కాలం చేలాంచలంతో ప్రేలాడుతూ
నడిచే గడిచే ఆ బాల్యం చిరంతనం!

సంజ్ఞలతో సమీరాలను కవ్వించి
ప్రశ్నలతో ప్రసూనాలను నవ్వించి
రాగాలతో మరందాలను వర్షించి
గేహాళీదత్త దీపంలా సుధాకాంతి రువ్వుతూ
ఆహ్లాద చంద్రశాలలో నర్తించే ఆ బాల్యం
అసమాప్తం!

చైత్ర నర్తకి చీరపూలపై ప్రాలుతూ
వర్షవీరుడి వర్ణకార్ముకంతో ఆడుతూ
శరద్బాలిక బొమ్మరిళ్ళలో దూరుతూ
హేమంత తరంగవల్లులమీద దూకుతూ
శిశిర చిత్రాలలో శీతల గీతాలు పాడుతూ
బంభరంలా అంబరంలా
రాత్రిలా ధాత్రిలా అభినేత్రిలా
కనిపించే ఆ బాల్యం నిరంతరం!

# ఆర్తి

## శ్రీ గద్దె బుచ్చిబాబు

సముద్రాన్ని మేఘరాశి చేద్దామని మండిపోతూన్న సూర్యుడి
మనస్సూ,
మధురగీత చరణాంతరాలలో
గాయకుడు ప్రయత్నపూర్వకంగా దాచే ఒగర్పూ,
తన నైపుణ్య ప్రదర్శనలో
క్రీడాకారుడు పణంగా ఒడ్డిన ప్రాణమూ,
మూడే మూడు రూపాయల కూలికి —
కొడుకు చదువుకోసం —
'పేరామాక్' ను స్ప్రేచేసే ముసలి తండ్రి తెగింపూ,
మృత్యు గహ్వరంలో నిండుచ్చూలాలి సమరమూ,
కొవ్వొత్తి తనను కాంతిగా కరిగించుకుని ఇగిరిపోవడమూ,
తన గుండెను తీవ్ర చక్రభ్రమణం నులుముతూన్నా
విరక్కుండా వుందామనుకునే
కారు ఇరుసు పట్టుదలా —
అన్ని ప్రయత్నాలూ — అందరి ఆశయమూ —
ఆశయంలో ఆంతర్యమూ
తనను నమ్ముకున్నవారి ఆశలను నిజంచేసి
ఆనందాన్ని అందించాలనే
ఆర్తి!

# పాపం! సూరన్న

## శ్రీ చిట్యాల రవిందర్

తూర్పున సూర్యుడు ఆకాశం గర్భం నుండి
ఉద్భవించక మునుపే,
ప్రభారుణ కిరణాలు పయనించక మునుపే,
హృదయాన్నెప్పుడో చిమ్మ చీకటితో నింపుకున్న
సూరన్న బయల్దేరుతాడు
ఎప్పుడో, ఎప్పటికీ అలవాటు పడిన
దరిద్రాన్ని ఎత్తుకొని,
గునపాన్ని, పలుగుపారను భుజాన వేసుకుని,
వూరేగుతాడు మా వెర్రి – అన్న
దొర దగ్గర భూమిని అణగ్గొట్టుతాడు
అలాగే తనలోని ఆకలి అరుస్తున్నా అణగ్గొట్టుతాడు
వేసే ఒక్కొక్క పోటు
తన హృదయం మీద వేసుకుంటాడు
గడిపే ఒక్కొక్క క్షణం
గ్రద్ద నోట్లోవున్న కోడిపిల్లలా గడుపుతుంటాడు
కష్టాన్ని చెమటలా కుదించి,
దాన్ని కన్నీటితో జతపఱచి,
ఆశాపూరితమ్మైన కళ్ళతో ఆ దొర దగ్గరికెళ్తే
ఆ దొర కొరకొర మండే నిప్పు కణాల్లా వున్న
కళ్ళముందు
ఆ కళ్ళు ఓటమి చెందుతాయి.
కండల్ని కరగిస్తాడు
కొండల్ని సహితం తరగిస్తాడు
కాని దొర గుండెల్ని కరగించలేడు
సూరీడు సూడలేక సల్లగా
పడమరకు జారుకుంటే
నా అన్న ఆకల్ని తినేసి,
కన్నీళ్ళను తాగేసి,
గతుకుల బొంతమీద నిదురపోతుంటాడు సూరన్న
పాపం ! ఇనుప పాదాల క్రింద చితుకుతూ,
తనెక్కడో, తనేమైపోతున్నాడో తెలియని
మా వెర్రి అన్న !

~~~~~~

# 'నాలో కలిగే భావ పరంపర'

## డాక్టర్ ఎస్. గంగప్ప

నాలో కలిగే భావ పరంపర
హృదయ పీడక శరపరంపర //నాలో//

నాలో కలిగే మధురోహలు
పరిమళాలు వెదజల్లే విరుల సిరలు
నా మెదడు తేనె తెట్టె చుట్టూ మూగే తేనెటీగలు
నా నెయ్యపు విరుల సరుల పై వాలే తుమ్మెదల రొదలు
//నాలో//

నిద్దురరానీక పొద్దుపుచ్చు నా 'పీడకలలు'
నిరంతరం నలిగే నిరుపేదల గాథల బాధలు
అహరహమూ అలమటించే ఆర్తుల ఆవేదనలు
అనుక్షణమూ పరిష్కార మార్గ సాధన శోధనలు //నాలో//

అలసి సొలసింపజేసే నా ఆలోచనలు
పర పీడకుల కరాళదంష్ట్రాంచలాలు
దగాపడిన తమ్ముళ్ళ దందహ్యమానముఖాలు
ఆగడాల్ని అరికట్టే యత్నపూర్వక లోచనాలు //నాలో//
~~~~~~

శ్రీ కాకుమాను తారానాథ్

# డాక్టరు రామ్‌మనోహర్ లోహియా

"The meaning of practical skill must soon be understood in this country. Who is more practical, A Mansingh or Pratap? Among contemporaries Mansingh is praised and Pratap is considered obstinate. After death, Pratap is worshipped while Mansingh is condemned. We think that a Pratap should also be more careful, and when a Mansingh comes to him, treat him as a respected guest. But there is no doubt that so long as the country learn to appreciate Pratap in his lifetime, it cannot acquire the strength of determined will and resolution which make a nation great."

'August Revolution: Twenty Fifth Anniversary' 1967. (Note And Comments - Vol II, pages 222 - 223)

"The people will listen to me, perhaps after I am dead, but listen they must some day. What is wanted is a new type of leadership and a new quality among the people."

*LOHIA.*

ఈ వ్యాఖ్య డాక్టరు లోహియా తన జీవితానికే వ్రాసుకున్న వ్యాఖ్యా ? ఒక విధంగా ఆలోచిస్తే అవునేమో అనిపిస్తుంది. తన జీవితకాలంలో లోహియాలాంటి విచిత్రవ్యక్తి, నాయకుడు మరి లేడేమో అనిపిస్తుంది. నెహ్రూ విద్వేషి, తననే అందరూ ఆరాధించాలి, తనమాటే చెల్లాలి అనే ధోరణికల వ్యక్తి, పార్టీలను ఎంత సులభంగా స్థాపిస్తాడో, అంత సులభంగా విచ్ఛిన్నం చేయగలడు — ఇలాంటి విశేషణాలన్నీ లోహియాకు ఆపాదింపబడ్డాయి. వీటన్నిటి లోనూ కాస్తో కూస్తో నిజంకూడా లేకపోలేదు.

అయితే వీటన్నిటినీ మించిన సుగుణమొకటుంది. వ్యక్తిగత స్వార్థానికిగాని, అధికారవాంఛకుగాని ఏమాత్రం తావియ్యకుండా, సాధ్యాసాధ్యాలతో నిమిత్తంలేకుండా, ఆదర్శాలను, ఆశయాలను గురించిన చర్చకు దిగిన నాయకుడు కూడా లోహియాయే.

స్థూలంగా లోహియా జీవితాన్ని మూడు భాగాలుగా మనం చూడవచ్చు. తన ప్రారంభ జీవితంలో మహాత్ముని అనుయాయి 23 సంవత్సరాల వయస్సులో బెర్లిన్‌నుంచి పిహెచ్. డి. డిగ్రీతో తిరిగివచ్చిన లోహియా కాంగ్రెసుతో పూర్తి తాదాత్మ్యతను పొందాడు. 26 సంవత్సరాల వయస్సులో ఎ. ఐ. సి. సి. విదేశాంగ శాఖ కార్యదర్శి బాధ్యతలను, పండిట్ నెహ్రూ కోరికమీద స్వీకరించాడు అప్పటికే కాంగ్రెస్ సోషలిష్టు పార్టీని స్థాపించటం, సోషలిజం పట్ల ధోరణులను ఏర్పరుచుకోవటం జరిగింది. కాని మహాత్ముని ప్రభావంతో, 1939లో పట్టాభి, సుభాష్‌చంద్రబోస్‌ల పోటీలో, సోషలిష్టులంతా బోస్‌ను బలపరిచినా తాను తటస్థంగా ఉన్నాడు. అలాగే దేశ విభజన తీర్మానం విషయంలో తటస్థత నవలంబించి, తరువాత బాధపడ్డాడు. 1942 క్విట్‌ఇండియా ఉద్యమంలో కమ్యూనిష్టుల పాత్రతో మనదేశంలోని కమ్యూనిష్టుల పట్ల నమ్మకాన్ని కోల్పోయాడు. అంతకు ముందు తానే కమ్యూనిష్టుపార్టీ సమావేశాన్ని ప్రారంభించిన రోజులున్నాయి కాని 1948 ఫిబ్రవరిలో కాంగ్రెసుపార్టీ తీర్మానంతో సోషలిష్టులు బయటికి రాక తప్పనిదశ ఏర్పడింది. దానితో సోషలిష్టులు 1948 మార్చిలో నాసిక్‌లో సమావేశమై, కాంగ్రెసునుండి బయటికొచ్చారు. అంతకుముందే 1947 ఫిబ్రవరిలో కాన్పూర్‌లో జరిగిన సమావేశాలలో తమపేరులోగల "కాంగ్రెసు"ను కూడా తొలగించుకున్నారు. ఈ ప్రారంభదశను, సోషలిష్టు ఉద్యమ జీవిత చరిత్రలో "Spice Group" లేదా "Ginger Group" అని వర్ణించాడు డాక్టరు లోహియా.

నా దృష్టిలో తరువాత డాక్టరు లోహియా జీవితంలో రెండవదశ మొదలయింది. అది 1956లో ఆయన సోషలిష్టు పార్టీని స్థాపించేదాకా సాగింది. లోహియా దృష్టిలో, ఈకాలంలోనే సోషలిష్టు ఉద్యమానికి రెండుదశలూ గడిచాయి. వాటిని 1948 నుంచి 51 దాకా 'Big Noise' అనీ, 1951 నుంచి 55 దాకా 'Great Indecision' అనీ వర్ణించాడు. 1949 పాట్నా సమావేశాలలో భూమిసేన, చిన్నతరహా యంత్రాలు, జాతీయాకరణ, సహాయనిరాకరణాలను లోహియా ప్రతిపాదించాడు. అమిత ఉత్సాహంతో 1952 ఎన్నికలలో పాల్గొన్న సోషలిష్టులకు తీవ్రనిరాశ ఎదురయింది. అప్పటివారి దశను "ఇస్త్రీ చేయబడని గుడ్డలుగా" వర్ణించాడు లోహియా. 1952 మే లో పచ్‌మరీలో జరిగిన సమావేశాలలో పార్టీకి ఉత్సాహాన్నిస్తూ, "పార, జైలు, వోటు" 'Spade, Jail and Vote' లను పార్టీకి బోధించాడు.

తరువాత 1952 జూన్ ఆగష్టులలో కె. యం. సి. పి., యస్. పి. లు కలిసి కె. యం. సి. పి. గా ఏర్పడ్డాయి. ప్రొ॥యంబి లాల్ దృష్టిలో సోషలిష్టుపార్టీ, కె. యం. పి పి. యొక్క గాంధేయ దృక్పథంకోసం, తన మార్క్సిష్టు ధోరణిని త్యాగం

చేసుకున్నట్లయింది ఈ కలయికతో. అయినా 1957 ఎన్నికలలో ఈపార్టీ పెద్దగా ఏమీ సాధించలేకపోయింది.

ఇంతలో 1953 ఫిబ్రవరి ప్రాంతంలో జె. పి., నెహ్రూల సంభాషణలు జరిగాయి. దీనివల్ల ఫలితం లేకపోయినా, కాంగ్రెసుకు నష్టం లేకపోయినా, సి. యస్. పి. పూర్తిగా దెబ్బతిన్నది. లోహియా కాంగ్రెసుపొడకూడా గిట్టని తీవ్ర ధోరణిని అవలంబించాడు. ఎంత తక్కువగా ప్రజల సహకారాన్ని పొందటానికి ప్రభుత్వం తగిఉందో, అప్పుడే సహకారం కావాలంటూ ప్రభుత్వం పదేపదే అంటుంటుందంటాడు లోహియా. ("The less deserving a government is of people's co-operation, the more frequently does it extend invitations for co-operation.")

బేతుల్ కన్వెన్షన్‌లో ఈ అభిప్రాయభేదాలు పరాకాష్ట చెందాయి. 1954 లో తిరువాన్కూర్‌లో పి. యస్. పి. ప్రభుత్వ మేర్పడటం, తమిళప్రాంతాల విలీన ఉద్యమ సందర్భంగా కాల్పులు జరగటం, దానిమీద లోహియా ఉత్తర ప్రదేశ్‌లోని జైలులోనుంచే ఆ ప్రభుత్వం రాజీనామా ఇవ్వాలంటూ టెలిగ్రాం పంపాడు. దీనిమీద పార్టీ నాగపూర్ కన్వెన్షన్‌లో రగడ చెలరేగింది. ఇంతలో 1955లో ఆవడిలో కాంగ్రెసు 'సోషలిష్టు పాటరన్ ఆఫ్ సొసైటీ' తీర్మానంతో ఇంకా అయోమయ పరిస్థితి ఏర్పడింది. తరువాత మధూలిమాయేమీద బాంబేవారు చర్యతీసుకోవటం, దానికి లోహియా కినుక, 1955 జులైలో లోహియానే సస్పెండ్ చేయటం, దానితో ఆయనా, ఆయన అనుచరులు బయటికి రావటంతో లోహియా జీవితంలో రెండవ దశ ముగిసింది.

లోహియా జీవితంలో మూడవదశ సోషలిస్టుపార్టీ స్థాపన. కాని లోహియా దృష్టిలో, సోషలిస్టు ఉద్యమ చరిత్రలో ఇది నాల్గవదశ 'Revolutionary Socialism'. కాంగ్రెసును 'కూలిపోయే గృహం'గా వర్ణించి, చాలా కట్టుదిట్టంగా పార్టీని నిర్మాణం చేయసాగాడు. ''మాన్‌కైండ్'' పత్రికను స్థాపించి నడపసాగాడు. మూడు పాలసీలను పార్టీ ముందుంచాడు. తిరిగి 1957లో లోహియా — జె. పి. సంభాషణలు జరిగాయి, విఫలమయ్యాయి. 1958 ఏప్రిల్‌లో జరిగిన షెర్‌ఘటీ సమావేశాలలో లోహియా మీద ఒకవర్గం బహిరంగంగా ధ్వజమెత్తింది. ఉత్తరప్రదేశ్‌లో ఒక వర్గం బహిరంగంగా విడిపోయింది. 1962 ఎన్నికల్లో తిరిగి నిరాశ ఎదురయింది. దానితో పార్టీని సి. యస్. పి.తో కలిపేందుకు అభ్యంతరం లేదన్నాడు.

1962 డిశెంబరులో నాయకత్వంతో సంబంధంలేకుండా, ఉత్తర ప్రదేశ్‌లోని పి. యస్. పి., యస్. పి. లెజిస్లేటర్లు కలిసిపోయారు. 1963లో కలిశారు, తిరిగి ఫరూకాబాద్ పార్లమెంటు సీటు విషయంలో విడిపోయారు. 1963లో ఫరూకాబాద్‌విజయం తరువాత లోహియా ధోరణిలో మార్పు కనపడసాగింది. తిరిగి పి. యస్.పి., యస్.పి.ల కలయికకోసం, తహతహలాడసాగాడు. కాని మళ్లీ సంయుక్త సోషలిస్టుపార్టీ ఏర్పడటం, విడిపోవటం జరిగింది.

1967 ఎన్నికలకు ముందు ''కాంగ్రెసును తొలగించండి'' అనే నినాదంతో బయలుదేరాడు. ఆ ఫలితాలు ఆయనకు ఒకమాదిరి తృప్తినిచ్చాయి. 1967 సెప్టెంబరు 30న ఆపరేషన్ చేయబడి, అక్టోబరు 12న కన్నుమూశాడు లోహియా. క్లుప్తంగా ఆయన జీవిత విశేషాలివి.

ఈ జీవితాన్ని అర్థంచేసుకోవటానికి ప్రయత్నిస్తే, నిరంతరంగా భారత ప్రజల సముద్ధరణకోసం తపనపడే ఒక హృదయం కనపడుతుంది. ఆ తపన తీవ్రత తీవ్రమైన మార్పులకోసం తహతహలాడసాగింది. ఆ తహతహ ఎంతదూరం పోయిందంటే, బహూశా తన ధోరణి మినహా, మిగతా దేశాన్నంతా, కనీసం తన అనుచరులనైనా తనతో తీసుకుని పోయేదాకా ఆగలేకపోయింది.

కాబట్టే సహృదయతతో, సమన్వయ దృక్పథంతో రాజకీయాలను పరిశీలించగల ఒక నిశితలేఖినినుండి వెలువడిన ఒక నివాళి నుండికొన్ని వాక్యాల నుదహరిస్తే, ఆయన వ్యక్తిత్వ విమర్శ పూర్తవుతుంది: 'మూడున్నర దశాబ్దాలు భారత రాజకీయ రంగంలో మెరిసిపోయిన తార డా॥ లోహియా. పోరాటానికి మారుపేరు లోహియా - స్వరాజ్యావతరణం వరకు స్వరాజ్యానికై పోరాడారు. స్వరాజ్యావతరణానంతర భారత ప్రజాజీవనానికి సంబంధించిన స్పష్టమైన కల్పనతో ఆయన పోరాటంలో పాల్గొన్నారు. ఆ కల్పనను సాధించేందుకు సాధనంగా సోషలిజాన్ని స్వీకరించారు....

''ఆయనకు స్వతంత్రమైన, స్పష్టమైన దృక్పథం,లక్ష్యం ఉంది. అందరికీ చెందిన ఉద్యమాలలో పాల్గొంటూ తన స్పష్టమైన లక్ష్యానికి, తన విశ్వాసాలకు అనుగుణంగా కృషిచేయడం ఆయన ప్రత్యేకత. ఆయన అందరి నిర్ణయానికి తలవంచవలసివస్తే దానికి తలవంచుతాడు. కాని ఏఒక్కరో చెప్పారు గనుక వారు గాంధీ అయినాసరే—తలవంచడం అనే ప్రవృత్తి ఆయనకు సుతరామూ పనికిరాదు......

''అదే వైఖరి స్వరాజ్యావతరణ సమయంలోను అనంతరం కూడా కానవస్తుంది. స్వరాజ్యంకోసం దేశాన్ని విభజించడాన్ని ఆయన వ్యతిరేకించాడు. దేశాన్ని విభజిస్తున్నవారిని ''నేరస్థులు''గా ప్రకటిస్తూ ఆయన గ్రంథం వ్రాశాడు స్వరాజ్యం రావడమంటే ఆయన దృష్టిలో దేశమంతటికీ అఖండంగా స్వరాజ్యం రావడం, విభజించిన అనేక దేశభాగాలకు స్వతంత్రం రావడంకాదు. అందుకే విభజించిన తరువాత దేశాన్ని అఖండం చేయటం మన లక్ష్యంగా ఉండాలని ప్రతిపాదించారు......

''అంతేకాదు, స్వరాజ్యం అంటే అన్ని విషయాలలో విదేశీ ప్రమేయంలేని స్వరాజ్యం అనే కల్పనను కూడా స్పష్టంచేశారు. ఆంగ్లేయుల పెత్తనం తగదు, ఆంగ్లభాషయొక్క పెత్తనమూ తగదు. మనవారే ఎవరైనా అధికారంలో ఉండాలి, మన భాషే

అధికారంలో ఉండాలి, మనందరం నిర్ణయించిన స్వదేశీ భాషయే అధికారంలో ఉండాలి—అనేస్పష్టమైన కల్పనతో ఆయన వ్యవహరించారు. 'క్విట్ ఇండియా' నినాదానికివలెనే 'అంగ్రేజీ హటావో' నినాదం ప్రతిపాదించారు......

ఆ నివాళి ఇలా ముగింపబడింది : "ఈ రాజకీయరంగంలో ఒక విలక్షణమైన పని జరిపేందుకు భగవంతుడు సృష్టించిన సాధనం లోహియా. ఆ సాధనం మసమర్థ్య ఉన్నంతకాలం అది చాలా నిశితంగా పని చేసిందనాలి. పనిచేసి, చేసి మధ్యలో ఫెళుక్కున—57 ఏండ్ల వయస్సున విరిగిపోయింది. జాతీయ ప్రజాస్వామ్య ఉద్యమానికి చేతిలో వ్రాస్తూ వ్రాస్తూ ఉన్న కలంపాళీ విరిగిపోయినట్లయింది. హృదయం బాధపడుతున్నది. పార్టీలు. నినాదాల మాట లెలాఉన్నా— ఆ జీవనసూత్రం, ఆ ఆకాంక్షలు, పీడిత ప్రజలపై శ్రద్ధ, నిరంతర పోరాటశక్తి, నమ్మిన ఆశయంకోసం నిర్మోహమాటంగా వ్యవహరిస్తూ కూడా అందరితోనూ మైత్రి నెరుపగల ఆ చాకచక్యం — అందరూ అలవరచుకొన గల్గితే ఈ జాతి ఇంకెంతో ఉన్నతస్థాయికి త్వరితగతిని రాగలదనేది నిస్సంశయం. అలా అలవరచుకొన గల్గడమే ఆయనకు మనమీయదగు శ్రద్ధాంజలి."

*("జాగృతి" 16-10-67 నాటి సంపాదకీయము)*

* * *

1963 జనవరిలో లోహియా ఉపన్యాసాలు, రచనలు— వీటిలో ముఖ్యమైనవి "మార్క్స్, గాంధీ, సోషలిజం" అనేపేరుతో ప్రచురించబడ్డాయి. వీటికి తానే ఒక దీర్ఘమైన ముందుమాటను వ్రాశాడు. అందులో తన రాజకీయ తత్వాన్ని, "ఉదార తాత్విక ధోరణి" 'Philosophical Liberalism' అని పిలుచుకున్నాడు. దీనితోపాటు ఇంకొకటి కూడా ఉంది. అది "కార్యక్రమ దృఢత్వము లేదాఉగ్రత్వము"'Programmatic Firmness or Extremism'.

అసలింతకూ మన ప్రయత్నమంతా దేనికి? ఏది సత్యమో దానిని తెలుసుకునేందుకే గదా? అయితే సత్యాన్ని సంపూర్ణంగా తెలుసుకోవటం మనకు సాధ్యమా ? కాదేమో ! మనకు తెలిసేదల్లా ఆ సత్యస్వరూపంలో ఒక భాగం లేదా ఒకకోణంనుంచి కనపడే అసంపూర్ణ స్వరూపమేనేమో! ఈమాత్రం అవగాహన మనకుంటే ఒక సౌలభ్యముంది. అంతా మనకు తెలిసిన సిద్ధాంతంలోనే ఉందనీ, లేదా ఉండితీరాలి అన్న భావంతో వాస్తవాలకు మసిపూసి సిద్ధాంత చట్రంలో ఇమడ్చవలసిన పనిగాని, లేదా వాస్తవాలన్నిటినీ తనలోనే ఇముడ్చుకుని తీరాలి అన్న భావంతో సిద్ధాంతాన్ని చిత్రహింస చేయవలసిన పనిగాని ఉండదు. **(Writing on aspects in a knowingly aspectual manner, one does not have to tutor facts to fit them into a theory nor to torture theory in order to include all the facts.)**

తాత్వికరంగము—కార్యక్రమరంగము – తాత్వికరంగము లేక ఆలోచనలలో ఉదారంగా ఉండే ధోరణికి, రెండవరంగము కార్యక్రమంలో ఈ అతి ఎందుకు అనే దానికి కూడా తానే సమాధాన మిచ్చాడు లోహియా. ముఖ్యంగా స్వాతంత్ర్య సంపాదనానంతరము, జాతీయ రాజకీయరంగంలో ఏర్పడిన అవాస్తవిక, కృత్రిమధోరణులే దీనికి కారణమంటాడు. ప్రతివ్యక్తీ తన స్వార్థంకోసం లేదా తన చిన్న ముఠాకోసం చూసుకోవటం మొదలుపెట్టి, ప్రతి ఉద్బోధం వెనుకా, ఏదోఒక మోసము లేదా సంకుచిత ధోరణి ఉన్న ఈ జాతీయరంగంలో, పరిమితిలో ఉండేధోరణి, అతి మంచితనంతో కూడిన కార్యక్రమాలకు స్థానంలేదనీ, కాబట్టే తాను కార్యరంగంలో దృఢత్వాన్ని ప్రతిపాదించానన్నాడు.

ఈ సందర్భంలో నేనీ వ్యాసం మొదట్లో ఉటంకించిన రాణా ప్రతాప్, మాన్‌సింగుల పోలిక మనకు తప్పక గుర్తొస్తుంది. కాబట్టే జాతీయ జీవనరంగం బాగుపడాలంటే, ప్రతి భారతీయుడూ కనీసం ప్రతాప్‌ను అర్థంచేసుకుని, గౌరవించగల ధోరణినైనా నేర్చుకోవాలి, లేదా జాతికి విముక్తిలేదు.

ఇప్పుడీ తాత్విక ధోరణికి, కార్యక్రమాలకుగల సంబంధాలను గురించి పరిశీలించుదాం. ప్రపంచానికి ఇదివరకే తత్వం, కార్యక్రమాల కలయికను గురించి కొంతవరకు తెలుసు అని రెండు ఉదాహరణల నిస్తాడు లోహియా. ఒకరు శంకరభగవత్పాదులు, రెండు మార్క్స్ మహాశయుడు.

శంకరులు విపరీతమైన తత్వాన్ని ప్రతిపాదించారు, అది తాత్వికరంగంలో ఒకచివరకు వెళ్ళిపోయింది. ఆయనకు సత్యం బహుముఖి. బహురూపి కాదు. ఏకైక సత్యము మాత్రమే, అది భావాత్మకమైంది. కాబట్టి మనకు కనపడేవాటిని అధిగమించటమెలా? రెండుపద్ధతులద్వారా. ఒకటి మనకు కనపడే వాటితో పోరాడ, మనం ఏది సత్యమని భావిస్తామో దాని కనుగుణంగా మనకు కనపడేవాటిని మార్చటం. రెండవపద్ధతి, ఉన్న పరిస్థితులలోనే జీవిస్తూ, వాటికున్న ఆధ్యాత్మిక ప్రాముఖ్యాన్ని తగ్గించివేయటం. మానవుడు ఈ రెండవ ధోరణిని అవలంబించినపుడు కఠినతలేని, సడలింపులు గల కార్యక్రమా లుద్భవిస్తాయి. **(...A liberal programme is then born.)** ఈవిధంగా "ఎక్స్ట్రీమ్" తత్వంతో ప్రక్క ప్రక్కనే "లిబరల్" కార్యక్రమం కూడా ఉంటుంది. "స్పిరిట్" ఈవిధంగా విభజింపబడటమనేది భారతదేశం బయట ఎక్కడాలేదు, పైగా ఇంకా భారతహృదయం శంకరులు తయారుచేసిన మూసలోనే ఉంది సుమా! **(...and the Indian mind is still largely what Sankara made it.)**

రెండవ విపరీతతత్వ ధోరణి కారల్‌మార్క్స్‌ది. మనం ఎంత వరకు ప్రపంచాన్ని మార్చదలుచుకుంటే, ప్రపంచం అంతవరకే అర్థమవుతుంది. ఆస్తి సంబంధమైన సూత్రాలనన్నిటినీ మార్చివేయటమంటే సామాన్యమైన విషయంకాదు. ఆస్తి ఉన్నవారు దానిని కాపాడుకుందామనీ, లేనివారు దానిని పొందుదామని తీవ్రంగా ఘర్షణ పడటంతో కార్యక్రమంలో ఈ తత్వానికీ ఉగ్రత ఏర్పడుతుంది. ఈ విధంగా శంకరులు, మార్క్స్‌లను పోలుస్తూ ఇలా అంటాడు

లోహియా : "If Sankara was a philosophical extremist, whose programme was liberal, Marx was a programmatic fanatic, whose philosophy matched its programme's extremism. The results of Sankara's venture have been well known through the ages. Those of Marx's are yet somewhat fluid. But they seem to be tracing a pattern in which the thing sought to be destroyed is reemerging in an altered form and the sighting of truth is as far away as ever of tranquility perhaps further away."

లోహియాదృష్టిలో మానవుడు ముక్కలు ముక్కలుగా చేసి చూడదగిన వ్యక్తికాదు. అతనిని పూర్ణవ్యక్తిగా భావించే మనం పరిశీలించాలి. అతని "టొటాలిటీ"ని గమనించే మనం మన పరిశీలనకు పూనుకోవాలి. ఈవిధంగా తన రాజకీయాలకు, తన కార్యక్రమాలకు ఒక తాత్విక ప్రాతిపదికకోసం నిరంతరాన్వేషణ సాగించిన కొద్దిమంది రాజకీయ నాయకులలో లోహియా ఒకడు.

1952 సోషలిస్టు రాజకీయాలలో ఒక మలుపురాయి. సోషలిజం స్థాపన పరమాశయంగా, కేవలం ఆదర్శాలే ఆసరాగా మొదటి ఎన్నికలలో పాల్గొని తీవ్ర పరాజయం పొందారు, పూర్తి నిరుత్సాహంతో నిండిపోయారు. 296 లోక్‌సభ స్థానాలకు, 1796 అసెంబ్లీ స్థానాలకూ పోటీచేసి, కాంగ్రెసుపార్టీ తరువాత అత్యధికంగా వోట్లు సంపాదించినా, కేవలం 12 లోక్‌సభస్థానాలు, 126 అసెంబ్లీ స్థానాలు మాత్రమే పొందగలిగారు.

ఈ పరిస్థితులలో 1952 మే లో పచ్‌మరీలో సోషలిస్టు పార్టీ స్పెషల్ కన్వెన్షన్ జరిగింది. తరువాత జూన్‌లో ఉత్తర ప్రదేశ్ సోషలిస్టుపార్టీ సమావేశాలు హరదోయిలో జరిగాయి. ఆగస్టులో హైదరాబాద్ వచ్చి కొన్ని ప్రసంగాలు చేశాడు లోహియా.

నాదృష్టిలో ఇవి లోహియా వెలువరించిన భావాలలో చాలా ముఖ్యస్థానాన్ని ఆక్రమిస్తాయి. వాటి ఆధారంగా లోహియాయొక్క కొన్ని భావాలనిక్కడ పరామర్శించటానికి ప్రయత్నిస్తాను.

* * *

1952 సంవత్సరానికొక ప్రాధాన్యతఉంది. కాంగ్రెసు తరువాత ఎన్నికలలో అధికస్థానాలను సంపాదించిన కమ్యూనిస్టు పార్టీ, కాంగ్రెసుకు 'ఆల్టర్‌నేటివ్' అనేటంతటి భ్రమలు కలుగజేసింది. పైగా నాటికి దేశంలో కమ్యూనిజానికీ, సోషలిస్టులు చెప్పే సోషలిజానికిగల భేదాన్ని గురించి స్పష్టమైన అభిప్రాయాలు లేవు. కాబట్టే మే నుంచి ఆగస్టుదాకా, కేవలం నాలుగు నెలలలో ఈ విషయాలను గురించి పదేపదే ప్రసంగించాడు లోహియా.

నేడు కొన్ని పరిస్థితులున్నాయి, మనం వాటిని ఇంకొక విధంగా మలచదలుచుకున్నాము. కాబట్టే "ఉన్నది" "what is" "ఉండవలసినది" "What ought to be" "వాస్తవము" "Actual" "ఆదర్శము" "Ideal" – వీటిని మనం సరిగ్గా అర్థం చేసుకోవాలె. లోహియా దృష్టిలో కాపిటలిజమ్, కమ్యూనిజం – రెండూ "ఆటోమోటివ్ ఫిలాసఫీస్". పారిశ్రామికీకరణ, చక్కటి పోటీద్వారా సర్వమూ సమకూరుతుందని భావించిన కాపిటలిజమ్, పరాజయం పొందటంతోనే, కమ్యూనిజం ఆ రెంటి స్థానంలో పారిశ్రామికీకరణ, వర్గకలహాన్ని ప్రవేశపెట్టింది. ఎప్పుడయితే వ్యక్తి "ప్రస్తుత పరిస్థితులలో ఇంకేదీ సాధ్యంకాదు" "ప్రస్తుత పరిస్థితులలో ఇంతకంటె ఇంకేమీ చేయలేం" అంటాడో, ఆవ్యక్తి తనకు తెలియకుండానే ఈ "ఆటోమోటివ్ ఫిలాసఫీ" ఆరాధకు డయ్యాడన్నమాట.

ఈ దృక్కోణం నుంచి కమ్యూనిజంను పరిశీలించుదాం. రష్యా కమ్యూనిస్టుకు ఆదర్శమవుతుంది. రష్యాలో వాస్తవంగా అమలులోఉన్న ప్రతి పరిస్థితీ ఆదర్శమవుతుంది. అప్పుడు రష్యన్ ప్రభుత్వము, రష్యన్ సమాజం ఏ పనులు చేసినా, అవి అన్నీ సమర్థనీయాలే అవుతాయి. ఈ ధోరణిలో పడ్డ మనస్సు సర్దిచెప్పుకుంటుంది. అప్పటికే మన ఆదర్శం ఒక వ్యక్తిలోనో, ఒక ఆదర్శంలోనో రూపొంది ఉంటుంది. కాబట్టే ఉన్న పరిస్థితుల్లో, అంతకంటే గత్యంతరం లేదని సర్దిచెప్పుకుంటాం.

ఈవిధంగా ఆదర్శం Ideal, వాస్తవం Actual గా రూపొందిందని మనం భావించేటప్పుడు, వాస్తవాలను అర్థం చేసుకోవటం, వాటిని అధ్యయనం చేయటం లుప్తమవుతుంది. ఎదురుగా వాస్తవాలు కనపడుతుంటాయి, కాని మనస్సు విమర్శనాశక్తిని కోల్పోయి మొద్దుబారటంతో వాటినిచూచే ఓపికను కోల్పోతుంది. అంతేకాదు. వాస్తవం ఎప్పుడూ ఒకే ముక్కగా ఉండదు ద్వందాలుగా ఉంటుంటుంది. ఎప్పుడయితే మనం రష్యాను, రష్యన్ పరిస్థితులను ఆదర్శవంతంగా భావిస్తామో, రెండవ భాగమైన వాస్తవమైన అమెరికాను అవాస్తవికమేకాదు, దయ్యంగా demon భావిస్తాము. కమ్యూనిస్టులు కాకపోయినా, అమెరికా మనస్సుకూడా ఈ విధంగానే ఆలోచిస్తుంది. వారి దృష్టిలో రష్యాని demonize చేయటం జరుగుతుంది. ఈ పరిస్థితులను వివరిస్తూ ఇలాఅంటాడు లోహియా:

"When the existing is idealized, such a dichotomy is bound to occur. One ideal idealizes a person or a country. There is an opponent or an enemy, and then a devil or a demon is seen in that enemy and opponent. This grave disease of the human mind of wanting to achieve ideal through a trick of the mind, forgetting all about it, and then trying to idealize the actual in one aspect and then demonize it in another prevails all the world over."

"There are some who somehow try to keep themselves away from such a disease. Their number is very small ..."

తరువాత 'కఠోపనిషత్'' లోని నాచికేత, యముల సంవాదాన్ని గురించి ప్రసంగిస్తాడు.

ఆ ఉపన్యాసాన్ని ఎనిమిది సంవత్సరాల తరువాత 'ఎడిట్' చేస్తూ, చివరి పేరాలో తనభావాల్ని ఇంకా స్పష్టంగా చెపుతాడు. What is మరియు What ought to be లను తెలుసుకున్న తరువాత మనం చేయవలసిన పనల్లా ought ను is గా మార్చటానికి ప్రయత్నం చెయ్యటం. ఈ ప్రయత్న ఫలితంగా ఒకస్వరూపం ఏర్పడుతుంది, ఇదే What has become. చాలామంది What has become మరియు What ought to be లను ప్రత్యామ్నాయాలుగా భావిస్తారు. కొంతమంది ought మరియు is లు సమానాలు కాకపోయినా, ఈ is లోనే ought అయ్యేందుకు కావలసిన బీజాలున్నాయని సంతోషిస్తుంటారు.

ఇందులోనే ఇంకొక సూక్ష్మముందంటాడు లోహియా. What has become ఎప్పుడూకూడా, కేవలం What ought to be యేకాకుండా, అందులోనే నిబిడీకృతంగా What it should not beగా కూడా తప్పక ఉంటుందంటాడు. కాబట్టి ఎప్పుడూ is=What ought to beయే కాకుండా What it ought not to be కూడా అంటాడు. ఈ విధమైన అవగాహన మనలో ఏర్పడినప్పుడు, మనలో ఏర్పడేమార్పును గురించి చెపుతూ ఆ వ్యాసాన్నిలాముగిస్తాడు: "Then perhaps would the lamb be with the lion, love with anger, experimentalism with uncompromising action , movement with eternity, certainties of tested modes and pride with humility and questioning mind, defence with accusation, demon with God, and men shall forever, instead of trying to idealize the actual, strive to actualize the ideal."

* * *

డాక్టరు లోహియా ధోరణి ఒక విషయంలో అతిస్పష్టం. ఆయన ఒక ధోరణికి తాను 'ప్రో' అనీ, ఇంకొక ధోరణికి 'యాంటీ' అని చెప్పుకొనటంలేదు. పచ్‌మరీ కన్వెన్షన్‌లో ఈ విషయాన్ని సూటిగా చెప్పాడు "ఈ కార్యక్రమాన్ని ప్రారంభించేముందు నేనొక విషయాన్ని వివరించదలుచుకున్నాను. నిన్న అనేకమంది మాట్లాడుతూ, నేను నా భావాలను దాయగూడదనీ, ధైర్యంగా నేను 'యాంటీ' లేదా 'ప్రో' మార్క్సో చెప్పాలనీ అన్నారు.

నా ఉపన్యాసాన్ని మీరు శ్రద్ధగా చదివితే, మార్క్స్ పేరు నేను ఒక్కసారే వాడినట్లు గమనించి ఉంటారు. అది మార్క్సిజాన్ని పొగిడే ధోరణిలోనే ఉంది. అంతేగాని నేను మార్క్సిజాన్ని నిరాకరించలేదు, అంగీకరించలేదు.

తరువాత నాకీ 'ప్రో' 'యాంటీ' అనే మాటలు నచ్చవు. నేను యాంటీమార్క్సిస్ట్ కాదు ప్రో మార్క్సిస్ట్ కాదు. మహాత్మాగాంధీ విషయంలో కూడా అంతే." 1952 లో సోషలిజం—కమ్యూనిజం విషయాలలో పార్టీ తికమకలలో పడ్డప్పుడు చెప్పినమాటలివి.

ఇదే ధోరణిని 1963లోనూ వ్యక్తం చేశాడు. 1942–43లో బ్రిటిష్ వారితో విప్లవాత్మక సమరంలో సోషలిస్టులు మునిగిఉండి, జైళ్ళలోనో లేక వెంటాడబడుతూనో ఉన్నప్పుడు, వారి విదేశీ ప్రభువులతోపాటుగా కమ్యూనిస్టులు "ప్రజాయుద్ధ" నినాదాన్నిచ్చారనీ, అప్పటినుంచీ మార్క్సిజంలోగల పరస్పర వ్యతిరేక ధోరణులను గురించి ఆలోచించటం మొదలయిందనీ, నాలుగు రంగాలను గురించి చరిత్ర, అర్థికశాస్త్రము, రాజకీయాలు, తత్వశాస్త్రము తాను వివరంగా వ్రాయదలుచుకున్నాననీ, కాని అర్థిక శాస్త్ర సంబంధమైన రచన సగంలో ఉండగా తాను పోలీసులకు చిక్కాననీ అంటాడు.

అప్పటినుంచీ ఈ విధమైన ఆలోచన, భావప్రకటన తనను ఎంతమాత్రం ఉత్సాహపరచలేదంటూ ఇలా అంటాడు: "Since then this style of enquiry and expression has ceased to interest me. No man's thought should be made the centre of a political action; it should help but not control. Acceptance and rejection are varying forms of blind worship. I believe that it is silly to be a Gandhian or Marxist and it is equally so to be an anti-Gandhian or anti-Marxist. These are priceless treasures to learn from Gandhi as from Marx, but the learning can only be done when the frame of reference does not derive from an age or a person."

తన 'మార్క్స్, గాంధీ, సోషలిజం' గ్రంథంలో "ఎకనమిక్స్ ఆఫ్టర్ మార్క్స్" అన్న 42–43నాటి వ్యాసానికి 1963లో వ్రాసిన ముందుమాటలోనివి ఈ వాక్యాలు.

* * *

ఇప్పుడు సోషలిజం—కమ్యూనిజంలను గురించి లోహియా భావాలు తెలుసుకుందాం.

కమ్యూనిజాన్ని ఒక అంతర్జాతీయ సిద్ధాంతంగా చూడటానికి లోహియా నిరాకరించాడనే చెప్పవచ్చు. ఆయన దృష్టిలో అది యూరప్‌ఖండం, ఆసియాఖండంమీద ప్రయోగించిన అధునాతన ఆయుధం మాత్రమే. కారణమేమిటంటే స్వేచ్ఛావాదం ("లిబరలిజమ్") క్రిష్టియానిటీ, కాపిటలిజం ఇవ్వనీ కూడా యూరప్ నుండి దిగుమతి అయిన ఆయుధాలే. ఇవి సాధించలేని మంచిని కమ్యూనిజం ఎంతవరకు సాధించింది అన్నదే మన ప్రశ్న. కమ్యూనిజం కూడా సిద్ధాంతంగా కాని లేదా ఒక రాజ్యాన్ని నడుపుతున్న శక్తిగాగాని సుమారు శతాబ్దం, అర్ధశతాబ్దాల పైగా ప్రపంచంలో ఉంటున్నది.

గత మూడు నాలుగు శతాబ్దాలనుంచి కాపిటలిజం చరిత్ర అంటే క్రమబద్ధంగా ఇండియా, చైనా, మలయా బర్మాలనుంచి ధనప్రవాహం ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ లాంటి దేశాలకు ప్రవహించటమే నంటాడు. ఇప్పుడు ఈ గుంపులోకె రష్యా, అమెరికాలు

కూడా జేరాయి. ఈ పశ్చిమ యూరప్ దేశాలు తమ ఉత్పత్తి సాధనాలను, సౌకర్యాలను ఇతోధికం చేసుకున్నాయి.

దీని ఫలితాలు మనకు కొన్ని కొట్టవచ్చినట్లుగా కనపడతాయి. ఈనాడు అమెరికన్ కార్మికుడు 10,000 రూపాయిల విలువగల పనిముట్లతో ఉత్పత్తిని సాగిస్తుంటే, పశ్చిమయూరప్ కార్మికునికి 5000ల విలువగల పనిముట్లు ఉంటుంటే, భారతీయ కార్మికునికి కేవలం 150 విలువగల సాధనాలు మాత్రమే ఉన్నాయి. అంతేకాక ఆయా దేశాల్లో శాస్త్రీయజ్ఞానాన్ని పరిశ్రమకు, వ్యవసాయానికీ, తమ సాంకేతికాభివృద్ధికి వినియోగించారు.

ఈనాడు మార్క్సిస్టు విప్లవం రష్యాలో వచ్చిందని అంతా చెపుతారు. ట్రాట్స్కీ తానొక వివరణ ఇచ్చి కాపిటలిస్టు గొలుసు బలహీనమైనచోట తెగిందన్నాడు. ఇంకొక మార్క్సిస్టు — మార్క్స్ అది కాపిటలిజం బాగా అభివృద్ధిపొందిన చోటనే తెగుతుందన్నాడు. కాని రాజకీయవాదియైన లెనిన్, అనేక వివరణలు సాధ్యమయ్యేటటువంటి సిద్ధాంతీకరణ చేశాడు. ప్రొలిటేరియన్ రాజకీయపక్షము ఎక్కడైతే ప్రతిభావంతంగా, బలంగా ఉంటుందో అక్కడ కాపిటలిస్టు గొలుసు తెగుతుందన్నాడు.

ఇప్పుడు భారతదేశంలోనే కాపిటలిస్టు గొలుసు తెగిందనుకున్నాము. మార్క్సిజం ఎంతమాత్రం ఊహించని సమస్యలు మనకు ఎదురవుతాయి. ఒకసారి కాపిటలిజం పోయిన తరువాత మార్క్సిస్టు సిద్ధాంత ప్రకారం సమస్యలే ఉండవు. కాని మనం అమెరికా, రష్యాలలాగా కావాలంటే 200,000 కోట్లు పెట్టుబడి కావాలి. ఇది ఎక్కడనుంచి వస్తుంది?

ఒకవేళ అతికఠినమైన, హృదయమేలేని పరిపాలనా పద్ధతిని ప్రవేశపెట్టామనుకోండి. అయినా పెట్టుబడి మనకు లభ్యంకాదు. అయితే ఒక మతైకధోరణి కలిగిన వ్యక్తిగాని, లేక రాజకీయవ్యక్తిగాని నూతన సమాజాన్ని, నాగరికతనో నిర్మించదలుచుకుంటే అతనిని మించిన కఠినాత్ముడు మరొకడుండడు, ఎందుకంటే తమ ఆదర్శమనుకునేదాన్ని పొందేందుకు ఎటువంటి పనికైనా ఆ వ్యక్తి వెనుదీయడు. అయినా ఒరిగేదేమిటి? ఒక అర్ధశతాబ్ది కాలంలో నీ అభివృద్ధి రెండింతలవుతుంది — అంతే. దీనిని వివరిస్తూ ఇలా అంటాడు : "I assume that a ruthless system wouldbe determined to exterminate 10 million or 20 million or 50 million persons. When persons think of building up new societies and civilizations there is none more cruel than the religious person and none more cruel than the political person, because they are both infatuated with an ideal and while working at that ideal, they just do not consider the cost. Therefore, I am prepared to admit that the Communist Party might be able to achieve a doubling or trebling of the rate of investment. What would that mean? Eighty years, I suppose, or the multiplier factor may accelerate : it might mean 60 years. That is the utmost. You just cannot go beyond that. 60 or 70 years under the most ruthless system which exterminates and does not think twice before killing 10 or 20 or 50 million persons. Meanwhile, how much further would the advanced economies of Russia or America have marched?"

ఇంకొక విషయాన్ని కూడా లోహియా పదే పదే నొక్కి చెపుతాడు. సమాజానికిగల సాంఘిక ఆశయాలకూ, ఆర్థిక ఆశయాలకూ ఎప్పుడూ భేదముంటుందనీ, ఆర్థిక ఆశయాలంటూ ఉంటే, వాటి నుండే 'ఆటోమేటిక్'గా సాంఘికాశయాలు అవతరించవనీ అంటాడు.

దీనికి ఉదాహరణగా కాపిటలిజానికీ, కమ్యూనిజానికీ ఆర్థిక ఆశయాలలో గల పోలికలను చూడవచ్చు. విపరీతమైన ఉత్పత్తి, దానిలో నిపుణత, ఎక్కువ వేతనాలు మొదలైన విషయాలలో స్టాలిన్ అయినా, ఫోర్డు అయినా ఒకటే, ఇద్దరికీ భేదమేమీ ఉండదు. కాకపోతే అమెరికావారు రష్యాలో ప్రజాస్వామ్యం లేదంటే, రష్యనులు అమెరికాలో సాంఘిక యాజమాన్యం లేదంటారు. మిగతా కారణాలెలా ఉన్నా కనీసం ఒక కారణం కోసమన్నా ఈ నూతన ప్రపంచం కాపిటలిజాన్ని, కమ్యూనిజాన్ని దాటి ముందుకు పోవాలంటాడు లోహియా. ఆ కారణమేమిటంటే, ప్రపంచంలో 2/3 వ వంతు భాగానికి ఈ విపరీత ఉత్పత్తి, శాస్త్రజ్ఞానము సరిపోకపోవటమే. ఇంతవరకు కమ్యూనిజం సాధించిందల్లా కేంద్రీకృతమైన రాజ్యాధికారం, పార్టీ మాత్రమేననీ, ఆహారం, స్వాతంత్రాలు ప్రపంచంలో 2/3వ వంతుకు కమ్యూనిజం సాధించలేక పోయిందనీ అంటాడు. (The centralized Party and state and all that they gave birth to seem to be the general aims of Communism. Communism can provide neither bread nor freedom to 2/3 of the world.)

ఇంకొక వాదన, కమ్యూనిజం చైనాలో, భారతదేశంలోనూ అమలులోకి వస్తే ఈదేశపు సంస్కృతుల ప్రభావంతోనూ, బ్రిటిష్ వారి ప్రజాస్వామిక ధోరణులతోనూ కమ్యూనిజం మెత్తపడుతుందనీ దాని ధోరణులలో మార్పురాక తప్పదనే వాదన అది. దీనికన్నా దీని వ్యతిరేకవాదనే నిజమవుతుందనీ, భారతదేశం ఇన్ని శతాబ్దాల నుంచీ ఆరాధిస్తున్న సంస్కృతులు, గీత మొదలైనవి, కమ్యూనిజం భారతదేశపు వ్యవసాయాన్ని ఆధునాతనీకరణం చేయటానికి ప్రయత్నించటంతోనే నాశనమవుతాయనీ అంటాడు.

సమాజంయొక్క సాంఘికాశయాలకు, ఆర్థిక ఆశయాలకు తప్పక సమన్వయాన్ని కుదర్చాలనీ, రెంటినీ విడివిడిగా భావించటం తప్పనీ అంటాడు. ఒక ఆశయాన్ని రెండో ఆశయంమీద గుద్దాలని (superimpose) చూస్తే అది ప్రమాదానికి దారి తీస్తుంది. రెంటినీ అవసరమయితే కొంచెం కొంచెంగా సర్ది అయినా సమన్వయానికే ప్రయత్నించాలి.

కొంతమంది బేబీ సోషలిష్టులు, గాంధేయవాదులూ కమ్యూనిజానికి, గాంధీయిజానికీ, సోషలిజానికీ ఉన్న భేదమల్లా అహింసా, ప్రజాస్వామిక విధానంలోనే ఉంటుందని భావిస్తున్నారనీ, ఇది నిజం కాదనీ అంటాడు. వీరి దృష్టిలో ఈ భేదం ఎంత తక్కువలోకి వచ్చిందంటే, మార్క్సిజంలోనికి ఏదో ఒక విధంగా గాంధేయ ధోరణి అయిన అహింసను, పశ్చిమ యూరప్ ధోరణి అయిన ప్రజాస్వామ్యాన్ని జొనిపిస్తే చాలు, సరిపోతుందని భావించేటంత వరకు వచ్చారు. ఇది చాలా అసంబద్ధమనీ, ఒక ఆదర్శం మూసలో ఇంకొక ఆదర్శాన్ని గుద్దితే చాలా విపరీత ఫలితాలకు దారి తీస్తుందనీ, ఎప్పుడూ, ఆర్థిక నిర్మాణం సాధారణ ఆశయాలను అమలులోకి తెచ్చుకునేందుకు వీలుగా ఉండాలనీ, అలాగే సమాజపు సాధారణ ఆశయాలు ఆర్థిక నిర్మాణాన్ని నిలబెట్టేవిగా ఉండాలనీ అంటాడు.

ఇంతకూ మార్క్సిజానికీ, సోషలిజానికీ గల భేదాలేమిటి ? లోహియా దృష్టిలో మార్క్సిజం, కమ్యూనిజం — పనిని సగం మాత్రమే చేస్తాయి. కేవలం కాపిటలిష్టు ఉత్పత్తి సంబంధాలను నాశనం చేయటం వరకే వొస్తాయి. సోషలిజము కాపిటలిష్టు ఉత్పత్తి సంబంధాలనే కాకుండా, కాపిటలిష్టు ఉత్పత్తి శక్తులను కూడా నాశనం చేసేందుకే, లేదా వాటిని పూర్తిగా మార్చేందుకన్నా ప్రయత్నిస్తుంది. సోషలిష్టుల ఈ రెండు కార్యాలను గురించి ఇలా అంటాడు లోహియా. కొంచెం దీర్ఘమయినా దీనిని ఆయన మాటలలోనే తెలుసుకోవటం బాగుంటుంది :

"If one were mow to make a distinction between Marxism and Socialism, so far as this analysis is concerned, one would have to admit that Marxism and Communism, construe their task by one-half. They think alone in terms of destroying the relations of capitalist production, whereas a genuine socialism would have to think in terms of destroying both the capitalist relations of production and the capitalist forces of production, or at least vastly remodelling them. It would have to think of a society and a civilization in which the worker and the agriculturist and the other professions will be equipped with tools with which they could produce more wealth and yet not succumb either to the subjective temptation or to the objective reality of a continually increasing standard of living. The socialist therefore has got to carry out two task at the same time. The Communist carries out only one task; he destroys the capitalist class and then there is an end to the matter. Whereas the socialist will have to destroy the capitalist class as well as destroy the methods of production which capitalism has given to the world. It is a two fold task."

తరువాత లోహియా ఈ ప్రపంచం యొక్క ద్వంద్వ భావాన్ని గురించి, అది మన ఆలోచనలలో కలిగించే మార్పును గురించి ప్రసంగించాడు. ఆధ్యాత్మికము — భౌతికము, గతము — భవిష్యత్, మతైకము — మతైకం కానిది, వ్యక్తి — సమాజము, ఆహారము—సంస్కృతి ఇవన్నీ నేడు దేశం ముందున్న సమస్యలు.

నిజానికి ఒక రాజకీయ సిద్ధాంతానికి సమన్వయ దృక్పథం చాలా అవసరము. అయితే ఇది వివిధ తాత్విక దృక్పథాలలో గల మూలాన్ని తెలుసుకో గలిగినప్పుడే సాధ్యమవుతుంది. ఈనాడు మానవ ప్రకృతి ఒక విచిత్రస్థాయికి చేరుకుంది. ఇంగితజ్ఞానంగల మానవుడు ఆధ్యాత్మికవాదులలో భౌతికవాదిగానూ, భౌతికవాదులలో ఆధ్యాత్మికవాదిగానూ ఉండకోరుతున్నాడు.

నిజానికి అస్తిత్వమంటేనే పరిణామము. అయితే పరిణామం అంతటా అస్తిత్వమే కనపడుతుంది. ప్రతిక్షణమూ ఈ విశ్వగమనంలో ఒక 'లింకు' అంతేకాదు, అది ఒక అనంతం కూడా. (All being is no doubt becoming, but through all becoming runs also a pattern of being. Every moment is no doubt a passing link in a great flux, but it is also an eternity in itself.)

క్షణం క్షణంగా భౌతికమైనది, కాని అనంతంలో క్షణంగా అది ఆధ్యాత్మికమైనది. ఏ తత్వాలయితే, భావాత్మకమైన శాశ్వతసూత్రాన్ని లేదా భౌతిక సిద్ధాంతాన్ని మాత్రమే బోధించి మానవుణ్ణి యంత్రంగా భావిస్తాయో, అవి అతన్ని అజ్ఞానంలోకి, మొరటుతనంలోకి ఈడుస్తాయి.

ప్రస్తుతాన్ని భవిష్యత్‌కోసం త్యాగంచేస్తాము. భవిష్యత్‌కు తప్పకుండా ప్రస్తుతంమీద కొన్ని హక్కులున్నాయి, వాటిని తృప్తి పరచవలసిందే. కాని కేవలం ప్రస్తుతాన్నే పట్టుకుంటే అది సుభాల వెంటనే పరుగెత్తేటట్లుచేస్తుంది కాబట్టే మానవుడు ప్రస్తుతంలో బతుకుతూనే భవిష్యత్‌కోసం గూడా బతకాలి. (Man must live for the future, but he must also live in the present.)

ప్రాతకాలపు సోషలిజం మతాన్ని నల్లమందన్నా, ప్రస్తుతపు సోషలిజం మతంపట్ల పట్టీపట్టని ధోరణిని అవలంబిస్తున్నది. మతైక ధోరణికి, దాని వ్యతిరేక ధోరణికి గల చర్చలకు స్వస్తిచెప్పి, సోషలిష్టులు కూడా మతంలో గల ప్రేమైక క్రమశిక్షణ, నైతిక శిక్షణలను తప్పక గమనించి తీరాలి.

వ్యక్తి సమాజానికిగల సంబంధం, క్షణానికి అనంతానికిగల సంబంధం లాంటిదే. వ్యక్తే మన అంతిమ ధ్యేయం. వ్యక్తే మన సాధన కూడా అంతిమధ్యేయంగా వ్యక్తి సర్వులకూ ప్రేమైక స్వరూపి, సాధనగా దౌష్ట్యానికి ప్రతిగా నిలిచే విప్లవాత్మక స్వరూపి. మంచి సాధనలను విప్లవం వచ్చేదాకా వాయిదా వేయ కూడదు, అలాగే మనుషులంతా మంచివాళ్ళయేదాకా విప్లవాన్ని

వాయిదా వేయకూడదు. ("The good means must not be postponed until after the advent of the revolution, and the revolution must not be postponed until all men have become good".)

*　　　*　　　*

క్లుప్తంగా లోహియా విచారధారలో కొన్ని భావాల నిక్కడ వివరించటానికి ప్రయత్నం జరిగింది. లోహియాలోని విలక్షణత్వం ఇక్కడ కనపడుతుంది. రాజకీయరంగంలోని సమస్యలపట్ల ఎంత నిర్భయంగా తన ధోరణులను వెలిబుచ్చాడో, అన్ని విషయాలమీద అంత నిర్భయత్వంతో మాట్లాడగలగటం ఆయన ప్రత్యేకత. రాజకీయ సభలలో తాత్విక చర్చను ప్రోత్సహించగల వ్యక్తిత్వమాయనది. పూర్తిగా అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించతగిన మహాపురుషుడు లోహియా.

(ఈ వ్యాసం పూర్తిగా లోహియా విరచితమైన 'Marx, Gandhi and Socialism' ఆధారంగా వ్రాయబడింది. ఇందులోని ఉల్లేఖ్యాలన్నీ దానిలోనివే. స్థలాభావం కారణంగా అన్ని భావాలను తడమలేకపోవటం, స్పృశించిన వాటిని అసంపూర్తిగా చిత్రించటం జరిగింది. ఆ లోపం మట్టుకు నాదే.)

# ఏ గీతిక వినిపించేది

## బైరపరసు

ఉక్కు హృదయాల నాకర్షించే
ఏ అయస్కాంతాన్ని బిగించి
గతాన్ని — భవితవ్యాన్ని లగించే
ఏ గీతిక వినిపించేది !

ధైర్యం లేని రాత్రి
నిశ్శబ్దంగా నిద్రిస్తుంటే
నీరసించిన ప్రకృతి
నిట్టూర్పు నిగిడిస్తుంటే
నడకరాని ఈ చెట్లు
ఆకుల కను కొలకుల నుండి
మంచు కన్నీటి బొట్లు కురిపిస్తుంటే

కదలికలేని ఈ కొండలు
గుండెబండల బాదుకుంటూ
కన్నీటి సెలల పారిస్తుంటే —
నా మౌన ఆక్రందనానికి
సానుభూతి చిహ్నాలుగా మిగిలే
ఈ ఆర్ద్ర రసాచరాల నోదార్చటానికి
ఏ గీతిక వినిపించేది !

అధైర్యం ద్రవీభవించేందుకు
ధైర్యం ఘనీభవించేందుకు
ఏ గీతిక వినిపించేది ! !



డా. బి. ఆర్. కె. రావు

# బ్రిటిషు పాలనలో క్షామం, నిరుద్యోగం, పేదరికం

## రామమోహన్‌రాయ్, నౌరోజి, రమేష్‌చంద్రదత్, గోవిందరనడే, గోపాలకృష్ణ గోఖలేల భారతీయ ఆధునిక ఆర్థిక ఆలోచన

*(గత సంచిక తరువాయి)*

### జస్టిస్ మహదేవ గోవింద రనడే

మహదేవ గోవింద రనడే నాశిక్‌లో 1842 జనవరి 18వ తేదీన జన్మించాడు. 22 సంవత్సరాల వయస్సులో బొంబాయి విశ్వ విద్యాలయంలో అర్థశాస్త్రం బోధించ ప్రారంభించాడు. 1866లో బొంబాయి రాష్ట్ర ప్రభుత్వానికి ఓరియంటల్ అనువాదకుడుగా నియమించబడ్డాడు. 1867లో కొల్హాపూరు సంస్థానంలో 'జడ్జి'గా నియుక్తుడయ్యాడు. అప్పటికే భారతీయ వాస్తవిక ఆర్థిక పరిస్థితుల అధ్యయనానికి పూనుకున్నాడు. 1877లో ''రివెన్యూ మాన్యుయల్ ఆఫ్ ది బ్రిటిష్ ఎంపైర్''ను ప్రచురించాడు. తరువాత ''బొంబాయి ప్రెసిడెన్సీలో క్షామ పరిస్థితులకు సంబంధించిన పరిపాలన'' అనే పరిశోధనా పత్రం ప్రచురించాడు. 1885 బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో, 'లా మెంబరు'గా నియుక్తుడయ్యాడు. 1893 లో బొంబాయి హైకోర్టు జడ్జిగా నియుక్తుడయ్యాడు. ఇతర కార్యక్రమాలెన్నిటిలోనో నిమగ్నం కావలసి వచ్చినా భారతదేశ రాజకీయ ఆర్థిక జీవితాల అధ్యయనాదులలో శ్రద్ధ చూపుతూనే ఉన్నాడు. భారత జాతీయ కాంగ్రెసుతో చాల సన్నిహిత సంబంధం పెట్టుకున్నాడు. 1890లో ''ఇండస్ట్రియల్ ఎసోసియేషన్ ఆఫ్ వెస్టరన్ ఇండియా'' అనే సంస్థను స్థాపించాడు. 1890-93లో ఎస్సేస్ ఆన్ ఎకనామిక్స్ (థాకర్ అండ్ కంపెనీ లిమిటెడ్, బొంబాయి, 1898) అనే గ్రంథం ప్రచురించాడు. తన్మూలంగా భారతీయ అర్థశాస్త్ర పితగా ఖ్యాతిగాంచాడు.

రనడే చాల శాస్త్రీయంగా ఆలోచించేవాడు. పాశ్చాత్య అర్థశాస్త్రజ్ఞులు, ముఖ్యంగా బ్రిటిషు అర్థశాస్త్రవేత్తలు చెప్పినవాటిని గుడ్డిగా అనుసరించడానికి తిరస్కరించాడు. వాదం ఏ ప్రమేయాల మీద ఆధారపడి చేయబడిందా అని లోతుకుపోయి ఆలోచించేవాడు.

ఆయన చాలా ఆర్థిక రంగాలను అధ్యయనంచేసి ఆ రంగాలలోని నిర్ణయాలను భారతీయ పరిస్థితులలో పరీక్షించడానికి ఆ నిర్ణయాల వెనుకనున్న విశ్లేషణ పద్ధతులను, వాదాలను నిశితంగా పరిశీలించేవాడు. తాను తెలిసికొన్న ఆర్థిక సత్యాల ననుసరించి ఆర్థిక విధాన నిర్ణయాలుచేస్తూ ప్రపంచ దేశాలమధ్య భారతదేశానికి ఆర్థిక న్యాయం జరగాలని చెప్పాడు. సమస్యలకు తుది పరిష్కార మార్గాల నివ్వకున్నా, పరిష్కార సాధనకు ఏ మార్గాలవెంట పయనించాలో సూచించాడు.

### అధ్యయన పద్ధతి

సాంప్రదాయక ఆర్థిక ఆలోచన విశ్వానువర్తితమనే వాదం ఇదివరకే ఛాలెంజి చేయబడింది. ఆర్థిక వ్యవస్థ ప్రత్యేక ఆర్థిక యూనిట్ల సమ్మిళితమని, అందులో ప్రతియూనిట్ సహేతుకంగా పనిచేస్తుందని, ఈ వ్యవస్థలో పెట్టుబడిదారీ విధానానికి సంబంధించిన యదార్థాలు సర్వోత్కృష్టమైన సత్యాలని చెప్పడాన్ని సోషలిస్టులిదివరకే ఛాలెంజి చేసారు. ఆర్థిక ఆలోచకుల్లోని జాతీయవాదులు, చారిత్రకాధ్యయన పద్ధతి నవలంబించినవారుకూడ సోషలిస్టులవలె ఆ వాదాన్ని గట్టిగా వ్యతిరేకించారు. అప్పుడున్న ప్రత్యేక పరిస్థితులదృష్ట్యా ఆలోచించినపుడే వాటినుండి ఏర్పడిన ఆర్థిక సమస్యలకు, విధానాలకు అర్థం ఉంటుందని రనడే అభిప్రాయపడ్డారు. ''మన ఆశయాలకు సంబంధించిన రాజకీయ కోర్కెల విషయంలో జాగ్రత్తగా ఉండాలని 'హెచ్చరికచేసే ఉపాధ్యాయులు, రాజనీతిజ్ఞులు (States men) భారతీయ ఆర్థిక విషయాలు చర్చనీయాంశా లయినపుడు పై చెప్పిన హితవుతో కూడిన హెచ్చరికను

మర్చిపోతారు. ఇంగ్లీషులో వ్రాసిన అనేక ప్రఖ్యాత పాఠ్య గ్రంథాలలో చెప్పిన విషయాలు పూర్తిగా నిజమని, ఆచరణీయమని, జాతీయ పురోగమనం ఏ దశలోఉన్నా సర్వకాల సర్వావస్థల్లోను వాటిని మార్గదర్శక సూత్రాలుగా తీసుకుని కార్యాచరణకు పూనుకోవాలని వారంటారు. ఈ గ్రంథాలలో చెప్పబడిన సూత్రాలను ఆచరణలో పెట్టడంలో వాటిని తగినట్లు మలచడానికి తెగకు, సంఘానికి, న్యాయశాస్త్రానికి, నీతిశాస్త్రానికి, ఆర్థిక వ్యత్యాసాలకు సంబంధించిన పరిస్థితులు ప్రభావశీలం గలవిగా పనిచేస్తాయని వారు భావించడం లేదు'' అని రనడే ''ఎస్సేస్ ఆన్ ఇండియన్ ఎకనామిక్స్'' (పే.2)లో వ్రాసాడు. రాజ్యాంగయంత్రమంతా ఒకే శక్తి అని రనడే జర్మన్ ఆర్థిక శాస్త్రవేత్తలవలె చెప్పాడు. రాజ్యాంగ యంత్రాన్ని బీజగణితంచేసే రీతిలో ఆర్థిక యూనిట్ల మొత్తంగా చెప్పరాదు. దానికి ప్రాణము, ఆత్మ ఉన్నవి. అందువల్ల పెట్టుబడిదారీ సంస్థల వాతావరణం మధ్యన, వివిధ ఆర్థిక ఆర్థికేతర ఉత్తేజకాల ఫలితంగా వచ్చే సమాధానాలను, అవి ఉద్భవించడానికి కారణమైన పరిస్థితులున్నప్పుడు మాత్రమే అనువర్తింపచేయడానికి వీలుంది. యదార్థ దృష్టితోచేసే విశ్లేషణ ఆర్థిక శక్తుల్నేగాక ఆర్థికేతర శక్తుల్ని కూడ బహిర్గతం చేస్తుంది. ఆడం స్మిత్, రికార్డో, జాన్ స్టువర్ట్‌మిల్‌లు అవలంబించిన విధానదృష్టిని రనడే విమర్శించాడు. రాజ్యాంగయంత్రం దాని భాగస్వాములైన యూనిట్ల వెరశిని అధిగమించిన విషయమని, ఆర్థిక సహేతుకత ఆలోచనా శక్తిగా విశ్వాను వర్తితమని బ్రిటిషు అర్థశాస్త్రజ్ఞులు ఖండించడం సరిగానే ఉన్నదని రనడే అభిప్రాయపడ్డారు. అదేవిధంగా విపణివీధులు, వ్యాపారపోటీ ''సహజ వ్యవస్థ'' భాగాలని ప్రమేయం చేయరాదు. వ్యక్తి, సమాజ ప్రయోజనాలమధ్య అంతర్భూతమైన అనుకూలత ఉన్నదనిగాని అందువల్ల నిర్ణయాలు చెయ్యడంలో ఆర్థిక యూనిట్లను 'అదృశ్యహస్తం'' సంచాలకత్వానికి వదలి వెయ్యాలని గాని చెప్పరాదు.

యదార్థమైన సందర్భాన్ని గణనలోకి తీసుకోకుండా అమూర్త నిగమన (abstract deductive) పద్ధతి నుపయోగించరాదని రనడే ఉద్దేశ్యపడ్డారు. అందువల్ల సాంప్రదాయవాదంగా వస్తున్న స్వేచ్ఛావ్యాపార ఆలోచనను అంగీకరించలేదు. ప్రతి ఆర్థిక వ్యవస్థని గురించి ఆలోచించేటప్పుడు దాని సంస్థల చట్రాన్ని దృష్టిలో ఉంచుకుని మాత్రమే, ఆ పరిస్థితుల్నిబట్టి దాని కార్యాచరణను విశ్లేషించాలి. మనుష్యుల స్వభావము, సమాధానాలతీరు ఆర్థిక వ్యవస్థలోని సంస్థల చట్రంమీద, దాని వృద్ధి స్థితిమీద, యింకా అటువంటి ఇతర సంగత సత్యాలమీద హెచ్చుగా ఆధారపడి ఉంటుంది. సాంప్రదాయక (classical) ఆర్థిక శాస్త్రవేత్తలు ఆర్థికాభివృద్ధిని నిర్లక్ష్యం చేయగల్గిన శక్తిగలవారుగా ఉన్నారు. కాని రనడే ఆ దృష్టి నవలంబించలేదు. రనడే అవలంబించిన మార్గాన్ననుసరించి ఆర్థిక రక్షణ విధానము, ఆర్థికవృద్ధిని తెప్పించేందుకు ఉద్దేశ్యపూర్వక ప్రయత్నము, స్వేచ్ఛావ్యాపారము, ఇతర మామూలు విధాన నిర్ణయాలకంటె, రనడేకు ఎక్కువ అంగీకారంగా ఉన్నవి. రనడే జర్మన్, ఫ్రెంచి, అమెరికన్ ఆర్థిక శాస్త్రజ్ఞుల ఆలోచనను, సోషలిస్టు ఆలోచకుల అభిప్రాయాలను బాగా జీర్ణించుకుని వాటి ప్రభావానికి లోనైనాడు. సాంప్రదాయక ఆర్థికశాస్త్రంలో పన్నెండు ప్రమేయాలు భారత దేశానికి అనువర్తితం కావని రనడే చెప్పాడు. నిగమన పద్ధతి విశ్లేషణకు సరైన చోటునిచ్చే పరికల్పనా (Hypothetical) స్థబ్దస్థితినే సాంప్రదాయక అర్థశాస్త్రం ప్రధానంగా తెలియజేస్తోందని రనడే గట్టిగా నమ్మాడు. ''సంపద పురోగమనాన్ని చైతన్యవంతంగా అధ్యయనం చేయవలసి వచ్చినప్పుడు నిగమన పద్ధతికి దాదాపు ఏమాత్రం కూడా విలువలేదు'' అని రనడే గట్టిగా చెప్పారు.

సాంప్రదాయక ఆర్థిక శాస్త్రవేత్తల రచనలను బాగా చదివిన రనడే వ్యక్తిని గాకుండా సమాజాన్నంతటిని గణనలోకి తీసుకుని ఆర్థికవాదాన్ని సాగించాలని గట్టిగా చెప్పాడు. ఈ విషయంలో ఆయన జర్మన్, సోషలిస్టు ఆర్థిక ఆలోచకుల మార్గాన్ననుసరించాడు. సూక్ష్మస్థాయిలో ఒక వ్యక్తి ప్రత్యేక ప్రవర్తనను గణనలోకి తీసుకుని చేసిన నిర్ణయాలు స్థూలస్థాయికి వచ్చినపుడు చాలవరకు మార్పుచెందవలసిన అవసరమున్నదని రనడే చెప్పారు. ''వ్యక్తిని అతని ప్రయోజనాలను కేంద్రంగా జేసుకుని ఆర్థిక సిద్ధాంతాలు చేయరాదనే నిర్ణయానికి ఆధునిక ఆలోచన వస్తోంది. ప్రజాసమాజము నిజమైన కేంద్రము. అందులో వ్యక్తి ఒక భాగము మాత్రమే. మనుష్యుల ప్రయోజనాలను మాత్రమేగాక సమిష్టి రక్షణకు, సమిష్టి శ్రేయస్సును, సాంఘిక విద్యను, క్రమశిక్షణను, బాధ్యతలను కూడ గణనలోకి తీసుకోవాలి. అప్పుడే సిద్ధాంతము ఊహావాదం కాకుండా ఉంటుంది. అనుసరించవలసింది నిగమన అధ్యయన పద్ధతి కాదు, చారిత్రక అధ్యయన పద్ధతి- చారిత్రక పద్ధతి భవిష్యత్తును సూచించేటప్పుడు భూతకాలాన్ని గణనలోకి తీసుకుంటుంది; మొత్తం గాకుండా సాపేక్షికత ఆర్థికశాస్త్రం నిర్ణయాల్లో కన్పిస్తుంది. ఆచరణదృష్టికి విడాకులిచ్చిన సిద్ధాంతము చిలిపితనంగల తప్పు. ఇటువంటి తప్పు అర్థశాస్త్రాన్ని ఆదర్శస్వప్నం లేక కలవరంలోని వ్యర్థత్వ స్థితికితెస్తుంది'' అని రనడే వ్రాసారు.

## ఆర్థికాభివృద్ధి

భారతీయ ఆర్థిక వ్యవస్థ అనుభవిస్తున్న సందికాల స్థితిని, దాని పురోగమనానికి అడ్డుతగులుతున్న శక్తుల్ని రనడే నిశితంగా గమనించాడు. పాశ్చాత్య ఆర్థిక వ్యవస్థల ప్రభావం భారతీయ ఆర్థిక వ్యవస్థను పరిణతి చెందించసాగింది. అయితే భారతీయ సంస్థలు పూర్ణపరిణతిని త్వరగా రనివ్వడంలేదు. సాంప్రదాయక్ష చేతివృత్తులు, భారతీయ పరిశ్రమలు నాశనం చేయబడటంవల్ల వాటిలో పనిచేస్తున్న జనాభా గ్రామాలకు ప్రవాసం పోయారు. ఇండియాకు ఆధునిక పరిశ్రమలు, ఆర్థికసంస్థలులేవు వ్యాపారపోటీ చేసే శక్తులు బలహీనంగా ఉన్నవి. ఉత్పాదన కారకాల తరలత

(Mobility) ఎక్కువగా లేదు. అందువల్ల వ్యాపార కార్యకలాపాలన్నీ ద్విపక్ష (bilateral) గుత్త విపణి వీధులకే పరిమితమైనవి. ఆదాయ, సంపద పంపిణీలు ఆర్థిక శక్తుల ప్రభావంలోకంటె ఆచారానుగత శక్తుల ప్రభావంలో ఎక్కువగా ఉన్నవి.

భారతదేశంలో ఆర్థికాభివృద్ధి జరగవలసిన అవసరము, జరగడానికి అవకాశము ఉన్నవని రనడే అభిప్రాయపడ్డారు. భారత ప్రజల పేదరికం రనడేను కలవరపర్చింది. ''వృద్ధిరాహిత్యత (Stagnation), పరాధారత, ఆర్థికమాంద్యత, పేదరికము దేశంలోను, ప్రజల్లోను స్పష్టంగా కన్పిస్తున్నవి'' అని రనడే వ్రాసారు. భారతదేశంవంటి దేశాలను శాశ్వత పేదరికానికి గురిచేసిన సాంప్రదాయక ఆర్థిక శాస్త్రవేత్తల ప్రాంతీయ శ్రమవిభజన (Territorial division of labour) సిద్ధాంతాన్ని రనడే అంగీకరించలేకపోయాడు. సమశీతోష్ణ మండలాలు పారిశ్రామికీకరణకు బాగా తగినవని, ఉష్ణదేశాలు వ్యవసాయంతోను, తోటలతోను మాత్రమే ఆర్థిక కార్యకలాపాలను సాగించాలని బ్రిటిషు ఆర్థిక శాస్త్రవేత్తలు చెప్పడాన్ని రనడే గర్హించారు. ఇది చాల సందిగ్ధమైన మార్గంగా ఉన్నది. ఈ వాదాన్ని అంగీకరించడానికి ఇందులో అంతర్గర్భితమైన సహేతుకత రనడేకు కన్పించలేదు. ఈ విషయానికి వ్యతిరేకంగా రనడే చెప్పిన వాదనలో అయిదు పాయింట్లు ఉన్నవి.

(1) మొదట్లో పరిశ్రమల్నేర్పరచుకుని, అభివృద్ధి చేసుకుని, నిర్వహిస్తూ వచ్చినవి ఉష్ణదేశాలే. (2) ముడిపదార్థాలున్న చోట, వాటితో చేసిన వస్తువులు కొనబడే విపణి వీధులున్నచోట ఉత్పత్తిచేసే యూనిట్లు ఉండటం సమంజసమౌతుంది. ముడి పదార్థాలను దూరాన ఉన్నచోట్లకు రవాణా చేయడము, తరువాత వాటితో తయారైన వస్తువుల్ని దూరాన ఉన్న వినియోగ కేంద్రాలకు రవాణా చేయడము చాల వ్యయంతోను, వ్యర్థంతోను కూడుకొన్న పని. (3) అంతర్జాతీయ శ్రమవిభజన కొన్ని దేశాల సమూహానికి అనుకూలంగాను, మరికొన్ని దేశాల సమూహానికి వ్యతిరిక్తంగాను పనిచేస్తోంది. యంత్రాలను, బొగ్గును, ఇనుమును ఉపయోగించడంవల్ల సమశీతోష్ణదేశాలు తమ పారిశ్రామిక ఉత్పత్తిద్వారా లాభము పొందుతున్నవి. ఇవి ఆ దేశాల స్థితిలో అంతర్గర్భితమై ఉన్న లాభాలు కావు. అల్పాభివృద్ధిని మాత్రమే పొందిన ఉష్ణదేశాలు కూడ ఈ లాభాలను పొందగలవు. (4) సాంప్రదాయక ఆర్థిక శాస్త్రవేత్తల ఆలోచనలో బలహీనత ఉన్నది. ఆడంస్మిత్ 'లాభసాటి వ్యాపారి (Fair trader) ఇంగ్లండుకు లాభదాయకంగా ఉన్నచోటనే స్మిత్ స్వేచ్ఛావ్యాపారం కావాలంటాడు. ఒక దేశ పారిశ్రామికీకరణ శైశవావస్థను దాటిన పిదపనే స్వేచ్ఛావ్యాపారం కావాలని జె. యస్. మిల్ చెప్పాడు.' ఈ వాదాన్ని ఒప్పుకుంటే భారతదేశం కూడ తాను పారిశ్రామికంగా బలపడేవరకు 'ఆర్థిక రక్షణ'ను అమలు జరపాలి. (5) సాంప్రదాయక ఆర్థిక శాస్త్రవేత్తలు బలపర్చిన ప్రాంతీయ శ్రమ విభజన సిద్ధాంతాన్ని మనం అంగీకరిస్తే భారతదేశం ఇప్పటికే క్షీణ ప్రతిఫల ప్రక్రియకులోనై ఉన్న వ్యవసాయంతోనే కాలంగడుపుతూ నష్టపోవలసివస్తుంది. వ్యవసాయంనుండి మాత్రమే వచ్చే ఆదాయంమీద ఆధారపడితే భారతదేశ మెప్పుడూ సౌభాగ్యానికి త్రోవతీసే ప్రగతిని పొందలేదు. ఉష్ణదేశాల వ్యవసాయాల ఆదాయాలు, వర్షాలు అనిశ్చితమైన కారణంగా పంటలు అనిశ్చితం కాగా ఒడుదుడుకులకు, ఎగుడుదిగుడులకు లోనవుతున్నవి. ఉష్ణదేశాలు ఈ అనిశ్చితత, క్షామాలవల్ల ఎందుకు బాధపడాలి?

ఆర్థికవృద్ధి, పారిశ్రామికీకరణ, పట్టణీకరణ ఏకోన్ముఖంగా జరుగుతాయని రనడే చెప్పారు. రనడే చేసిన ఆర్థికవృద్ధి ఆలోచనకు; జనాభా, పరపతి, పెట్టుబడి, ఆర్థిక రక్షణ మొదలైన ఇతర విషయాలకు సంబంధించిన రాజ్యాంగయంత్రం చర్యలమీద అతని ఆలోచనకు సంబంధమున్నది. కేవలం వ్యవసాయంమీద ఆధారపడ మాత్రమే ఏ దేశం కూడ సౌభాగ్యవంతం కాజాలదని ఆయన గట్టిగా అనుకున్నారు. దేశం బలపడటానికి పారిశ్రామిక ప్రాతిపదిక అవసరము. వ్యవసాయం నిజంగా ఉత్పాదకత గలదిగా ఉండటానికి దానికి దగ్గరలో వ్యవసాయేతర విపణి ఉండాలని, అలా కానిపక్షంలో దీనికి ప్రత్యామ్నాయంగా వ్యవసాయోత్పత్తులకు దగ్గరలో ఎగుమతి విపణి వీధి ఉండాలని జాన్ స్టువర్ట్ మిల్ చెప్పిన విషయంతో రనడే ఏకీభవించారు. కాని ఇండియావంటి దేశాల్లో ఎగుమతి విపణివీధి స్థానిక పట్టణ విపణి వీధికి ప్రత్యామ్నాయం కాజాలవు. భారతీయ చేతికళలు, పరిశ్రమలు నాశనమైపోతూవున్న కాలంలో పట్టణీకరణ జరిగే ప్రతిక్రియకు బదులుగా, గ్రామికరణ జరిగే ప్రక్రియ అమలు జరిగింది. ఇందువల్ల ఆర్థికశక్తి, స్వయంనిర్భరత దెబ్బతిన్నవి. పట్టణ విపణి వీధులులేని లోపంవల్ల వచ్చిన నష్టాన్ని అచ్చటచ్చట ఉన్న మిలటరీ స్టేషన్లు, రైల్వేలు తీర్చలేకపోయినవి.

రనడే ఆలోచన ప్రకారము దేశజనాభాకు ఆర్థికవృద్ధికి సన్నిహిత సంబంధం ఉంటుంది. దేశంలోపల జరిగిన ఉత్పాదక వనరుల పంపిణీ కనుసారంగా దేశంలోని వివిధ ప్రాంతాలమధ్య జనాభా పంపిణీ జరగాలి. ఇందుకుగాను సమగ్ర పథకాల నేర్పర్చి ప్రణాళికాబద్ధంగా దేశంలో అంతర్గత ప్రవాసం (Internal Migration) జరిపించాలి. అధికంగా ఉన్న జనాభాను బాగా ఆలోచించి తయారుచేసిన ప్రవాస విధానాన్ని అమలు చేయడంద్వారా ఇతర దేశాలకు పంపి వారికి 'కాలనీ' లను ఏర్పర్చవచ్చును. అధిక జనాభాను విదేశాలకు ప్రవాసం పంపడానికి జనాభా నియంత్రణ విధానం ప్రత్యామ్నాయమని రనడే భావించలేదు.

పై చెప్పిన విషయాలన్నింటిని దృష్టిలో ఉంచుకుని, పారిశ్రామిక, వ్యవసాయాల అభివృద్ధి మధ్య పరస్పర నిర్భరత ఉన్నదని, ఆర్థిక కార్యక్రమాల నిర్వహణలో ప్రభుత్వం క్రియాశీల పాత్రను నిర్వహించడంద్వారా ఆర్థిక వృద్ధిరేటును వేగిత్వరణ చెయ్యాలని రనడే చెప్పారు. ఇందువల్ల పరపతి, ద్రవ్య సరఫరా, ఆర్థిక రక్షణ, పరిశ్రమ మొదలైన వాటికి సంబంధించిన విషయాల నాయన వెలుగులోకి తీసాడు. తగినట్లు ఆర్థిక వృద్ధి జరగడానికి దేశంలో పారిశ్రామికీకరణ జరగడం అవసరము. కనుచూపు దూరంలోఉన్న కాలమంతా భారతదేశం ప్రధానంగా వ్యవసాయికంగానే ఉండవలసి

వచ్చేటట్లు కన్పిస్తున్నది. అయితే బలమైన పారిశ్రామిక ప్రాతిపదికను ఏర్పర్చడానికి, బలమైన వ్యవసాయం అవసరము. వ్యవసాయాభివృద్ధికి వ్యవసాయాన్ని యాంత్రీకరణ చేయవలసిన అవసరంలేదు. ముఖ్యంగా అధిక అంగబల సరఫరాగల భారతదేశంలో వ్యవసాయాన్ని యాంత్రీకరణ చేయకూడదు. పారిశ్రామికాభివృద్ధి ద్వారాను, యాంత్రీకరణ జరగని వ్యవసాయం ద్వారాను అధిక అంగబల సమస్యను తీర్చవలెను. ఇందుకు జనాభాను ఇతర దేశాలకు ప్రవాసం పంపే విధానము తోడుకావలెను. వ్యవసాయ రంగంలో పెద్ద కమతాలు, చిన్నకమతాలు కూడా ఉండవలెను.

మూలధన సంచయ సమస్యకూడా ప్రధానమైనదిగా చెప్పబడింది. మూలధన నిధులు విరివిగా లభ్యంకాగల పరిస్థితిని రనడే గమనించారు. అయితే వాటిని ప్రోగుచేసి, ఉపయోగించడానికి తగిన యంత్రాంగంలేదు. ప్రయివేటురంగం ఈ నిధుల్ని ఆకర్షించలేకపోయింది. ప్రభుత్వం జారీచేసిన సెక్యూరిటీ పత్రాలను (ఋణపత్రాలను) కొనడానికి డిమాండ్ చాలా ఎక్కువగా పెరిగింది. అందువల్ల వాటికి ''ప్రీమియమ్'' రాజొచ్చింది ఎక్సేంజి బ్యాంకుల దగ్గరకూడా బాగా విత్త నిధులు కన్పించినవి. ఇదంతా గమనించిన తర్వాత ఈ నిధులన్నిటిని ఒక మార్గంద్వారా నడపడానికి కావలసిన విత్తసంబంధమైన మాధ్యమ శక్తులు లేకపోవడము సమస్యగా ఏర్పడిందని తేలింది. గ్రామీణ రంగంలో విపరీతంగా ప్రయివేటు వడ్డీ వ్యాపారం జరుగుతున్నది. ఈ కార్యక్రమం మంచిదిగా పరిగణించబడలేదు. ఆర్థికవ్యవస్థ సంస్థాగత ఋణదాన విధానాన్ని పెంపొందింపవలసిన అవసరమున్నది. బ్యాంకింగ్ వ్యాపారాన్ని అభివృద్ధి చేయడము ఇందుకు తోడ్పడుతుంది. ఈనాడు చాలా ఉపయోగకారిగా గుర్తించబడిన సంస్థాగత ఋణదాన విధానాన్ని రనడే ఆనాడే గుర్తించగల్గడము ప్రశంసనీయము. ఈ విత్త విధానాన్ని వివరించడంతోపాటు మూలధన, టెక్నాలజీల సంచయము బలంగల పారిశ్రామిక స్వాముల కర్తవ్యంగా రనడే చెప్పాడు. ఈ సందర్భంలో మాత్రం వ్యక్తులమధ్య ఉండవలసిన ఆర్థిక న్యాయాన్నతను ప్రధాన విషయంగా తీసుకోలేదని కొందరంటున్నారు. ఈ సందర్భంలో రెండు కారణాలవల్ల పూర్తి ఆర్థిక రక్షణ కావాలని రనడే అడగలేదు : (1) స్వేచ్ఛావ్యాపార విధానం గొప్ప అంగీకారాన్ని పొందిన ఆరోజుల్లో పూర్తి ఆర్థిక రక్షణను ప్రభుత్వం అంగీకరించకపోవచ్చు (2) స్వేచ్ఛావ్యాపార విధానం ప్రాతిపదిక బలంలో రనడేకు బాగా విశ్వాసం ఉన్నది.

అయితే పారిశ్రామికాభివృద్ధి ప్రారంభదశల్లో ఆర్థిక రక్షణ కావాలని ఆయన నమ్మకము. సమాన బలంగలవారి మధ్య స్వేచ్ఛా వ్యాపారం జరగడం న్యాయమే. ''ఆర్థిక పక్షాలు తెలివితేటలు, వనరులు విషయంలో సమానబలంతో ఉన్నప్పుడు వ్యాపారస్వేచ్ఛ ఉండవచ్చని అభివృద్ధిచెందిన ఆర్థిక సిద్ధాంతం చెబుతోంది;

పరిస్థితి ఇలా లేకపోయినట్లయితే సమానత్వ, స్వేచ్ఛల ప్రసంగము పుండును పుల్లతో పొడిచినట్లే కాగలదు.'' అందువల్ల ''ఈ దేశాల – యూరోపు, అమెరికా దేశాలు – ప్రభుత్వాలు చేస్తున్న ప్రయోగ దశలో దేశీయ పరిశ్రమల రక్షణకు 'అవకలని టారిఫ్' (Differential Tariff) మీద ఆధారపడజాలము. జర్మన్, ఫ్రెంచి ప్రభుత్వాలు సాధారణ పన్నుల విషయంలో అవలంబించిన తీరును భారతదేశంలోని బ్రిటిషుప్రభుత్వం అవలంబిస్తుందని మనము ఆశించరాదు. మనకు బోధించబడిన బ్రిటిషు అర్ధశాస్త్రము జర్మను, ఫ్రెంచి విధానాలు ఇంతవరకు అంగీకరించబడి ధారావాహికంగా వస్తున్న విధానానికి వ్యతిరేకమని చెబుతోంది. అవి అటువంటివి అయినప్పటికి, కాకపోయినప్పటికి ఫలరహిత చర్చలతో మన శాయశక్తులన్నింటిని ఉపయోగించి స్వేచ్ఛావ్యాపార విధానాన్ని జయించుదామనుకోవడం వృధా అవుతుంది'' అని రనడే వ్రాసారు.

అభివృద్ధి చేయవలసిన బాధ్యత ప్రధానంగా ప్రభుత్వంమీద ఉన్నది. అభివృద్ధికి ప్రణాళిక వేయవలసింది ప్రభుత్వం. దాన్ని అమలు జరపడంలో వ్యక్తులు నష్టపడితే దాన్ని లెక్కచేయవలసిన పనిలేదు. ఆర్థిక వ్యవస్థ పురోగమనానికి తోడ్పడవలసిన బాధ్యత, తోడ్పడే హక్కు ప్రభుత్వానికున్నవి. ఆర్థికాభివృద్ధి ప్రణాళికా రచనలో భాగంగా, రనడే, ప్రభుత్వం ''సాంస్కృతిక వ్యవస్థా విధానాన్ని ప్రయోగంచేసి చూడాలి'' అని చెప్పారు. ఆర్థిక వృద్ధిని వేగంగా జరపడానికి తోడ్పడేందుకు ప్రభుత్వరంగంలో ఆర్థిక సంస్థలను ప్రారంభించే విధానాన్ని అవలంబించాలని అర్థము. ఇటువంటి విధానాన్ని డచ్చివారు ''ఈస్ట్ ఇండీస్‌లో అవలంబించి గమనించదగ్గ విజయాన్ని పొందారు'' అని రనడే వ్రాసారు. భారత ప్రభుత్వం ఇప్పుడు అమలుపరుస్తున్న విధానానికిది వ్యతిరేకం కాదు. ఇప్పుడు ప్రభుత్వం రైతులకు తక్కావి రుణాలు, రైల్వేలకు ''సబ్సిడీ''లు అందించి సహాయంచేసే విధానాన్ని అమలు జరుపుతోంది. అయితే ఆర్థికాభివృద్ధి ప్రారంభదశలోనే రాజ్యాంగయంత్రం ఆర్థికవృద్ధికి తోడ్పడే చర్యలు తీసుకోవాలని రనడే ఉద్దేశ్యం. దీర్ఘకాల వ్యవధిలో, విదేశీయులతో వ్యాపారంలో పోటీపడడానికి, పెద్దతరహా జాయింట్ స్టాక్ కంపెనీలను స్థాపించాలి. విదేశాలనుండి మూలధన వస్తువుల్ని, సాంకేతిక నిపుణుల్ని దిగుమతి చేసుకుని మన ప్రజలకు సాంకేతిక శిక్షణ ఇవ్వడానికి వారిని ఉపయోగించుకోవాలి. ఆర్థికాభివృద్ధి ప్రారంభదశల్లో మన బ్యాంకులను, విత్త సంస్థలు మొదలైన వాటిని అభివృద్ధి చేసుకునేందుకు రాజ్యాంగయంత్రం చర్యలు తోడ్పడాలి. ఆర్థికవృద్ధి దీర్ఘకాలీన ప్రక్రియ. ఆర్థికాభివృద్ధిని సాధ్యం చేసే చర్యలకు తగిన దశలవారీగా చేపట్టడము ఆచరణయుక్తమైన విధానమౌతుంది. భారతదేశపు పేదరికాన్ని, ఒకే ఒక ఆదాయ మూలంగాఉన్న వ్యవసాయంమీద పూర్తిగా ఆధారపడటాన్ని తొలగించడము, సంతులన ఆర్థికవృద్ధిని సాధించడము మన అంతిమ లక్ష్యము. అటువంటి ఆర్థికవృద్ధిని ఏర్పర్చే పథకంలో మూలధన సాంద్రతగల పెద్దతరహా పరిశ్రమలను ఏర్పర్చాలి. శ్రామిక సాంద్రతగల చిన్న తరహా పరిశ్రమలు విదేశ పరిశ్రమల వ్యాపార పోటీముందు నిలవజాలకపోవడమే ఇందుకు కారణము. మానవశక్తికంటె యాంత్రికశక్తి ఎప్పుడూ చవకగానే లభ్యమౌతుంది. మన మూలధన వనరులు మొత్తంమీద తక్కువగా ఉన్నప్పటికి, వాటిని సమర్థవంతంగా ఉపయోగించుకోవడంద్వారా మూలధన కొరత సమస్యను తీర్చుకోవచ్చునని రనడే ఆచరణవాద దృష్టితో చెప్పారు.

## ప్రణాళికా రచన

రనడే చెప్పిన ''సాంస్కృతిక వ్యవస్థా విధానం'' ప్రకారము, రాజ్యాంగ యంత్రమ్ము, దేశాన్ని పారిశ్రామికం చెయ్యడంలో సమగ్రమైన ధనాత్మక పాత్రను నిర్వహించవచ్చు. ఆర్థిక రక్షణకూడ ఆయన ఆర్థిక ఆలోచనలో ముఖ్యమైనది. ప్రభుత్వం తన ఉపయోగార్థం స్వదేశీ వస్తువులనే కొనాలని ఆయన వాదన. ఇందువల్ల భారతీయ పరిశ్రమలు తయారుచేసిన వస్తువులకు డిమాండ్ పెరుగుతుంది. పట్టణీకరణ విధానంవల్ల కూడా ఈ డిమాండ్ పెరుగుతుంది. పారిశ్రామికీకరణ సహజంగా పట్టణీకరణకు త్రోవ తీస్తుంది. పట్టణీకరణ జరగడంతో ''ఉన్నతోన్నత ప్రయోజనాన్ని నిమ్నాతి నిమ్నమైన ఖర్చుతో పొందవచ్చు'' అని డి. జి. కార్వే 'రనడే అండ్ ఎకనామిక్ ప్లానింగ్' అని తాను ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో వ్రాసిన వ్యాసంలో చెప్పారు. వరపతిని ఆర్థిక వ్యవస్థ విశృంఖలత్వాన్ని పూర్తిగా పునర్నిర్మాణం చేయడంతోపాటు సాంకేతిక శిక్షణ సంస్థలను స్థాపించడంద్వారా ఆర్థికాభివృద్ధికి తోడ్పడాలి. అంతర్గత ప్రవాసం చేయించడంద్వారా ప్రజలను వనరులున్న చోటకు మార్చడము, అధిక జనాభాను ఇతర దేశాలకు ప్రవాసం చేయించడము అవసరము.

(సశేషం)



# ఎక్స్‌క్యూజ్ మీ

## శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు

కమిటెడ్ కవిత్వం కాదు నాది
కమనీయం కాకపోదు నా వీధి

నా వీధిలో —

అందమైన అమ్మాయిలు అనాకారి అబ్బాయిలను
ప్రేమిస్తారు
అన్నార్తులు సైతం అభిమానంతిని జీవిస్తారు —

ఆనందాల అపవాదాలు
ఖేదంలో మోదాలు
నా పదాల పేదాలు —

నా పథంలో —

కవిత్వపు రహస్యాలు దాక్కునే దిక్కులు
విరిగిపోయిన పావురాళ్ళ రెక్కలు
అరిగిపోయిన పావుకోళ్ళ డెక్కలు
అమావాస్య గగనంలో మిడిమేలపు చుక్కలు

నా అక్షరాలు చంటివి
అవిటివి — కుంటివి
ఆకాశమంత యింటివి —

పన్నీటిలో స్నానం చేశాక చెరచబడ్డ అనుభవాలు
కన్నీటిని గానం చేశాక పిసకబడ్డ బాధాగళాలు
ఒకోసారి కష్టాల కారడవుల్లో చిక్కిన చిద్విలాసాలు
మరోసారి యిష్టాల రసరాజ్యసింహాసనాన మహారాణి
మందహాసాలు.

నా పదాలు వేదాలు
అందాల అనువాదాలు
అనుభవాల నాదాలు.

---

# అంతర్యుద్ధం

## శ్రీ సూరం శ్రీనివాసులు

నా కోరికలన్ని నా కళ్ళకే గంతలుకట్టి
నాతోనే దాగుడుమూతలాడే రోజుల్లో
దేన్నో దాన్ని పట్టుకొని నా గంతలు
దాని ఒళ్ళంతా చుట్టి నేను
ఎక్కడో ఏ మూలనో దాక్కుందామనుకున్నాను —
కానీ నిముషాలు యుగాలు గడిచిపోతున్నా
తరాలు అంతరాలు పెరిగిపోతున్నా
నా కళ్ళను గంతలు విడవటంలేదు
నా చూపులు లోకంలో అడుగెట్టడంలేదు
కనీసం చీకటి వెలుగులకు తేడా తెలుసుకుందామన్నా
కళ్ళను కలలను కలిపిచూద్దామన్నా
అవకాశం లేదు అందుకే విసుగెత్తింది
ఇప్పుడు నాకున్నదల్లా ఒకే ఆలోచన
ఎవరు నా చేతికి చిక్కినా చిక్కకున్నా
బలవంతంగా నా గంతలు నేనే
విప్పుకొని సాగిపోవాలి
చెట్టు చెట్టుకు పోయే విహంగం లాగానో
పుట్ట పుట్టను దాటే కురంగం లాగానో!

డా. కోవెల సంపత్కుమారాచార్య

# భారతీయ సాహిత్య విమర్శ : అవతారిక

తెలుగులో ఈనాడు సాహిత్య విమర్శరంగాన్ని నిశితంగా పరిశీలిస్తే, దాదాపు రెండు వేలేండ్లకింకా పూర్వుడుగానే భావింపబడుతున్న 'నాట్యశాస్త్ర' కర్త భరతుడి నాటినుంచీ — అంతకు పూర్వంనుంచే సాగుతున్నా, ఆ పూర్వమెంత 'పూర్వ'మో తెలిసే అవకాశం ప్రస్తుతానికి లేదు కాబట్టి, ఆనాటి నుంచీ అవిచ్ఛిన్నంగా సాగివస్తున్న భారతీయ సాహిత్య విమర్శ రీతిని, సంప్రదాయాన్ని అవగాహన చేసుకొన్న, గాఢంగా అధ్యయనం చేసిన, లేదా చేయవలసిన అవసరం ఉన్నదనే ఆలోచనయినా సువ్యక్తంగా సాగుతున్న దాఖలా అంతగా కనిపించటం లేదు. ఇవిట్లా ఉండగా, దాదాపు వందేళ్లుగా రసం, అలంకారం, ధ్వని వంటి ప్రసిద్ధ సాహిత్య శాస్త్రీయ పదాలూ, 'వాక్యం రసాత్మకం కావ్యం, రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం' వంటి వాక్యాలూ, నిర్వచనాలూ వాటిసందర్భాలనూ, పూర్వాపరంగా చర్చించబడిన, విచారించబడిన అంశాలనూ పట్టించుకోకుండా, విచక్షణా రహితంగా, పిడుక్కీ బియ్యానికీ ఒకే మంత్రమన్న ధోరణిలో యాదాలాపంగా ఉదాహరిస్తూపోయే వాటి అనంతరీన — ఫలితాలను గమనించకుండా సరదా తీర్చుకునే అలవాటు — ఏవో కొన్ని సందర్భాల్లో తప్ప — క్రమక్రమంగా పెరుగుతూ ఈనాటికి విరివిగా వ్యాపించింది. ఈ విధమయిన 'యాదాలాపత్వం', అలవాటూ కారణంగా వాటి అంతర్యం మరుగున పడిపోయి, అవన్నీ పాతబడ్డ మాటలుగా, కాలంచెల్లిన అభిప్రాయాలుగా, 'ఆధునిక' విచారధారకు అనుకూలం కానివిగా, పట్టించుకోనవసరం లేనివిగా భావించేధోరణికి, భ్రాంతికి పలుకుబడి పెరుగుతున్నట్టు గూడా కనిపిస్తుంది. ఉటంకింపులను ఉటంకించటంలో, వాటినిబట్టి నిర్ణయానికి రావటంలోనూ ఉన్న ఆస్థమౌలికంగా అధ్యయనం చేసేందుకు కన్పించక పోవటంతో రకరకాల భ్రాంతుల కాస్కారం కలుగుతున్నది. కాగా, ఈనాడు సాహిత్య విమర్శరంగంలో ప్రచలితంగా ఉన్న వివిధ దృక్పథాల, ధోరణుల పరివేషంలో భారతీయ సాహిత్య విమర్శ రీతి అసలేమయినా ఉపయోగిస్తుందా, ఉపయోగిస్తే ఎంతవరకు, ఏవిధంగా— ఈ మొదలయిన అంశాలను పరిశీలించుకోవలసిన అవసరం ఎంతగానో అవసరమవుతున్నది. ఆ అవసరాన్ని గుర్తించేందుకొక ప్రేరణగా మాత్రమే ఈ సాహిత్య విమర్శ రంగంలో చర్చింపబడుతున్న, చర్చింపబడవలసిన అంశాలన్నీ విచారించే అవకాశం ప్రస్తుతం ఈ వ్యాస పరిధికి అసాధ్యం కాబట్టి కొన్నిటిని గూర్చి — స్థూలంగానే కావచ్చు—విచారించే ప్రయత్నంగానే ఈ వ్యాసం రూపొందుతున్నది.

ఎప్పుడయినాసరే, ఎక్కడయినాసరే, సాహిత్యవిమర్శ అనగానే ఓంప్రథమంగా కలిగే ప్రశ్న 'సాహిత్యమంటే ఏమిటి?' ఈనాడే కాదు, ఆనాడు కూడా—అంటే, సాహిత్యమన్న పదం రూపొందిన్నాటి కూడా అనేక ప్రక్రియలకు సామూహికంగా, ఉమ్మడిగా ఆ పదం వ్యవహారంలోఉన్నది. అవి గద్యమయాలయినా, పద్యమయాలయినా, రూప(నాట)కాలయినా, కథలయినా, ఆఖ్యాయికలూ, ఆఖ్యానాలూ, ఉపాఖ్యానాలూ — ఇట్లాంటివేవయినా సరే, అవన్నీ ఏకమొత్తంగా 'సాహిత్యం' గానే వ్యవహరింపబడుతున్నాయి. ఇక్కడే గమనించవలసిన మరో అంశమేమిటంటే, సాహిత్యంగా వ్యవహరింపబడే ఈప్రక్రియా రూపాలన్నీ 'కావ్య'మని గూడా వ్యవహరింపబడటం. ఈనాడంతగా ఈ విధమయిన వ్యవహారం సర్వసామాన్యం కాకున్నా పూర్వం ఈ వాడుక విరివిగా ఉండేది. 'కావ్యేషు నాటకం రమ్యం' — నాటకం కావ్యాల్లో రమ్యమయింది-అనే ప్రసిద్ధమయిన నానుడి ఈ అంశానికి దిక్సూచి. ఒక నాటకమే కాకుండా కాదంబరి, దశకుమార చరిత్ర వంటి గద్యమయ రచనలూ, రఘువంశాది పద్యమయ రచనలూ, ముక్తకాల సంకలనా లయిన గాథా సప్తశతి, అమరుక శతకం వంటివీ కూడా కావ్యాలుగానే వ్యవహరింపబడటం ప్రసిద్ధవిషయమే కాగా, ఈ కావ్యం — సాహిత్యం అన్నవి ఒక విధంగా పర్యాయ పదాలు. 'ఒక విధంగా' ఎందుకంటే, పర్యాయ పదాలుగా కనిపిస్తున్నా వీటి చరిత్ర మార్గాలువేరు. ఈ రెంటిలో 'కావ్యం' ప్రాచీనతరమయింది, ఆద్యమయిందికూడా. కాగా ఈనాటికీ అన్ని విధాలయిన ప్రక్రియలకూ ఉమ్మడిగా వ్యవహరింపబడుతున్న 'సాహిత్య' చరిత్ర స్థూలంగా నయినా సరే, గమనిస్తే, సాహిత్యమంటే ఏమిటో గూడా స్పష్టపడుతుంది. ఆ తరువాత 'కావ్య' విషయం.

ఇటీవలి యేండ్లలో—హితంతో కూడింది, అంటే హితం కలిగించేది, లేదా హితం తెల్పేది 'సహిత' మనీ, దాని భావం సాహిత్యమనీ విరివిగా చెప్పటం జరుగుతున్నది. కాని, ఈ విధంగా నిర్వచించుకుంటే, హితం కలిగించే శాస్త్రాలూ— ఇంకా ఆ విధమయిన, ఆ లక్షణం కలిగి ఉన్న ఇతరేతర రచనలన్నీ కూడా 'సాహిత్యం' కావలిసే వస్తుంది. అదీగాక, హితమన్నది కేవలం 'సాహిత్య'మాత్ర పరిమిత మేమీ కాదు. హితం సాహిత్యం ద్వారా వ్యక్తమయితుంది. అందుకు అభ్యంతరం చెప్పవలసిందేమీ లేదు. కాని, కేవలం దాని వల్ల మాత్రమే అది 'సాహిత్యం' కావటం లేదు. అందువల్ల ఈ విధమయిన నిర్వచనాలను 'స్వైరస్యాలు'గనే భావించవలసిఉంటుంది. కాగా, భారతీయ సాహిత్య విమర్శ మార్గంలో ఈ 'సాహిత్య'మన్నది ఏ విధంగా—సార్థకంగా భావించబడిందో, విచారించబడిందో గమనించవలసి ఉంది.

భారతీయ కావ్యానుశీలన మార్గంలో ఇప్పటికి తెలియ వచ్చినంత వరకు 'సాహిత్య' పదాన్ని తొలిగా, ఆలోచనా పూర్వకంగా

గ్రంథస్థం చేసిన మహావిమర్శకుడు 'కావ్య మీమాంస' చేసిన రాజశేఖరుడు. ఈయన్నే 'యాయావరీయుడు' అని కూడా అంటారు. ఈయన భార్య అవంతిసుందరికూడా గొప్ప సాహిత్య విమర్శకురాలు. 'అయిదవది సాహిత్య విద్య' అన్నాడు రాజశేఖరుడు. పౌరాణిక మార్గంలో ప్రతీకాత్మకంగా 'సాహిత్య విద్య' దేవితో 'కావ్య' పురుషుడికి వివాహం జరిపించి కావ్య – సాహిత్యాల ఏకీభావాన్ని సూచించినాడు. అయితే, 'సాహిత్య' పదాన్ని ప్రథమంగా గ్రంథస్థం చేసింది రాజశేఖరుడే అయినా, అది అంతకుముందే రూపొంది వ్యవహారంలో కెక్కింది. అసలు ఆ పదం రూపొందటానికి దారి చూపిన మహానుభావుడు భామహుడు. భరతుని బట్టి రెండోవాడే అయినా, భారతీయ సాహిత్య విమర్శకులలో మౌలికంగా చాలా విషయాలు ప్రతిపాదించిన వాడాయన. కావ్యనిర్వచనం చేస్తూ ఆయన సహితాలయిన శబ్దార్థాలు 'కావ్య' మన్నాడు. అంటే, శబ్దార్థాల 'సహితత్వం' కావ్యమని. ఈ 'సహితత్వ' మన్నదే 'సాహిత్య' పద రూపకల్పనకు ప్రేరేపించింది. 'సహిత'పదం ఒక భావప్రత్యయం (—దానియొక్క భావం అనే అర్థంలో పదానికి చేరే ప్రత్యయం) చేరి 'సహితత్వం' అయితే, మరో విధమయిన భావప్రత్యయం చేరగా 'సాహిత్య' పదం రూపొందింది. రెండు తకారాల క్రమాన్ని ఉచ్చరించటంలోని క్లేశాన్ని పరిహరించుకొని 'సాహిత్యం' వ్యవహారంలో ప్రచురమై స్థిరపడిపోయింది. మరి, ఈ 'సహితత్వ' మంటే ఏమిటి? — దీన్ని పరిశీలించి భావించినవాడు రాజశేఖరుడు. ''శబ్దార్థలయొక్క 'యథావత్ సహభావం'—సమాన స్థాయిలో కలిసి ఉండటం సాహిత్య విద్య'' అని సూత్రప్రాయంగా తన పరిశీలితాంశాన్ని వ్యక్తీకరించినాడు. ఆయన తరువాత ఈ అంశాన్ని కుంతకుడు విపులంగా వ్యాఖ్యానించినాడు.

శబ్దార్థాలెప్పుడూ సహితాలే-అంటే, కలిసి ఉండేవేకాని ఒకదాన్ని వదిలి మరొకటి ఉండదు. వాక్–అర్థాలవలె 'పార్వతీపరమేశ్వరులు సంపృక్తాలు—అవినాభావంగా కలిసి ఉన్నారు—అని కాళిదాసు అన్నాడు. అందుకని, నిజానికి, సహితాలయిన శబ్దార్థాలని చెప్పవలసిన అవసరంలేదు. అయితే, శబ్దార్థాలు కావ్యమంటే, ఇక కావ్యం కానిదంటూ ఏదీ ఉండదు. భాషాప్రయుక్తమయిన సర్వవిధ వ్యవహారాలూ 'కావ్య'మే కావలసివస్తుంది. ఒకవిధంగా భాషకు పర్యాయపదమయిపోతుంది. ఈ స్థితిని నివారించటానికే భామహుడు 'సహితత్వం' చెప్పవలసి వచ్చింది. శబ్దార్థాలకు సహజంగానే ఈ 'కలిసి ఉనికి' అనేది ఉండగా, మళ్ళీ దాన్నే ప్రత్యేకంగా చెప్పటం జరిగిందంటే ఆ 'సహితత్వం' అనేది ఏదో ఒక విశేషాంశాన్ని ఉద్దేశించి చెప్పబడిందనుకోవలసి ఉంటుంది. ఆ విశిష్టతను 'యథావత్సహభావ మని రాజశేఖరుడంటే, భామహ—రాజశేఖరులను ప్రమాణీకరించి కుంతకుడు ఆ సహభావాన్ని విపులంగా వ్యాఖ్యానించినాడు.

ఏదోఒక అసాధారణమయిన చమత్కారం భాసించేవిధంగా శబ్దార్థాలయొక్క సహభావం, సహితత్వం — కలిసి ఉండటం మాత్రమే సాహిత్యమయితుంది. ('చమత్కారం, రమ్యం, రమణీయం, శోభ'—వంటి అనేక పదాలకు కుంతకుడు సాహిత్య విమర్శ మార్గంలో ప్రాచుర్యం కలిగించినాడు. ఆ తరువాత విశ్వేశ్వరుడూ, జగన్నాథ పండితరాయలూ, హరిప్రసాదుడూ విపులంగా వీటిని వివేచించినారు) కలిసి ఉండే ఈ శబ్దార్థాల్లో ఏ ఒకటి మరొదానికన్నా తక్కువ స్థాయిలోగానీ, ఎక్కువ స్థాయిలోగాని కాక, అంటే—కుంతకుడి మాటల్లో 'అన్యూనాతిరిక్తం'గా సమస్థాయిలో ఉంటయి. కాని, ఇంతటితో మాత్రమే ఆగకుండా కావ్యమంతటా ఈ శబ్దాలూ—అర్థాలూ పరస్పరం స్పర్థించుకుంటూ—పోటీపడుతూ ఉండటంవల్ల ఒకానొక విధమయిన శోభ—సౌందర్యం, ఆహ్లాదం ఉద్బుద్ధమయితుంది. కాబట్టి, ఈవిధమయిన శబ్దార్థాల 'సహితత్వం'—యథావత్ సహభావం మాత్రమే 'సాహిత్యం'. ఈవిధమయిన సాహిత్యరీతిని రకరకాలయిన ఉదాహరణలతో తన 'వక్రోక్తి జీవితం' (ఈ గ్రంథం పేరు ఇదేనా, కాదా?—ఇంకా నిర్ధారించుకోవలసిన అవసరం ఉంది. కాని, ప్రస్తుతానికింతే. ఇందు)లో విస్తరించి నిరూపించినాడు. కుంతకుని ఈఅభిప్రాయాన్నే ఉద్దేశిస్తూ ఆధునికంగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణ రామాయణ కల్పవృక్షం(బాల.అవ.25)లో—'పాలితాన్యోన్యలంఘన స్పర్ధములును, చాలితాన్యోన్య సౌందర్య సరసములును నైన పలుకుల కూడిక యనగనొప్పు, శారదాదేవి...'గా వ్యక్తీకరించటం జరిగింది. కాగా, రచన అనేది కేవలం ఏవో కొన్ని పదాలను కూర్చటం ఏదోవిధంగా కాకుండా, అందులోని శబ్దాలూ—అర్థాలూ పరస్పరం సమత్వం పాటించుకుంటూనే స్పర్థించుకుంటూ, ఈ అన్యోన్యత్వం కారణంగా ఒకానొక అసాధారణ చమత్కారాన్నీ, సౌందర్యాన్నీ ఉద్బుద్ధం చేసుకుంటూ ఉంటేనే, ఆ రచన 'సాహిత్య'మయితుంది. ఈవిధమయిన స్థితి ఏదో ఒక ప్రక్రియకు మాత్రమే కాక అన్నివిధాలయిన ప్రక్రియలకూ వర్తించుతుంది కాబట్టే, అన్నింటికీ సామూహికంగా, ఉమ్మడిగా ఈ 'సాహిత్యం' వ్యవహారంలో స్థిరపడటానికి వీలయింది. రచనలో శబ్దార్థాలకు సంబంధించి ఈ విశిష్టమయిన సహితత్వం ఏనాడయినా, ఎవరికయినా అంగీకార్యమయిన అంశమే. అర్థాన్ని వ్యక్తీకరించే పదాలూ, ఆ పదాలద్వారా వ్యక్తం కావలసిన అర్థాలూ పరస్పరం పొందికలేకుండా, అసమన్వితంగా, అనాకర్షకంగా ఉండాలనీ, ఉన్నా ఫరవాలేదనీ ఎవరూ అనుకునే ఆస్కారంలేదు. కాగా, మరీ లోతులకు పోకుండా, వివరాలను విస్తరించుకోకుండా స్థూలంగానే గమనించినా, సాహిత్యమంటే భారతీయ సాహిత్య విమర్శరీతి భావించిందది. ఈ స్థితికి భిన్నంగా 'సాహిత్య'పదం ప్రయోగింపబడితే, అక్కడ కేవలం గౌణంగానే అని భావించవలసి ఉంటుంది.

ఇంతవరకు గమనించిందాన్నిబట్టి 'సాహిత్య'మన్నది వాహికఅయిన భాష, అభివ్యక్తం కావలసిన అర్థం ప్రాతిపదికగా రూపొందినట్లు స్పష్టమయితుంది. మరి, ఇందాకా ఆ వివరించుకొన్న స్థితి' ఏ విధంగా కలుగుతుంది? ఈ అంశాన్ని గూర్చి అలనాడు భామహుడు స్థూలంగా భావించి సూచిస్తే, అనంతరకాలాన కుంతకుడు దాన్ని విశేషంగా వివేచించటం జరిగింది. ఈ వివేచన ఫలితంగానే, కుంతకుని 'వక్రతా' సిద్ధాంతం రూపొందింది. 'ప్రసిద్ధాభి ధాన వ్యతిరేకమయిన—అంటే, లోకసామాన్య వ్యవహారానికి భిన్నమయిన, ప్రవృత్తిని శబ్దార్థాల ప్రయోగానికి సంపాదించటమే స్థూలంగా చెప్పాలంటే—'వక్రత'. ఆధునికంగా కూడా సామాన్య వ్యవహార భాష

కన్నా సాహిత్య భాష భిన్నంగా ఉంటుందనీ, అందులో 'వక్ర' (deviant) ప్రయోగముంటుందనీ, ఆ విధమయిన ప్రయోగరీతి కారణంగానే సాహిత్యభాష సామాన్యభాషతో భేదిస్తుందనీ, స్థాయిలో పెరుగుదల ఏర్పడుతుందనీ భాషాశాస్త్రవేత్తలు అభిప్రాయపడు తున్నారు. కుంతకుడు శబ్దప్రకృతులు, ప్రత్యయాలూ, విభక్తులూ, వాక్యాలూపదపూర్వార్ధాలూ — ఈ మొదలయిన అనేకాంశాలద్వారా వక్రత సంపాదింపబడే రకరకాల రీతులను వివిధోదాహరణలతో విస్తారంగా వివరించినాడు. అయితే, కుంతకుడి ఈ 'వక్రతా' సిద్ధాంతం కేవలం ఈ అంశాలవరకు మాత్రమే పరిమితమయి ఊరుకోలేదు. అలంకార ప్రయోగం, వస్తునిర్వహణ, సన్నివేశ కల్పన, సంఘటన సంవిధానమూ, ధ్వనిసంపాదనమూ, రసప్రతీతీ—ఈ అంశాలన్నిటికి కూడా వర్తించిన విస్తృత సిద్ధాంతం. వక్రతయొక్క ఈ సర్వవ్యాపకత నిరూపించబడింది. 'మహాకవుల కావ్యాలన్నింటిలోనూ ఈ వక్రత ఉండనే ఉంది' అని నిర్ధారించినా డాయన రకరకాల ఉదాహరణలతో. ఆయన ఈ నిరూపణకు కావ్యాలే ఆధారం, లక్ష్యమున్నూ. కాగా, కాగా 'సాహిత్య'మనేది 'వక్రతా' మహితం కావటమనేది సహజంగా జరుగవలసిన విషయం.

పదాలూ —అర్థాలూ మొదలయిన సామగ్రి దృష్ట్యాతో ఈ సాహిత్యం రూపొందగా, 'కావ్యం' మరొక పద్ధతిలో రూపొందింది. 'లోకోత్తర కవి కర్మకావ్య' మన్నాడు హేమచంద్రుడు. భారతీయ సాహిత్య విమర్శ మార్గంలో తరుచుగా 'లోకోత్తర, అలౌకిక'వంటి పదాలు ఉపయోగంలో కనిపిస్తుంటాయి. వీటినిబట్టి అప్పుడప్పుడూ, కొందరికీ 'లోకానికి సంబంధంలేని' అనే భ్రాంతి కలుగుతూ ఉంటుంటుంది. నిజానికి, ఈ పదాలన్నింటికీన్నీ, 'లోకంలో సామాన్య స్థాయికన్నా అతిశయించిన' అని మాత్రమే తాత్పర్యం. ఆ స్థాయియొక్క అతిశయంలో అంతరాలు అనేకంగా ఉండటం వేరేవిషయం. కావ్యంగానీ, సాహిత్యంగానీ లోకానికి సంబంధించింది, లోకంకోసం ఉద్దేశించిందే తప్ప వేరేకాదు. సామాన్య వ్యవహారంలో కూడా ఈ విధమయిన పదాలకు ఈ అభిప్రాయంతోనే వ్యవహారం సాగుతూండటం గమనించవలసిన అంశం. కాగా, కవికర్మ లోకోత్తరమంటే, లోకసామాన్యస్థాయిని విశేషంగా అతిశయించిందని తాత్పర్యం. ఇట్లాంటి కవి కర్మ—కవి వ్యాపారం 'కావ్యం'. కావ్యం కవి వ్యాపారమంటే, అతి పరిణమించిన రూపం అని అందరూ అంగీకరించిన విషయమే. 'కవి వ్యాపార వక్రత' అని కుంతకుడనటంలో కావ్య వక్రత అనేదే తాత్పర్యార్థం. ఆనందవర్ధనుడు మొదలయిన విమర్శక మూర్ధన్యులందరూ ఆ విధంగానే వ్యవహరించినారు.

మరి, ఈ కవి వ్యాపారం ఏ రూపంలో, ఏ పరికరసామగ్రితో సాగుతుంది? రంగులుగానా? రాళ్లుగానా? ఇంకేదయిన రీతిలోనా? అవన్నీ చిత్రకారుడూ—శిల్పీ మొదలయినవారి సామగ్రీ విషయాలు. కవి వ్యాపారం శబ్దార్థాలకు సంబంధించింది. అందుకనే, మొట్టమొదటిసారిగా కావ్యనిర్వచనం చేసిన భామహుడు శబ్దార్థాలను కవి వ్యాపారానికి భూమికగా చేయగా అనంతరీనులు ఆయన దారిలోనే సాగినారు. కాగా, 'కావ్య'మనేది శబ్దార్థపరమయిన వ్యాపార పరిణామ రూపంగా కవిని ఆశ్రయించుకొని రూపొందింది. ఈకావ్యంతో బాటే మరొకటి ఉంది—అది 'కవిత్వం'. కావ్యమనేది కవి వ్యాపార పరిణామరూపంకాగా, ఈ కవిత్వమనేది కవియొక్క లక్షణం. కవిని బట్టి కవి లక్షణం ఏర్పడుతుంది-నిశ్చితమయితుంది. ఈ లక్షణాన్నిబట్టి కవి గుర్తింపబడుతాడు. ఇవి పరస్పరం ఆశ్రయించుకొన్న అంశాలు. కాగా కావ్యం-కవిత్వం అనే ఈ రెండింటికీ భూమిక (base) అయిన కవి ఎవరు?

కవిని గూర్చిన విచారణ భారతీయ సాహిత్య విమర్శ రంగాన సుదీర్ఘంగానూ, సువ్యవస్థితంగానూ సాగింది. సంస్కృత భాషలో శబ్దాలు దాదాపుగా అన్నీ వ్యుత్పన్నాలు. అంటే, వాటికి మూలమయిన ధాతువులూ ప్రాతిపదికలూ వాటినిబట్టి వీటి అర్థాలూ నిరూపితమయితాయన్నమాట. ఈ వ్యుత్పన్నత అంతా శబ్దశాస్త్రంలోని రకరకాలయిన ప్రక్రియా రీతులతోడి పరిణామ వికాసాలకు సంబంధించింది. ప్రస్తుతానికి, కు లేదా కౌ, కవృ అనే ధాతువులాధారంగా కవిపదం నిష్పన్నమయితున్నది. మొదటి దానికి శబ్దీకరించటం, విమర్శించటం, అని అర్థాలు. వీటినిబట్టి భట్టగోపాలుడు 'శబ్దాలను వాహికగా తీసుకుని రస — భావాలను విమర్శించుకుంటూ రచన చేసేవాడు కవి' అన్నాడు. ఇది ఆయన వివరణ. ఇంక రెండోధాతువు—కవృ అనే దానికి వర్ణించటమని అర్థం. కాగా 'వర్ణనా నిపుణుడు కవి' అని చెప్పబడింది. వర్ణించటమంటే, ఒక విషయాన్ని, వక్తవ్యాంశాన్ని ఆకర్షణీయంగా ప్రస్తుతీకరించటమని తాత్పర్యం. ఎక్కడయినా అంతే. సామాన్య వ్యవహారంలో ఈపదాన్ని వర్ణించటమనేదాన్ని ప్రయోగించటంలోనూ ఇదే తాత్పర్యం అంతర్గతంగా ఉండేది. కాగా, పై రెండంశాలను సమన్వయించుకొంటే ఒక విషయాన్ని విమర్శపూర్వకంగా రచనలో ఆకర్షణీయంగా వ్యక్తం చేయగలవాడు కవి.

అయితే, ఈ మాత్రంతో కవికి సంబంధించిన విచారణ ఆగిపోలేదు. చాలా ముందుకు సాగింది. శబ్దార్థాలను వాహికగా తీసుకోవటం, వర్ణనిపుణత్వం—వీటితోనే సరిపోదు. అతనికి 'ఋషిత్వం' మౌలికంగా అవసరమయిన అంశంగా భావించబడింది. ఋషి అంటే జ్ఞానమూ, క్రాంతదర్శనమూ కలవాడని అర్థం. లోకమందంతటా వ్యాపించి ఉన్నదాన్ని దర్శించటం క్రాంతదర్శనం. లోకమంటే దర్శింపబడేది అని. దర్శింపబడవలసినదంతా లోకంలో ఉంది. ఆ ఉన్నదంతా ద్వంద్వాత్మకత. ఈవిధంగా ద్వంద్వాత్మకమయిన లోకం సువ్యవస్థితంగా ఉండేట్లు చేసేది ధర్మం. కాగా, జ్ఞానిఅయి, లోకాన్ని తెలిసి, ధర్మాన్నీ-ధర్మసూక్ష్మాలనూ దర్శించటమనేది—దర్శించగలగటమనేది ఋషిత్వం. ఆద్యులయిన మహాకవులందరూ మొదట ఋషులు. వారి కావ్యాలు వారి యీ ఋషిత్వాన్ని స్పష్టపరుస్తూ ఉంటాయి. ఈ ఋషిత్వ సమాకలనంవల్ల రచన లోకోపకారకంగా రూపొందుతుంది. ఈ అంశాన్ని గమనించిన భారతీయ సాహిత్యవిమర్శ కవికి ఈ ఋషిత్వం మౌలికంగా ఉండవలసిన అంశంగా నిరూపించింది. ఈ విధమయిన అవగాహన కలిగిన భట్టతౌతుడు—మహావిమర్శకుడయిన అభినవగుప్తుని గురువుగారు—కవిని గూర్చి ఈవిధంగా వివరించినాడు:—ఋషి కానివాడు కవి కాడని చెప్ప

బడింది. దర్శనంవలన ఋషిత్వం కలుగుతుంది. దర్శనమంటే విచిత్రభావ ధర్మాంశతత్త్వ ప్రఖ్య (స్పష్టమైన చూపు). ఈ తత్త్వదర్శనంవల్లనే శాస్త్రాల్లో కవి ప్రశంస జరిగింది. దర్శన వర్ణనలవల్లనే లోకంలోనూ సర్వత్రా 'కవి' శబ్దం రూఢమయింది. కేవలం దర్శనం స్వచ్ఛంగా, నిత్యంగా ఉన్నంతమాత్రాన చాలదు. ఇవి ఉన్నా కూడా వర్ణన జరుగనంతవరకు ఆదికవి అయిన వాల్మీకికి కవిత (కవిలక్షణం) లోకంలో రూఢంకాలేదు! భట్టతౌతుని ఈ వివరణ చాలా అంశాలను గర్భీకరించుకొన్నది. కాగా, లోకాన్నీ, విచిత్రమైన లోక భావాలనూ—భావాంశాలనూ, ధర్మాన్నీ—ధర్మాంశాలనూ, వాటియొక్క తత్త్వాన్నీ అవగాహన చేసుకొని లోకకల్యాణ మార్గాన అవగాహన చేసికొన్న అంశాన్ని వ్యక్తీకరించటంతో వర్ణనానైపుణ్యం సమన్వితం కావటమే కవిత్వం—కవిలక్షణం. ఇది భారతీయ సాహిత్య విమర్శ కవిని గూర్చి భావించింది. కేవలం వర్ణనా నైపుణ్యంతో మాత్రమే 'కవి'గా చలామణీ అయ్యేవాళ్లు ఎప్పుడూ పలుమంది ఉంటూనే ఉంటారు. 'కేవల కవయస్తు కేవలం కవయః' అనే వాడుక ఇట్లాంటి వారిని గూర్చే ఏర్పడింది. అంటే, అట్లాంటి వారి విషయంలో కవి శబ్దం కేవలంగానే ఉపయోగపడుతుంది తప్ప సమగ్రత్వంతోకాదు. 'కాళిదాసాదులూ కవులే, మేమూ కవులమే. కాని, పర్వతానికీ పరమాణువుకీ ఉన్నంత పరిమాణభేదం మాలో ఉన్నది' అన్నాడొక మహానుభావుడు. తానూ కవే అయినా, 'కవి' అనేది తనవంటివారి విషయంలో కాక, కాళిదాసాదులవంటి వారియందే సమగ్రత్వం పొందుతుందని ఆయన నిష్కర్షిస్తున్నాడు. తాను వర్ణనా నైపుణ్యంమాత్రం కలవాడు. కాళిదాసాదులు ఋషిత్వంతో సమన్వితమయిన వర్ణనా నైపుణ్యం కలవారు. అందుకనే—'అతి విచిత్రమయిన ఈ కవి పరంపరా వాహినిలో కాళిదాసాదులవంటి ఏ నలుగురయిదుగురో మాత్రమే మహాకవులు' అని ఆనందవర్ధనుడు తేల్చి చెప్పినాడు. ఈ 'కవి సమాజం'—పరంపరగా సాగుతూనేఉన్న దీనిలో చిత్రవిచిత్ర ప్రవృత్తులుగలవారు అనేకులుంటారు. వారిని గమనించి, కవి శబ్దం సమగ్రత సంపాదించుకొన్నవారిని లక్షించుకోవలసిఉంటుంది. కాగా, భట్టతౌతుడు నిరూపించిన సమగ్రతకలవాడు కవి. అట్లాంటి కవియొక్క ఆ సమగ్రత 'కవిలక్షణం' — అంటే, 'కవిత్వం'. అతనియొక్క వ్యాపారం పరిణమించినరూపం కావ్యం. ఈ కవి వ్యాపారంగా పరిణమించిన కావ్యంలో ఆ కవి లక్షణమయిన 'కవిత్వం' వ్యాపించి ఉంటుంది. కాగా కావ్యాన్నిబట్టి కవిత్వమూ, దాన్నిబట్టి కవి నిరూపించబడటం జరుగవలసి ఉంటుంది.

ఇక్కడ గమనించవలసిన అంశం ఒకటి ఉంది. భారతీయ సాహిత్య విమర్శ, కావ్యమంటే ఏమిటి ? కావ్య బాహ్య భేదాలెన్నెన్ని విధాలుగా విస్తరించే అవకాశం ఉంది ? వాటి స్వరూప స్వభావాలేమిటి ? వాటిని లక్షించే రీతి ఏమిటి? —ఈ మొదలయిన అంశాలనే చర్చించింది కాని, కవిత్వమంటే ఏమిటి ? — ఇత్యాదిగా చర్చ సాగించలేదు. కవిత్వమనేది కవి వ్యాపార రూపమయిన కావ్యంలో లావణ్యం మాదిరి అభివ్యాప్తమయి భాసించేదే తప్ప, కావ్యమనేది లేకుండా కవిత్వమనేది ఉండటానికి వీల్లేదు. అంటే, దానికి అభివ్యక్తిలేదు దేని లక్షణమయినా దాని క్రియాపరిణతిలో భాసిస్తుందే తప్ప, అది అదిగా రూపు కట్టదు. మరొకటి. కార్య రూపమయిన కావ్య స్వరూపం తీర్చుకున్న రకరకాలయిన తీర్పులనుబట్టి రకరకాలుగా ఆ కవి లక్షణం అభివ్యాప్తమయి ఉంటుంటుంది. అందువల్ల, కావ్యం, దాని స్వరూప వైవిధ్యం, దాని స్వరూపాల స్వభావాలూ—ఈ మొదలయినవే ప్రధానంగా చర్చించవలసి ఉంటుంటుంది. భారతీయసాహిత్య విమర్శ చేసిందదే. అయితే, అక్కడకూడా ఈ అభివ్యాపించేలక్షణం స్వతంత్రంగా వ్యవహరింపబడటం కనిపిస్తుంది. విభిన్న కావ్యాల్లో అది పరిస్ఫురించే రీతులనుబట్టి భిన్న భిన్నంగా కూడా పరిగణింపబడవచ్చు. ఆ సందర్భాల్లోనూ అది కవి వ్యాపారానికి సంబంధించిందిగానేఉండటం గమనించవలసిన అంశం. కథాకవిత్వం, వర్ణనా కవిత్వం, ఆనంద కవిత్వం, ప్రయోజన కవిత్వం ఈ మొదలయిన వ్యవహారాలన్నీ కవి వ్యాపార పరిణామ రూపమైన కావ్యంయొక్క వివిధ రూపాల్లో ప్రస్ఫుటించే కవిలక్షణమనే భావించవలసి ఉంటుంది. కవిత్వానికి ఉనికినీ గుర్తింపునీ, సంపాదించేది మౌలికంగా కావ్యమే కావటంవల్ల కావ్యమే విమర్శకు లక్ష్యం.

మరి, ప్రత్యక్షమూ, లక్ష్యమూ అయిన ఈ కావ్యం ఉద్భవించటానికి ప్రధానంగా కారణమయ్యేది ఏమిటి ? దీన్ని గూర్చిన ఆలోచన విపులంగాసాగింది. కవిలో దర్శనమూ—వర్ణనమూ ఉంటాయని అనుకొన్న తరువాత, ఈ రెంటినీ సమన్వయపరచి, కవిని వ్యాపారానికి, అంటే, కావ్య రచనకు ప్రేరేపించేందుకొక శక్తి ఉంటుందని, ఉండాలని భావించబడింది. ఇట్లా కవి ప్రవృత్తికి ప్రేరకమయి, కావ్యరూపాన్ని నిష్పన్నంచేసే దీన్ని భారతీయ సాహిత్య విమర్శ 'శక్తి' అనీ, దాన్నే విశిష్టంగా 'ప్రతిభ' అనీ పేర్కొన్నది. 'కావ్యమనేది ఒకానొకనియొక్క ప్రతిభానం నుండి ఉదయిస్తుంది' అన్నాడు మొదటిసారిగా భామహుడు. ప్రతిభానమంటే ప్రతిభాసించటం. భాసించటం, ప్రతిభాసించటం—ఈ రెండూ రెండు వేరువేరు స్థాయులకు సంబంధించినయి. భాసించటమంటే, మనస్సుకు అనిపించటం. వివిధేంద్రియాల ద్వారా మనస్సుకు వివిధ విషయాలు భాసిస్తూ ఉంటాయి. ఇది సర్వసామాన్యమయిన విషయం. ఈ భాసించటం తరువాత కవిలో ఒక విశేష ప్రక్రియ సాగుతుంది. అది ఈ భాసించిన సర్వాన్నీ ఆత్మీకరించటం. ఈ ప్రక్రియ 'భావన' వలన జరుగుతుంది. ఈ భావనవల్ల కేవలం భాసించినవి మాత్రమే కాదు, వాటి ఆధారంగా మరికొన్ని, అవి ఆధారంగా ఇంకా కొన్ని కూడా భాసిస్తూ ఆత్మీకరింపబడుతాయి. కా ఈ భావన రెండు రకాలుగా పనిచేస్తుందన్న మాట. ఈ ప్రక్రియ అంతా సమాధి స్థితిలో జరుగుతుంది. 'మనస్సు యొక్క ఏకాగ్రత సమాధి' అని శ్యామదేవుడు నిర్వచించినాడు. ఈ విధమయిన ఆ సమాధి స్థితిలో భావనద్వారా ఆత్మీకరింపబడటమనే విశేష ప్రక్రియ జరిగి, తత్పూర్వం భాసించిందంతా వినూత్నంగా, విశిష్టంగా తిరిగి భాసిస్తుంది. ఈ 'తిరిగి భాసించటమే' ప్రతిభాసించటం; అదే ప్రతిభానం అని భామహుడన్నాడు. భాసించటం—భాన మనేది మొదటి స్థాయికాగా, ఈ ప్రతిభాసించటం – ప్రతిభానమనేది రెండవది. ఈ ప్రతిభానం కవిలోని దర్శనాన్ని ఆకట్టుకొని ఉండేది. ఇప్పుడు వర్ణన ఉద్బుద్ధమయి ఆ ప్రతిభానంతో సమన్విత మవుతుంది. కావ్య సృష్టి జరుగు

తుంది. ఈ మొత్తం క్రియాకలాపమంతా జరుగటం ఒక శక్తి. అదే ప్రతిభ. ఈ అంశాన్నంతా అవగాహన పూర్వకంగా రుద్రటుడు తన 'కావ్యాలంకారం'లో—'సుష్ఠుగా సమాధి స్థితిని పొందిన మనస్సులో అభిధేయమయిన—అంటే, చెప్పవలసిన అంశం అనేక విధాలుగా విస్ఫురించటం - అంటే, విశేషరూపంలో స్ఫురించటమూ, దాన్ని వర్ణించటానికి అనుగుణంగా సహితాలయిన అక్లిష్ట పదాలు విభాసించటం —అంటే, విశేష రీతిలో భాసించటం ఏ దశలో జరుగుతుందో, ఆ దశే శక్తి. ఈ శక్తినే ప్రతిభ అని ఇతరు లంటారు' అన్నాడు. ఇక్కడ విషయమూ, దాని కనుగుణమయిన పదసామగ్రీ విశేషంగా స్ఫురించటం, భాసించటం — అంటే ఆత్మీకృతి రూపమయిన దర్శనమూ, అభివ్యక్తికి సంబంధించిన వర్ణనమూ—రెండూ సమన్వితం కావటం స్పష్టంగా చెప్పబడింది. కాగా ప్రతిభ రెండు రకాలుగా ప్రవర్తిస్తున్నదన్నమాట. ఈ రెండు రీతులను గమనించిన రాజశేఖరుడు ప్రతిభ రెండు విధాలన్నాడు. ఒకటి భావయిత్రి, రెండు కారయిత్రి. ఇది స్పష్ట ప్రతిపత్తి కోసంచేసిన విభజన. భావయిత్రి అంటే భావింపజేసేది; ఇది ప్రతిభయొక్క మొదటి రూపం. కారయిత్రి అంటే రచింపజేసేది; ఇది రెండవ రూపం. ఈ రెండూ సమ్మిళితంగా ఉంటేనే కావ్యం ఉత్పన్నమయితుంది. ఇది ఉత్తమమయిన రీతి. ఇందులో మొదటిది కావ్య పాఠకుడికీ — అంటే, సహృదయుడికీ ఉండవలసినట్టి అంశం. ఇది ఉంటేనే ప్రత్యక్షమయిన కావ్యం ద్వారా కవి హృదయంలో భాసించిందంతా ఇతడి హృదయంలోనూ భాసిస్తుంది. అప్పుడే అతడు కవితో సమానమయిన హృదయం కలవాడయితాడు; అంటే 'సహృదయుడు' అయితాడు. ఇతడిలో ప్రతిభ యొక్క రెండవ రూపం ఉండదు. కేవలం ఈ రెండవ రూపమే ఉండేవారు ఇది వరకు చెప్పుకున్నట్టు 'కేవలం కవయః'. కాగా, రాజశేఖరుడు ఉభయాత్మకమయిన 'శక్తి'ని కవికి చెప్పి భావయిత్రీ శక్తిని సహృదయుని విషయంలో చెప్పటం జరిగింది అయితే, సహృదయుడికి కవియొక్క కారయిత్రీ శక్తి పరిణామమయిన కావ్యం మాత్రమే ప్రథమంగా కనిపించేది. అందువల్ల కారయిత్రిని ప్రత్యేకించి మళ్ళీ కవి విషయంలో చెప్పటం జరిగింది. ఈ విధమయిన వివేచనద్వారా భారతీయ సాహిత్య విమర్శ కావ్యహేతువుగా 'ప్రతిభాశక్తి'ని ఏకైక హేతువుగా ప్రతిపాదించింది.

ఈ సందర్భంలోనే భారతీయ సాహిత్య విమర్శ వ్యుత్పత్తి, అభ్యాసం అనే రెండింటిని రంగంమీద ప్రవేశపెట్టింది. వ్యుత్పత్తి అంటే ''లోక—శాస్త్ర—కావ్యాద్యవేక్షణ మని విమర్శకులందరూ — వేరు వేరు మార్గాలుండవచ్చు— ముక్తకంఠంతో అంగీకరించినారు. ఇక్కడ మూడంశాలు ప్రధానీకరించబడినాయి. 'ఆదు'ల్లో ఇంకా ఎన్నయినా ఉండవచ్చు కాని, ప్రధానమయినవని తాత్పర్యం. ఆ మూడు లోకం—శాస్త్రం—కావ్యం. ఈ మూడింటి అవేక్షణం — అంటే, గాఢంగా అధ్యయనం చేయటం వ్యుత్పత్తి. ఇంతకుముందు కవికి సంబంధించిందిగా చెప్పబడిన దర్శన''మన్నదాన్ని ఈవ్యుత్పత్తి స్పృశిస్తున్నది. లోకాన్ని అధ్యయనం చేయట మంటే మానవ సమాజాన్నీ, అందులోని చిత్రవిచిత్ర ప్రవృత్తులనూ, రకరకాలయిన భావనా రీతులనూ, సమాజం సాధించవలసినదాన్నీ, దాని సాధకబాధకాంశాలనూ, మొత్తాన్నీ వ్యవస్థితంచేసే ధర్మాన్నీ, దానికి సంబంధించిన సూక్ష్మసూక్ష్మాంశాలనూ అధ్యయనం చేయటమన్నమాట. కేవలం ఈ మానవ ప్రకృతినేకాక, తదితర ప్రవృత్తులనూ అధ్యయనం చేయటం కూడా 'లోక'మనటం ద్వారా సంగ్రహింపబడింది. ఈ విధమయిన లోకం కోసమే రకరకాలయిన శాస్త్రాలు రూపొందినాయి. ఇవన్నీ అనేక కాలాల్లోని మేధావులూ, లోకకళ్యాణభావుకులూ అయిన పలువురి అనుభవాల పరంపర నుండి నిష్పన్నమయినాయి. వాటి గాఢమయిన అధ్యయనం, ఈ లోకాధ్యయనమూ సమన్వితమయి సమగ్రతను సంపాదిస్తుంది. ఈ విధమయిన సమగ్రత యొక్క అభివ్యక్తి రూపాలయిన కావ్యాలను అధ్యయనం చేయటం మూడవ అంశం. ఈ అధ్యయనమంతా కలిసికట్టుగా వ్యుత్పత్తి కాగా, రెండవది అభ్యాసం. 'అవిచ్ఛేదంగా - ఎడతెగకుండా అనుశీలనంచేయటమే అభ్యాస'మన్నాడు మంగళుడు. అంటే ఈఅధ్యయనం నిరంతరంగా సాగవలసిందేనన్నమాట. ఈ విధమయిన వ్యుత్పత్తి, అభ్యాసాలను నిశితంగా పరిశీలిస్తే మొదటిది ప్రతిభలోని మొదటి భాగానికీ. రెండవది రెండవ భాగానికీ పరిపోషకాలుగా కనిపిస్తాయి. ప్రతిభలోని మొదటి భాగమంతా సమాధి దశలో జరిగేది. రెండవ భాగమంతా కార్యరూపంలో పరిణమించేది. అందువల్లనే రాజశేఖరుడు సమాధి ఆంతర ప్రయత్నమనీ, అభ్యాసం బాహ్య ప్రయత్నమనీ, అన్నాడు. మొదటిది అప్రత్యక్షం, రెండవది ప్రత్యక్షం. ఈరెండూకలిసి శక్తిని ఉద్భాసింపజేస్తాయి అని ఆయన అభిప్రాయపడినాడు. కాగా, ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసాలుఅని మూడుగా వివరించుకోవటంలో కన్పించినా, చివరి రెండూ మొదటి దానిలో అంతర్భాగాలే కావటంవల్ల, కనిపించే ఈ మూడూ కలిసి ఒకే మొత్తంగా కావ్యహేతువు అని మమ్మటుడన్నాడు. అంటే, పర్యవసానంగా ప్రతిభ కావ్యహేతువు.

అయితే, ప్రతిభను గూర్చి ఇంత వివేచన జరుగగా, ఈ వివేచన కంతటికీ లక్ష్యభూతంగా రూపొందిన ప్రతిభ సర్వత్రా ఒకే విధంగా, ఇంత ఉన్నత స్థాయిలో ప్రసరిస్తూ ఉంటుందని అనుకోవటానికి వీల్లేదు. ప్రతిభయొక్క సమగ్రతా విషయికంగా అనేకాంశాలు గమనించబడినాయి. వీటి అన్నింటి సమిష్టి స్వరూపంలో ఆ అనేకాంశాల కలయికలోని పాళ్లలో అనంతమైన తారతమ్యం ఏర్పడే అవకాశం ఉంది. దీన్నే ప్రతిభా తారతమ్యమనవచ్చు. ఈ ప్రతిభా తారతమ్యం వల్ల కవుల్లోనూ, రూపొందిన కావ్యాల్లోనూ అనంతమయిన తారతమ్యం కలుగుతున్నది. ఈ అంశానికి సూచనగా రాజశేఖరుడు—'ఒక కవి కావ్యం ఆ కవి యింటిలోనే ఉండిపోతుంది. మరొకడిది కేవలం ఆయన మిత్రుల ఇండ్లదాకా మాత్రమే సాగిపోగలుగుతుంది. కాని, ఎవరో ఒకానొక కవి కావ్యం మాత్రమే సహృదయులను ఆకర్షిస్తూ, ఆహ్లాదపరుస్తూ లోకమంతా వ్యాపిస్తుంది' అన్నాడు. ఇక్కడ 'ఒక' అనేది ఆ తరహాకు చెందిన వారి జాతినంతటికీ సూచకం—జాత్యేక వచనం. ఇక్కడ మూడు రకాలుగా చెప్పబడటంలో, రకాలు మూడేననికాదు. తారతమ్యంలోని అనేకత్వాన్ని సూచించటమే ప్రధానం. రాజశేఖరుడు చివరకు చెప్పిన లక్షణంగల కావ్యమే సాహిత్య విమర్శకు ప్రధానలక్ష్యం. కాగా, కావ్యానికి మౌలికంగా హేతువు ప్రతిభ అనీ, ప్రతిభా తారతమ్యమే కావ్యాల తార

తమ్యానికి కారణమనీ, కాని, లోకమంతా వ్యాపించే కావ్యమే లక్ష్య మనీ భారతీయ సాహిత్య విమర్శ భావన.

ఇంతకూ ఈ 'కావ్య' ప్రయోజనమేమిటి ? దీన్ని గూర్చిన ఆలోచన సాగుతూఉంటే, ఈ కావ్యానికి ప్రధానహేతువుగా ప్రతిభ, దాని కనుబంధంగా వ్యుత్పత్తి, అభ్యాసాలూ, అంతకు ముందే దర్శనమూ, సమాధి స్థితీ—ఈ విధంగా కవికి సంబంధించి చెప్పటంలో ఒక అంశం స్ఫురిస్తుంది. లోకమంతా చైతన్యంతో నిండి ఉంది. ప్రస్తుతానికి సంబంధించినంత వరకు మానవుల విషయంలో చైతన్యం రెండు పాయలుగా కనిపిస్తుంది. ఒకటి వైయక్తికచైతన్యం రెండు సామూహిక చైతన్యం. ఈ సామూహిక చైతన్యమే సామాజికచైతన్యం. (మానవుల సమూహమే 'సమాజం'. తదితరప్రాణుల సమూహాన్ని 'సమజం' అనవలసినా, సమాజ మనే వ్యవహారమే సామాన్యమయిపోయింది) సామూహిక చైతన్యం వ్యక్తి చైతన్యాల సమిష్టి మీద రూపొందుతుంది. అంటే సామూహిక చైతన్యానికి వ్యక్తి చైతన్యం మూలం. అయినా, అది రూపొందిన తరువాత బలిష్ఠమై వ్యక్తి చైతన్యాన్ని అమితంగా ప్రభావితం చేస్తుంటుంది. ఈ వ్యక్తి చైతన్యం అంతర్—బహిర్ భేదాలతో ప్రవర్తిస్తుంటుంది. కాని వ్యక్తమయ్యేది దాని బాహిర రూపమే. ఆంతర రూపం అవ్యక్తం. అందువల్ల అజ్ఞాతంగా ఉంటుంది కాని, అది ఈ బాహిర రూపాన్నీ, ఇటు ఆ ఆంతర రూపాన్నీ కూడా ప్రభావితం చేసుకుంటూ ఉంటాయి. సామూహిక చైతన్యం ఈ వ్యక్తి చైతన్యంలోని రెండు రూపాలనూ వ్యక్తావ్యక్తంగా ప్రభావితం చేస్తూ ఉంటుంది. ఇది సర్వ సామాన్యమైన స్థితి. ఈ స్థితిలో కొందరి వ్యక్తి చైతన్యాలు కొన్ని కొన్ని సందర్భాల్లో సామూహిక చైతన్యాన్ని ప్రభావితం చేయటం ప్రసిద్ధమయిన విషయం. ఈ విధమయిన వ్యక్తి చైతన్యాలు కలవారు కొద్దిమంది మాత్రమే ఉంటారు. ఈ ప్రభావితం చేయటమనేది రకరకాలయిన రీతుల్లో సాగుతుంది. వీరికి ఏవిధంగా చేయగల శక్తి సామూహిక చైతన్యాన్ని తమ వైయక్తిక చైతన్యంగా మలుచుకొని, విశిష్ట దృక్పథాన్ని సంతరించుకొని ఒక ప్రత్యేకమయిన తరహాలో సమూహానికి అందించ గలుగుట మనేదానివల్ల కలుగుతున్నది. ఇట్లాంటి శక్తిమంతులలో వాడు కవి. అతడు వ్యక్తిగా సామూహిక చైతన్యంతో ప్రభావితుడయితాడు. కవిగా దానితో ఘర్షణ పొందుతాడు. ఆత్మీకరించుకుంటాడు. ఘర్షణద్వారా ఆత్మీకరించుకొన్న ఆ సమగ్ర సంక్లిష్ట సామూహిక చైతన్యాన్ని విశ్లేషించుకోవటంలో కలిగిన నూత్న దృక్పథాన్ని వైయక్తిక చైతన్యంగా సమూహానికి విశిష్ట మయిన మార్గంలో, వినూత్న పద్ధతిలో అందించగా, ఆ అందించిన దానిరూపం 'కావ్యం'. కావ్యంలో వైయక్తిక చైతన్యంగా ఆభాసించేది కావ్యాస్వాదకుడిలో క్రమక్రమ వికాస మార్గాన పరిపుష్టమై సామూహిక చైతన్యంగా విస్తరించే ప్రక్రియ — అతడిలోని భావయిత్రిద్వారా జరుగుతుంది. భారతీయ సాహిత్య విమర్శ మార్గంలో ప్రసిద్ధమయిన 'సాధారణీకరణ'మనేది ఈ అంశాన్ని సూచిస్తున్నది. అంటే, సామూహిక చైతన్యావిష్కారం కావ్యాస్వాదకుడిలో జరుగుతుందన్నమాట. ఇది అతడి అంతర్ — బహిశ్చైతన్య సంపుటిని తీవ్రంగా ప్రభావితం చేస్తుంది. అంతశ్చైతన్యంలో అది ఆనందం; బహిశ్చైతన్యంలో అది ఉపదేశం. అంతశ్చైతన్యంలో సుప్తమయిన అంశాలను (వీటినే 'వాసనా'రూపంగా ఉన్నవనటం భారతీయ సాహిత్య విమర్శలో ప్రసిద్ధం) మేల్కొలిపి పొందించిన తృప్తి—సామాన్య వ్యవహార స్థాయిలో దానికన్నా ఎంతగానో మించింది-కలుగుతుంది. అది ఆనందంగా వ్యవహరింపబడుతున్నది. ఆ ఆనందం ఏ విధంగా ఆస్వాదింపబడుతున్నదో—అంటే, ఆస్వాదరూపం ఏమిటో వివరించటం అసాధ్యం కావచ్చు కాని, ఆస్వాద్యమయితూనే ఉన్నది. ఈ ఆస్వాద్యజ్ఞానంబట్టి ఆ ఆనందం 'రస'మని, అంటే, రసరూపమని అనటం జరుగుతున్నది. ఈ ఆనందం వాచ్యంకాదు, ఎప్పుడూ వ్యంగ్యమే. అందుకనే రసం వ్యంగ్యమే తప్ప వాచ్యం కాదని భారతీయ సాహిత్య విమర్శ భావించింది. ఈ ఆనందం అంతశ్చైతన్యాన్ని స్పృశించేది కాగా, బహిశ్చైతన్యాన్ని స్పృశించేది ఉపదేశం. ఇక్కడ ఈ ఉపదేశం క్రియాశీలమయిన ప్రవృత్తిని ప్రేరేపిస్తుంది. ఈ ప్రేరేపించే ఉపదేశంకూడా వాచ్యం కాగూడదనీ, వ్యంగ్యంగానే ఉండాలనీ భారతీయ సాహిత్య విమర్శ భావించింది. వ్యంగ్యంగా ఉండటంవల్లనే ప్రయత్న నిరహితంగా క్రియాశీలంతో కలిసిపోయి ప్రవృత్తిని ప్రేరేపించుటుంది. లేకుంటే, విడిగానే ఉండిపోయే, ప్రతిచర్య కలిగే అవకాశం ఉంది. ఈవిధంగా కావ్యం కావ్యాను శీలకుడియందు రెండు స్థాయిల్లో ప్రవర్తిస్తుంది. ఆనందవర్ధనుడు 'ధ్వన్యాలోకం'లో మహాభారత రసనిరూపణసందర్భాన (శాంత) రసాన్నీ, (తురీయ) పురుషార్థాన్నీ జంటగా-కవలలుగా సంపుటీకరించి చెప్పటంలో ఈ అభిప్రాయమే సూచితమయితున్నది. కాగా, కావ్యంవల్ల సాధింపబడే ప్రయోజనం—అంటే, కావ్యప్రయోజనం ఈవిధమయింది· కావ్యం రసాత్మకంగా, ఉపదేశాత్మకంగా—ఆ రెండు కూడా వ్యంగ్యంగా అంటే, ధ్వనిరూపంలో కావ్యమందు ఉంటాయనీ, అప్పుడు మొత్తంగా కావ్యం రమణీయార్థ ప్రతిపాదకత్వాన్ని సంతరించుకొంటుందనీ చెప్పటం జరిగింది. కావ్యంవల్ల ప్రయోజనాలు ఇంకా కొన్ని రకరకాలుగా చెప్పబడినా కూడా ప్రధానమయినవి ఈ రెండే. వీటినే ఏకగ్రీవంగా ప్రతిపాదించటమూ, అంగీకరించటమూ జరిగింది భారతీయ సాహిత్య విమర్శలో. దీనికి కారణం ఇవే విశ్వశ్రేయోమూలకాలు కావటం. విశ్వశ్రేయస్కరం కానిది ఉపదేశమూ కావటానికి వీల్లేదు. ఆనందమూ కావటానికి వీల్లేదు· అందువల్లనే ఈ ఉభయాత్మకమయిన కావ్యం విశ్వశ్రేయస్సు--శ్రేయోవిధాయకం. ఇట్లాంటి లక్షణాలు లేని కావ్యాలను గూర్చి పుట్టిందే — 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనేది.

ఈ విధంగా యీ లక్ష్యాన్ని, ప్రయోజనాన్ని గమనించితే, కవి వ్యాపారంలో — అంటే, కావ్య నిర్మాణంలో రెండంశాలకు ప్రాధాన్యం ఉన్నట్టు స్పష్టమయితుంది. ఒకటి: ఉపదేశ్యమయిన దానికి అనుగుణమయిన—అంటే, ఆ ఉపదేశ విషయాన్ని వ్యంజించటానికి అనువయిన వస్తువు. రెండు: దాన్ని ప్రస్తుతీకరించటానికి ఉపయుక్తమయ్యే విధానాన్ని ఎన్నుకోవటంలో, నిర్వహించటంలో ప్రదర్శితమయ్యే నేర్పు. వస్తువెప్పుడు కూడా లోకంలో నుంచి

గ్రహింపబడవలసిందే—గ్రహింపబడేదే. లోక సామూహిక చైతన్యాన్ని ఆత్మీకరించుకొని విశ్లేషించుకోవటంవల్ల కలిగే విశేషదృక్పథం దానికి అనుగుణమయిన వస్తువును లోకంలోంచే గ్రహిస్తుంది. ఈ వస్తువొకప్పుడు కథారూపంగా ఉండవచ్చు; ఒకప్పుడు సంఘటనరూపంగా సన్నివేశ రూపంగా ఉండవచ్చు; మరొకప్పుడు కేవలం భావరూపంగా ఉండవచ్చు – ఇంకా రకరకాలుగా ఉంటే ఉండవచ్చు. ఏరూపంలో ఉన్నా గూడా దానికి ఆశ్రయం లోకమే-సామూహిక చైతన్యంలోని భాగమే. భాగమైనా మొత్తమయినా లక్ష్యం ఒకటే. అయితే, ఫలానా విధమయినదే, ఫలానా రీతిలోనే గ్రహించవలసి ఉంటుందని చెప్పటానికి వీల్లేదు. సాలీని గూడులాంటి క్లిష్టమయిన అల్లికగల లోకంలో అనంతమయిన రీతుల్లో విస్తరించి ఉల్లోల కల్లోలంగా ఉన్నప్పుడు విశిష్ట దృక్పథం అందులోంచి వస్తువును స్వీకరించేందుకు ఏవో కొన్ని గిరిగీతలు గీయటానికిగానీ, గీసుకోవటానికిగానీ వీల్లేదు. కాని, ఈ విషయంలో మార్గం చూపించదగిన ప్రధానాంశం ఒక్కటే — అది, ఆ గ్రహింపబడిన వస్తువు విశ్వ శ్రేయోదాయక లక్షణం కలిగి ఉండాలన్నది మాత్రమే భారతీయ సాహిత్య విమర్శ తన నిరంతర వివేచనద్వారా నిరూపించుకొన్న విషయం. ఈ మార్గంలో సాగినప్పుడు 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అన్న దానికి లక్ష్యంగా 'కావ్యాలు' రూపొందే అవకాశం ఉండదు. ఈ మార్గం సూచింపబడిన తరువాత ప్రత్యేకంగా వస్తువునుగూర్చి చెప్పవలసింది నిజానికి ఏమీలేదు. ఏది చెప్పినా విశాలదృక్పథాన్ని సంకుచితం చేయటమే అయితుంది. మరి చెప్పవలసిందిగానీ, విచారించవలసిందిగానీ ఉన్నదొక్కటే,—అది, ఆ గ్రహింపబడిన వస్తువు ఏ విధంగా నిర్వహింపబడాలన్నదీ, అందులో నేర్పు ఏ విధంగా ప్రదర్శితమయితుందన్నది మాత్రమే. ఈ అంశాన్ని భారతీయ సాహిత్య విమర్శ అనేక కోణాల్లోంచి పరిశీలించి ప్రదర్శితమయ్యే కౌశలాన్ని నిశితంగా విశ్లేషించి ప్రదర్శించింది. ఈ కౌశలాన్నే నైపుణ్యమనీ, చాలా సకృత్తుగా శిల్పమనీ వ్యవహరించింది. ఆధునికంగా 'శిల్ప' పదానికి ప్రాచుర్యం వచ్చింది. శిల్పశాస్త్రం నుంచి ఈ శిల్పమన్న పదం గౌణంగా సాహిత్య శాస్త్రంలోకి కౌశల — నైపుణ్య పర్యాయపదంగా వ్యవహారిని కెక్కింది. అనేకార్థాలను సంగ్రహిస్తూ, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ నిర్వహించినట్టు, పాఠకుడిని ఉత్సాహాలలో సంచరింపజేయటానికి ప్రదర్శితమయ్యే కౌశల — నైపుణ్యాల సంపుటీకరణమే 'శిల్పం'.

ఈ శిల్పం అనంత ముఖాలుగా విస్తరించింది. ప్రక్రియాపరంగా శిల్ప స్వరూపం వివిధ రీతుల్లో విభజింపబడుతుంది. మౌలికంగా సాహిత్య—కావ్య ప్రక్రియలు రెండు వర్గాలు. ఒకటి : దృశ్య వర్గం, రెండు : శ్రవ్య వర్గం. ఒక్కొక్క వర్గంలోనూ రకరకాలయిన భేదాలు నిష్పన్నమయినాయి. ఇవన్నీ శిల్పంలో భేదాలను కలిగిస్తున్నాయి—అంటే, ప్రక్రియాపరమయిన శిల్పం ఇన్నిన్ని విధాలుగా పరిణమిస్తున్నది. ఇట్లా ప్రక్రియాపరంగానే కాకుండా, వాహిక అయిన భాషాపరంగా, పదాలయొక్క కూర్పులూ, తీర్పులనూబట్టి శిల్పం ప్రసరిస్తుంటుంది. ఆ విధమయిన వాటిని సంఘటన రీతులుగా భారతీయ సాహిత్య విమర్శ గుర్తించింది. వివిధమయిన పదాలను 'వక్రలూ' మహితంగా రకరకాలయిన పద్ధతుల్లో కూర్చటం ద్వారా అసలు సాహిత్యభాషే ఎప్పటికప్పుడు మారిపోతున్నట్టు నిత్యనూత్నంగా ప్రవహిస్తుంటుంది. ఆనందవర్ధనుడీ భాషాదికం ద్వారా వ్యక్తమయ్యే నవత్వాన్ని కవుల కారయిత్రీ ప్రతిభాలక్షణంగా సూచించినాడు. కావ్యం గ్రథన కౌశలంవల్ల సర్వమూ నవంనవంగా విభాసిస్తుందన్నాడు. ఈ గ్రథన కౌశలమనేది సర్వవిధ కావ్య రూపాలందూ అక్షరాల, పదాల కూర్పు మొదలుకొని కావ్య పరమార్థం దాకా వ్యాపించి ఉండేది దాన్ని దాని వ్యాప్తిరేఖలనుబట్టి వివిధంగా పరిగణించటం జరుగుతున్నది. శబ్దశిల్పం, భావ శిల్పం, సంఘటన శిల్పం, కల్పనా శిల్పం.. ఇత్యాదిగా బహుభేద భిన్నంగా కనిపిస్తుంది.

ఒక అంశాన్ని అభివ్యక్తీకరించటంలో ప్రతీకా పరంగా, ఉపమానాదుల పరంగా వచ్చిన వైచిత్రీ విలాసాలన్నీ అలంకారాలుగా గుర్తింపబడినాయి ఇట్లాగే శయ్యా, పాక, గుణ, వృత్తి రీత్యాదులుగా పరమ సూక్ష్మంగా గుర్తింపబడిన అనేకాంశాలతో, ఔచిత్య వలయంతో భారతీయ సాహిత్య విమర్శ శిల్పంయొక్క అనంత రేఖలను దర్శించింది. అక్కడే ఆగలేదు. ఈ అనంతరేఖల సమూహరూపమయిన కావ్య సమగ్ర స్వరూపాన్ని దర్శించింది, ప్రదర్శించింది ఇదొక ప్రపంచం, కావ్య—లేదా సాహిత్య ప్రపంచం. కవిని ఈ ప్రపంచానికి ప్రజాపతిని చేసింది. అపారమయిన ఈ కావ్య సంసారంలో ప్రజాపతి కవియే. ఆయన కేవిధంగా ఈవిశ్వం రోచిస్తుందో, అంటే, కాంతిమంతంగా కనిపిస్తుందో, స్ఫురిస్తుందో, ఎట్లాఉంటే బాగుంటుందనిపిస్తుందో ఆ విధంగా ఈ ప్రపంచం పరివర్తనం పొందుతుంది.

అందుకే రకరకాలయిన ప్రక్రియలూ, అనంతముఖ శిల్ప వీధులూ రూపొందటానికీ, వ్యక్తం కావటానికీ వీలయింది. ఒక రచన ఈ ప్రపంచానికి చెందింది అయితుందా, కాదా అన్నప్పుడు మొదట గమనించవలసింది ఈ ప్రక్రియా వలయంలోనిదై, శిల్ప సంపన్నమయిందా లేదా అన్నదే. వస్తువనేది కావ్యాలకూ కావ్యేతరాలకూ గూడా సమానాంశమే. కావ్యేతరాల నుండి కావ్యాలనూ, సాహిత్యాన్నీ విభేదింపజేసేది ఈ శిల్ప లక్షణమే. ఈ లక్షణం లేకపోతే అది సాహిత్య విమర్శకు లక్ష్యమేకాదు. అయితే, కావ్యాల — సాహిత్యమందుండే వస్తువు విశ్వశ్రేయోలక్షణం కలదికావటం అతిప్రధానం. (కావ్యేతరాలందూ వస్తు లక్షణమిదే) దానియందా లక్షణం లేకపోతే ఇంత శిల్పమూ వ్యర్థమే. యీ శిల్పవిరహితంగా ఉంటే ఆవస్తువు ఆ లక్షణం కలదే అయినా సాహిత్య ప్రపంచంలోకి దానికి ప్రవేశం లేదు. కావ్యేతరాలందు వస్తువుచుట్టూ అల్లుకొని ఉండే వాతావరణం కన్నా సాహిత్యంలోది భిన్నం. యీభిన్నత్వం శిల్పం కల్పించే రీతివల్ల కలుగుతున్నది. కాగా, సాహిత్యంలో వస్తువుకీ శిల్పానికీ అవినాభావ సంబంధం యీ విధంగా ఉన్నది.

వస్తువుకు ఉండవలసిన ప్రధాన లక్షణాన్ని నిర్ణయించుకొని శిల్ప రీతిని విస్తృతంగా భారతీయ సాహిత్య విమర్శ వివేచించటానికి ప్రధానకారణం—అది, ఆ విమర్శ 'సాహిత్య' విమర్శ కావటం.

# శిల

## డా. నాయని కృష్ణకుమారి

నన్ను వత్తినిచేసి
  మండిస్తూ
కాంతిని విసిరేస్తూ
ఎప్పటి స్నేహమూర్తివి !

ఎన్నో జన్మలనుండి
నన్ను తరుముకొస్తున్న
ఉన్మత్త స్పందనవు

తెరిపి మరువుల
సరిహద్దు మీద
సయ్యాటలాడే
తియ్యని స్మృతి వీచికవు

అద్దంలాంటి మనస్సును
హత్తుకోలేక
పారిపోయే పాదరసానివి

అణువణువునూ
ఆక్రమిస్తున్న
అతి పల్చని నీడవు !

పైకిదూకే పసిపాప
పడిపోయే ఉల్క
పరుగులు పెట్టే తరగ
అన్నీ నీవే అయి
నా అంతరంగం నిండా
అలజడి !

ఆశాభయాలు పాత్రలై
నాలో ఆడే నాటకానికి
అదే సూత్రధారి !

నేను పిలవగల
ఏకైక ప్రేక్షకుడివి
నువ్వు మాత్రం

ఎప్పుడూ
భయాన్ని గాలిపే
స్తబ్దతతో

శిలవై
నాలో దాక్కుని !

# సిరా మార్చాలి

## శ్రీ మొంద్రము సర్వోత్తమరెడ్డి

నే కవినైనట్లున్నాను
  నా సిరా మార్చాలి.

పండు వెన్నెల్లో
నిండు చంద్రుడ్ని చూస్తే
నల్లమచ్చ
కొట్టొస్తోంది
నే కవినైనట్లున్నాను
నా సిరా మార్చాలి.

భక్తి నెదుకుతూ గుళ్ళోచేర్తే
బారులు తీరిన దరిద్రం
నా భక్తి మీద
దండెత్తుతోంది
నే కవినైనట్లున్నాను
నా సిరా మార్చాలి.

పసిడి బొమ్మల కోసం బజారెళ్తే
కడుపూదిన భావిపౌరులు
అడుక్కొంటూ
అడ్డొస్తున్నారు
నే కవినైనట్లున్నాను
నా సిరా మార్చాలి.

కాకి కావు కావులో
కోయిలలో వినని
సంధ్యారాగం
నా కినొస్తోంది
నే కవినైనట్లున్నాను
నా సిరా మార్చాలి.

బులుగు సిరాతో నా కలం
లేదు అసలు కదలడం
ఎర్రసిరా
కావాలేమో ?
నే కవినైనట్లున్నాను
నా సిరా మార్చాలి.

నే కవినైనట్లున్నాను
నా సిరా మార్చాలి.

శ్రీ వాడపల్లి లక్ష్మీనారాయణాచార్యులు

# శంకుస్థాపన

"కొంపతీసి ఫౌండేషను షోటను అటెటో ఏయిస్తున్నామను కొన్నారేమిటి మేష్టారూ?" అన్నారు స్ప్రింగ్‌డోరు తోసుకొని ఆఫీసు రూంలోకి వాస్తూ సమితి ప్రెసిడెంట్ గరికయ్యగారు. అతనోత్తబాటు ఊరి సర్పంచ్ తవిటయ్యా, బి. డి. ఓ.లు కూడా లోపలికొచ్చేరు.

ప్రిన్సిపాల్ చటుక్కున ఓసారి సీట్‌లోంచి లేచి కూర్చుంటూ "కూర్చోండి కూర్చోండి. అలా ఎలా అనుకుంటాను చెప్పండి! ఆ ప్రక్క హైస్కూలు గదులూ, ఈ ప్రక్కన కాలేజీ షెడ్‌యూ; ముందువైపు గేటూ, వాలీబాల్ కోర్టులూను! ఇప్పటికే కన్జెస్టెడ్‌గా వుండగా ఎలా కుదురుతుందనుకొంటాను! అయితే..." అని ఇంకా ఏదో అనబోతూండగానే తవిటయ్య అందుకొన్నాడు —

"అయితే గియితే అంటారేటి మేట్టారూ? నానెంత నిదానించి సెప్పినా మీకేటి ఇసిదం కానట్టున్నాది! నేకపోతే యేటి సెప్పండి—ఎల్లుండీ కాడికల్లా మినిస్టరు పారొచ్చేత్తుంటే ఇయ్యేల దాకా నాను మీకు సెప్పిన వొక్క అరెన్జిమెంటు కూడా కంపిలీటు కానేదు."

ఇంతట్లోనే గరికయ్య అందుకొన్నాడు-"అసలు మీరెందుకు సందేహిస్తున్నారో నాకేం తెలీడంలేదు. మేమే పీకించేద్దుం దాని పాక. అయితే ఇదిగో ఈ తవిటయ్యమీద ఇప్పటికే లేనిపోని నాన్సెన్స్ ప్రోపగండా వుంది. ఇప్పుడుగాని మేం డైరెక్టుగా రంగంలోకి దిగితే లేనిపోని పెడ్డపేరు కొనితెచ్చుకున్నట్టవుతాది. అందుకని మీకు పురమాయించేను అయితే మేమంతా మీకు ఎనక సపోర్టుగా వున్నట్టే కదా!"

ఇంతట్లో బి. డి. ఓ. కలగజేసుకొంటూ-"అంకాలు దగ్గిర ఈ సరౌండింగ్స్‌లో గుడిసె కట్టుకోడానికి పెర్మిషన్ గ్రేంటుచేస్తూ మేనేజిమెంట్ ఇచ్చిన ఆర్డరు ఉంటుంది కదా! అది చూపించి గొడవ చేస్తుందని ప్రిన్సిపాల్‌గారు జంకుతున్నారేమో!" అన్నారు.

"ఆర్డరా! పాడా? అదేటినేదు. ఆ మాటకొస్తే ఆ యెదవ నంజకి హక్కేనేదు. దాని మొగుడిని నైటోచరుగ యేసినపుడు యేదో వుత్తి పున్నేనికని 'వో గుడిసేసుకోరా!' అని నోటిమాటిచ్చినాం. అంతే మరేటినేదు. ఆడు సచ్చినాక ఆ యేకెన్సీలో తలుపులుగాడిగ యేసినాం. ఆడు వూర్లో పెళ్ళాం కొంపకాడే నివాసం యెట్టుకొని, రాతిరేల వారండామీద తొంగొని గస్తీకాస్తుండు. దాని మొగుడు సచ్చిన్నాడే యీ దొంగనంజని తగిలేసినాం కాదు. ఏదో వుత్తి పున్నేనికని గరికయ్యగారు అళ్ళమాటా ఈళ్ళమాటా కాదన్నేక దీనికి సీపరు పోస్టోటి యిచ్చేసినారు. ఇయ్యేల కా నంజకూతురు కొదమకోసం కొట్టిన గుంజనాగా యిక్కడ పాతుకుపోయి కదల్నన దేటి?" అని తవిటయ్య అంకాలుపై తనకున్న అక్కసంతా వొక్కసారి కక్కేసరికి గరికయ్య —

"నీకీ మాటతీరూ ఫోర్సూ ఎప్పుడు తగ్గితే అప్పటిగ్గాని రైజ్‌లోకి రావనుకో! ప్రాణం తీస్తున్నా సరే అలా బూతుల్తో తిట్టచ్చా—అందులోనూ సర్పంచివి, నోటిదురుసుతనం తగ్గించుకోవద్దూ" అని, ప్రిన్సిపాల్ వైపు తిరిగి—"అప్పుడేదో అయింది. ఏదో పిల్లల్దిగదా అని వూరుకొన్నాం. ఇప్పుడు దాని కూతురు పెళ్ళై ఈ వూర్లోనే కాపరం చేస్తోందిటకదూ! అక్కడికి పొమ్మనండి! అదెక్కడికిపోతే మనకేటి గానీ — ఇవాళ సాయంత్రానికల్లా ఇసక లారీలూ, ఇటికలూ, సిమెంటూ—మొత్తం అన్నీ కంప్లీటుగా వొచ్చి పడిపోతాయి. రాత్రికి రాత్రి పన్లన్నీ అయిపోవాలంతే. అంచేత అప్పటికి ఆ సైటంతా క్లీన్‌గా చదునుగా వుండితీరాలి—ఇక ఆ వర్కు గురించి ఆపి, ప్రెస్సువర్కు గురించి చూద్దాం. మరి సన్మాన పత్త్రరం నేను సెప్పినట్టల్లా రాసి పెట్టేరా? ఆ పజ్యాలు రాయించేరా? రేపు పొద్దున్న పదింటికల్లా టౌనులో ప్రెస్‌కి అవన్నీ వెళ్ళిపోతేగాని వీల్లేదు- ఇంకా చాలా చాలా తంతుంది" అంటూ సిగరెట్ వెలిగించేడు.

"అవన్నీ రడీగనే వున్నాయి" అంటూ ప్రిన్సిపాల్ డ్రాయరు సొరుగులోంచి ఓ ఫైల్ తీసి గరికయ్య కందిస్తూ "స్టాఫ్‌లో కొందరు అంకాలువైపు మొగ్గుతారు. మరి వాళ్ళని నేను కొంచెం కాసుకోవాలికదా — అందుకనే కొంచెం ఆలస్యమైంది. ఇవాళ సాయంత్రం నాలుగ్గంటలకల్లా వెకేట్ చేసి వెళ్ళిపోతోంది" అన్నారు పేపర్ వెయిట్‌ని యాదాలాపంగా అటూ ఇటూ దొర్లిస్తూ.

ఫైల్లో కాయితాల్ని అటూ ఇటూ తిరగేస్తూ గరికయ్య "ఈ పజ్యాల సంగతి నాకేటి తెలుస్తాదిగాని—చూడండి ఈ సన్మాన పత్త్రరం నేను చెప్పినట్టు అస్సలు మీరు రాయలేదు! నేనొక్కణ్ణేనా? అటు ఎం. ఎల్. ఏ. గారూ, ఇటు సబ్ కలెక్టరుగారూ కూర్చున్నాకే అనుకున్నాం. ఆ మాటలే మీకు రాసిచ్చేను. అసలు మేటరెలా వుండాలో చెప్పేను అసలా మాటలుగాని, మేటరు గాని వుంటేనా ఇందులో!——ఇవన్నీ ఏవిటండీ? అసలు మొదటిలైన్లోనే శంకుస్థాపన అని రాసేసారేటండీ మరీను! కాకి వొత్తుండదుటండి! అది దిద్దేయండి. ఇంకా అదేదో సెంద్ర సిలా ఫలకం అని రాసిచ్చేను కదండీ. మీరేమో సలవరాతి పలక అని రాసేరు! — ఇలా

రాస్తే నేనేమైపోవాలో చెప్పండి. ఔను ఇదేవిటిది? బిల్డింగు కావాలనీ, లెక్చరర్లు సరిపోరనీ ఎవరు రాయమన్నారు చెప్పండి! అసలు నా ప్లాన్ మీకు బోధపడలేదు మేష్టారూ! నేను చెప్పిందేవిటి—సీనియర్ కాలేజీకి అప్రూవ్ చేయించమని మనవి చేయాలని! ముందస్తుగా జరగాల్సిందదీ. అదంటూ జరిగినాక— ఇంకేవుంది ఆటోమేటిక్కుగా మీరిప్పుడు రాసినవన్నీ మనం మనవి చేయకుండానే ఫైసలా అయిపోతాయన్నమాట! ఇక ఇయన్నీ యెందుకు రాయడం?- తీసేయండి. నేను చెప్పినట్టే కంప్లీటుగా మార్చేసి రాతిరి పదేలోగా నాకు అంపేయండి'' అన్నాడు.

ఈ మాటలకి చెమటపట్టే స్థితికొచ్చిన ప్రిన్సిపాల్ ''మరేంలేదు—నాకు ఇంగ్లీషులో చెయ్యి తిరిగినట్లు తెలుగులో తిరగదు. అందుకని తెలుగు లెక్చరర్ని వ్రాయమన్నాను. అవన్నీ సరిదిద్దింది మీకు ఆరోగంట అయేసరికల్లా పంపించేస్తాను'' అన్నారు.

''మరి నేను వెళ్ళి మిగతా పనులు చూసుకొంటాను. రేపీపాటికి ఆరు నూరైనా నూరారైనా సరే అంతా రడీగా వుండాలి. మీ హెల్ప్లా కోపరేషనూ మేమేమీ చేయలేం మేష్టారూ! మరి వెళ్దామా!'' అని మిగతా వాళ్ళవైపు చూసేడు గరికయ్య.

''చూడండి—మరి—ఇప్పుడు వేయిస్తున్న వైట్ వాషింగ్ మొత్తం బిల్డింగ్ అంతకీ కదండీ'' అన్నారు ప్రిన్సిపాల్ గరికయ్యనీ తవిటయ్యనీ కలిపిచూస్తూ.

''ఇప్పుడెక్కడౌతుంగండీ! ఏదో ఈ పనిలో పనిగా కాలేజీకి కంప్లీటుగా సున్నాలు వేయిస్తే బాగానే వుంటుందనుకోండి. కానీ ఎక్కడికని? ఇప్పటికే వోవరెష్టిమేషనైపోయి కూచుంది. ఈ పని అయేసరికల్లా ఎలా లేదన్నా మూడువేల పై చిలుకుమాటే! ఎంతకని తేడం—ఎవర్నడిగితేడం? పోనీ ఏ అక్కౌంటులోనో గొంకిద్దామంటే కొంపలంటుకుపోతాయి. అసలే రోజులేం బాగులేవు. ఏదో కానిద్దురూ—ముందు కనిపించే గోడలికి వేసేరుకదా!—అయినా మినిష్టరుగారు మేం చెప్పినట్టల్లా నడుచుకుపోవలిసిందే! తెలిసిందా మేష్టారూ!'' అని వోమారు గరికయ్య అందరి మొహాల్లోకి చూసి, సంతృప్తిగా చిరునవ్వు నవ్వి లేస్తూ ''అంచేత మేష్టారూ—ఇప్పటికిలా కానీయండి. నిదానంగా దరిమిలా చూసుకొందాం. మరి మేం వొస్తాం మాష్టారూ'' అంటూ లేచేడు. అతనితో మిగతా ఇద్దరూ కూడా లేచి వెళ్ళేరు.

అవతల జీప్ స్టార్ట్ అయిన శబ్దం వినిపించగానే ప్రిన్సిపాల్ అటెండర్ చేత తెలుగు లెక్చరర్ని పిలిపించి 'ఏవిటి మేష్టారూ మరీ అంత శ్రద్ధతీసుకోకుండా వ్రాస్తే ఎలా చెప్పండి? — శంఖుస్థాపన అని వ్రాయాలి కదండీ. మీరా పదాన్నివాడిన రెండుచోట్లా మామూలు కాయే వ్రాసేరు! మీరు స్టాఫ్నీ, ఎకామిడేషన్నీ ఇన్క్రీజ్ చేయమంటూ రాసేరు - బాగానే వుందనుకోండి. కాని ఆ విషయాలమీద గరికయ్యగారికీ వాళ్ళకీ ఏ ఇంటరెస్ట్ అస్సలు లేదు. అంచేత కొంచెం అది డ్రాప్చేసి, సీనియర్ కాలేజీకి పెర్మిషన్ గ్రాంట్ చేయమనే మేటరుపై ఫోకస్చేస్తూ వ్రాసేద్దురూ. అన్నట్టు అసలు సంగతి మర్చిపోయేను — చూడండి — వాళ్ళు చలవరాతి పలక అని కాక చంద్రశిలాఫలకం అనే పదాన్నే వాడమంటున్నారు. ఈ క్లారిఫికేషన్స్ చేసి మీరు కాలేజీ వదలివెళ్ళేలోగా నాకీ కాయితాలిచ్చేయండి'' అంటూ ఫైల్లోంచి కాయితాలు తీసి అతని చేతికిచ్చేరు.

కాయితాల్ని తను అందుకొనీ అందుకోడంతో ఇష్టం వొచ్చినట్లు చింపి ఉమ్మచుట్టి వేస్ట్బకెట్లోకి గిరాటేస్తూ—

''సారీ కాస్తంత బుద్ధి గడ్డితిని ఏదో మీరు చెప్పేరని — కేవలం మీమీద వున్న రిగార్డ్కొద్దీ జీవితంలో ఏనాడూ రాయని ఈ రాతలకు సిద్ధపడ్డాను. క్షమించండి—నాకు చేతకాదు. ఆ పద్యాలు వ్రాయించేరుగా వాళ్ళెవరినో వ్రాయమనండి—వొస్తాను'' అంటూ లేవబోతున్న తెలుగు లెక్చరర్ ప్రవర్తనకి షాక్ తిన్న ప్రిన్సిపాల్ సర్దుకొంటూ—

''కూర్చోండి వెంకట్రామయ్యగారూ! మిమ్మల్ని ఏదో అవమానించాననుకోకండి! అయినా ఇందులో ఏముంది — ఏదో వాళ్ళన్నట్లుగా రాసిచ్చేస్తే సరిపోతుంది గదా! వాళ్ళకే తెలీకపోవచ్చు. ఐతే వాళ్లకి నచ్చజెప్పేకన్నా అలా రాసిచ్చేస్తేనే సరిపోతుంది గదా — అలా రాసిచ్చేద్దురూ!'' అన్నారు.

''నన్ను మీరు రాయమన్నారు — నాకు తోచింది; కాలేజీ అభివృద్ధికి ముఖ్యావసరమని నాకు అనిపించిందీ కేవలం మీ మాట తీసేయలేకే వ్రాసేను. దాంట్లో మేటర్ మీకిష్టంలేదనీ, వర్డింగ్ బాగోలేదనీ మీరే అంటూ ఇంకా అవమానించలేదంటారేమిటి?!— ఇక్కడ ఈ విద్యాసంస్థలోని ఒక వ్యక్తి రాతని, ఈ ఇన్స్టిట్యూషన్ అభివృద్ధిని మనసారా కోరి రాసిన రాతని ఎవడో కౌన్కిస్కా మీయెదురుగ పెన్ పుచ్చుకు అండర్లైన్ చేసి మరీ మార్చేయమంటాడా? పోనీ నిజంగా ఏదో పొరబాటు దొర్లితే నేను శిరసా వహిస్తాను. ఆ మిడిమిడి జ్ఞానం వాళ్ళకి తెలీకపోడం వింతకాదు — కనీసం మీరన్నా ఈ సంగతి గుర్తించి ప్రవర్తించకపోడం నిజంగా నారాత! — సారీ — నేను వ్రాయను'' అంటూ వెంకట్రామయ్య ఛట్టున లేచేరు.

''వొక్కసారి మీరెవర్ని కౌన్కిస్కా అన్నారో గుర్తిస్తే మంచిదేమో!''

''ఏం బెదిరిస్తున్నారా! ఎవడైతే నాకేం! — నన్ననవసరంగా వేడెక్కించకండి. వెళ్ళిపోయేముందు వో మూడు వాక్యాలంటున్నా వినండి ఇదేం ఆ కౌన్కిస్కా అన్నదానికి ఏదో అయి రుజువుచేసుకోడానికి అనుకోనేరు కేవలం మీకోసమే చెప్తున్నా — శంకువు అంటే మంత్రయుక్తంగా పునాదిలో తొలిగా స్థాపించే వో చిన్నక్రఱ! అంతేగాని శంఖమూ కాదు మరోటీ కాదు. ఇక—చంద్రశిలాఫలకం ఏమిటి వాళ్ళ పిండాకూడు! స్పష్టంగా అందరికీ అర్థమయేలా అందరూ వాడేమాట రాస్తే ఏం చిన్నతనంగా వుందా? ఏం ఇంతగా సంస్కృత పదంలో నిండుతనాన్ని చూసిన మొహాలేనా అలా

ప్రయోగశాల అన్న పదానికి అండర్లైన్ చేసింది ? ఏం, ఆ అందరూ వాడే సంస్కృతపదం కన్నా లేబరేటరీ హాల్ అనే పదమే డిగ్నిఫైడ్‌గా వుంది గాబోలు ! ఇలా అఘోరించే వాళ్ళుండబట్టే 'మాకు ఇంగ్లీషే నయం — తెలుగొద్దు' అనే వాళ్ళు తయారౌతున్నారు. ఇక ఆ మూడో సంగతి — మేటర్ గురించి ! దాని గురించి మీకు ఇప్పుడు ఎలా చెప్పినా అర్థంకాదు — భావిలో మీకే తెలుస్తుంది'' అంటూ వెంకట్రామయ్యగారు వెళ్ళిపోయేరు.

అవాళ రాత్రి వెంకట్రామయ్యగారు భోంచేసి పేపరు తిరగేస్తుంటే అంకాలు మనవడిని బుజాన వేసుకు వొచ్చింది.

''ఏం అంకాలూ ఇలా వొచ్చేవ్ ! అన్నం తిన్నావా లేదా ? ఏవిటి నీ యజమాని పేరింటిగాడనేమిటి బుజానవేసుకు మనమడిని నొదలవు. ఆఁ కూతురింట్లోకి మకాం మార్చేవట !''

''మరే కాడికి పోతాను సెప్పండి బాబూ! పెదబాబుగోరూ, పెసిడెంట్‌బాబూ వొకరేటి అంతా కుమ్మక్కైపోనారండి· నా కొంప పీకేసి నన్నీదినొడేసినారండి. నానే కాడికి పోతానండి!— — ఆడెల్లేయెల్లిపోనాడు. నానీ కౌకులొట్టుకున్నాయండి. మీరూ ఆ ఆచేరిబాబూ నన్నేటి బగవంతున్నాగా కనికరించినారండి. నన్నెన కేసుకొచ్చి ఆళ్ళకీ ఇయాళ్ళకీ యినుకొనేట్టుసేసి నాకీ నవుకురీ యేయించినారు. ఏటి మీరిద్దరూ యెనకేసుకు రాపోతే నానేటి— నా అమ్మి వొ అయ్యకాడికెల్లడం కల్ల సూత్తానేటండి! నిజేనికి మీరే దాన్నో యింటిదాన్ని సేసేసినారండి. ఈ సర్పంజీగాడో పింజారీ యెదవండి. నా వొంటిమీద కన్నేసి యెంతేడిపించినాడండి, ఆడికి నొంగనేదని కడుపులో యెట్టేసుకు నా నవుకిరీ వూడగొట్టసూణ్ణేదుటండీ. యేదో అయిపోనాది. నా బుడ్డోడూ నానూ గుడిసెలో కూకుని కుసింత గంజి తాగుతుణ్ణాం గందా అని నానెంతో మురిసి పోతన్నానండి. ఈ కాడికి పింజారీవోడికీ బుద్ధి పుట్టినాది. వుత్త కంత్రీనాకొడుకండి. నానుగాని నా బొట్టిగాని ఆడికి నొంగనేదనే కడుపులో యెట్టేసుకు పెదబాబుగోరికి యేటేటో సెప్పేసి నాను గుడిసొగ్గేదాకా తెగ గింజుకు సచ్చిపోనాడండి — నా వుసురు తగల్దేటి'' — ఏడుస్తూ అంకాలేదో గొణుగుతోంది.

''ఊరుకో ఏడిస్తే ఏం వొస్తుంది చెప్పు ! అంతమంది కలిసి నిన్ను గెంటేస్తే ఏం చేయగలవులే ! అవునుగానీ నీ మొగుడికి నైట్‌వాచర్ గిరీ వచ్చినప్పుడు కాలేజీ జాగాలోనే ఇల్లు కట్టుకొని వుంటూ ఉద్యోగం చేయమని కాయితం ఇవ్వలేదుటే వాళ్ళు !'' అన్నారు వెంకట్రామయ్య.

''నేదండి — నానెంతో సెవినిల్లు కట్టుకు అలా కాయితం పుట్టించుకోరా అని తెగ సెప్పినానండి. ఆడేటి యినుకొనేరకమే టండి — యియ్యాల కదే నా కొంపతీసినాదండి. యేటి సేత్తరో మీరూ ఆసేరిగోరూ పూనుకోవాల. అళ్ళంతా యినుకొనేటట్టు సెప్పి మల్లా నాగూడు నాకు నిలబెట్టాల. కానీజీకి యెనక తట్టైనా నాకేటి యిరకాటకవుఁ యిబ్బందీ నేవండి. ఏదో ఆ కాడికే యింత కమ్మ నేసుకు పడుంటాను.''

''నీ తెలివి తెల్లారినట్టే వుంది. కాలేజీకి వెనకాతలా ! అంటే రేప్పొద్దున్న గోడౌన్స్ కట్టబోయేచోట ! పంచాయతీ జాగాలో నీకు చోటిస్తాడే సర్పంచ్ ! ఇచ్చినా ఆ ఆరుబయట ఎక్కడా కనుచూపుమేరలో ఓ గుడిసైనా కనిపించనిచోట నువ్వెలా ఉంటావే?- ఏదో సైన్సు మేష్టారితోబాటు ఆలోచించి చెప్తాను-- అన్నం తిన్నావా ?''

''మా అల్లుడింకా డూటీనోంచి రానేదండి. ఆడొచ్చినాక యెంగిలి పడదావని యీ బుడ్డోణ్ణి సంకనేసుకు మీకియన్నీ ఇసిదం సేసికొందామని వో సుట్టు పారొచ్చినానండి. సానాసేపై పోనాద - బేగెల్లకుంటే నాకేటి అగుపడదేటి ! మరి నానెల్లిపోతానండి'' అని మనవణ్ణి ఎత్తుకుంది.

''మంచిది - జాగ్రత్తగా చూసుకుంటూ వెళ్ళు. రేపు ఏ సంగతీ చెప్తాను ఓసారి కనిపించు''అంటూ వెంకట్రామయ్యగారు లేచేరు.

మర్నాడు వెంకట్రామయ్య కాలేజీకి వెళ్ళేసరికి అక్కడంతా మహాసందడిగా వుంది. లారీలతో ఇసక తెచ్చి పోసేరు ! — ''అవును గానీ సంవత్సరం క్రితం నుంచీ ఆ ప్లే గ్రౌండులోనూ, వాలీబాల్ కోర్టులోనూ ఇసక పోయించండయ్యా అంటే వొక్కడు ఉలికితే వొట్టు ! మరి ఇప్పుడు—చ్ప్ !'' — డి. డి. టి. బస్తాలు వో రెండు వో మూల రడీగా విప్పి వున్నాయి ! ''ఈ పౌడర్ని న్యాయంగా ప్రతీరోజూ రోడ్ల కిరుప్రక్కలా కాలవలవైపు జల్లాలి గాబోలు ! ఏదో ఇవాళ్టికన్నా ఈ వూర్లో వో రోడ్డుకైనా ఆ యోగం దక్కింది !'' బిల్డింగ్‌కి ఇటువైపంతా సున్నం వేసేశారు. లారీమీద వొచ్చిన షామియానాలనీ, టార్పాలిన్‌లనీ, కుర్చీలనీ వరండామీదికి దింపి వో గదిలో పేరుస్తున్నారు. స్టూడెంట్స్ కొంతమంది బ్యానర్లపై ఏవో అక్షరాలు రాస్తుంటే; మరికొంత మంది రంగు కాగితాల్ని కత్తిరిస్తున్నారు. గేట్ దగ్గిరనుంచీ త్రోవ కటూఇటూ ఇటికల్ని కోసుగా కొట్టి పాతుతూ, వాటిపై తెల్లగా సున్నం వేస్తున్నారు.

వెంకట్రామయ్యగారు చటుక్కున దూరంగా కుడివైపు ప్రహరీవారకి చూసేరు. అసలు గుడిసెవున్న పోలికేలేకండా నేలంతా చదునుచేసి 'ఎల్' షేప్‌లో గొయ్యి తవ్వి మొదట్లో గోతిలోకి మూడు మెట్లు చెక్కుతున్నారు. దానికి కొంచెం దూరంగా — ''అరి ! ఏమిటప్పుడే దిమ్మ కట్టేయడం; దానికి అక్షరాలు చెక్కిన చలవరాతి పలకని తాపడం కూడా అయిపోయింది! — నిజంగా అవసరం అని అనుకోవాలేగాని—అనుకొన్నారా ఎంత పనైనా వీళ్ళు అవలీలగా చేయగలరు. ఈ శ్రద్ధలో పావువంతుశ్రద్ధ చూపినా ఈ కాలేజీ ఈ పాటికెంత అభివృద్ధి చెందివుండేదో!'' అని అనుకొంటున్న వెంకట్రామయ్యగారి దగ్గరకి —

''నమస్కారం మేష్టారూ ! వో చిన్న శుభవార్త ! ఇవాళా రేపూ మన ముష్కరుడుగారు కాలేజీలో వర్క్ సస్పెండ్ చేసేడు.

రేపటి ప్రోగ్రామ్ సర్క్యులేట్ అవుతోంది ఫుల్ సిగ్నేచర్లు కోరుతూ!'' అంటూ సైన్స్ లెక్చరర్ భాస్కరాచారి వొచ్చేరు.

''అయ్యో ఇవాళ మంచి పోయిట్రీ క్లాసులు ఏట్లో కలిసా యన్న మాటే!''

''ఎందుకండీ మరీ అంత వర్రీ ఐపోతారు? — మీరంటుం టారు చూడండి తామరాకుపై నీటిబొట్టులాగా అని-అ మెంటా లటీ ఈవిషయంలో కూడా అలవాటు చేసుకోకపోతే బ్రతకలేమండీ! మీరేమనుకోండి—నా మట్టుకు నాకు హాయిగా తేలిగ్గా వుందివాళ! పదండి వో మారలా హాయిగా ఏటి ఇసకలోంచి నడుచుకొంటూ అట్నించిరామతీర్థాలు జంక్షన్లో సిటీబస్ని క్రాస్‌చేసి విజయనగరం పోదాం. ఇవాళ సిడ్నీ పొయిటర్ టీచర్‌గా ఏక్ట్ చేసిన 'సెర్ టు విత్ లౌ' అన్న బ్రహ్మాండమైన పిక్చర్ వుంది సిటీలో.''అన్న భాస్కరా చారి గారి మాటలు విని వెంకట్రామయ్యగారు

''సారీ- ఇవాళ వో చిన్న రాతపని పైనేసుకొన్నాను''అన్నారు.

''ఐసీ—మళ్ళాయేదన్నా ఆర్టికల్ రాస్తున్నారా!!''

''లేదండీ—చిన్న లోకోపకారం—అవునుగానీ — వోసారి ఇలా రండి'' అంటూ వాలీబాల్ కోర్టువైపు నడుస్తూ వెంకట్రామయ్య గారు ''అవునూ లేబరేటరీ అక్కడ కట్టడమేవిటండీ? కాస్ట్లీ ఎక్విప్‌మెంట్ వుంటుంది కదా! గోడ కటువై పంతా ఆరు బయ లుంది!'' అన్నారు.

''ఏమిటి మేష్టారూ మీరు మరీ అంత ఇన్నోసెంట్‌గా ఎలా వుంటారో నా కర్థం కాడంలేదు — అంతా ఫార్సండీ! గిరికయ్య మొన్న ఖాళీ అయిన రిజర్వ్‌డ్ సీట్‌పై ఎం.ఎల్.ఏ గా నించో బోతున్నాడు లెండి. ఆ సీట్ గ్యారంటీగా తనకే దక్కాలనీ, తీరా దక్కేక ఖర్చులకై వీలైనంత ఎక్కువగా పార్టీ నిధి నుంచి దక్కించుకోవాలనీ, ఇక ఆపైన గెల్చేక — శాంత పాపం — అయినా చెప్పకొనారి తప్పదు — ఏ పోర్టిఫోలియోలోనో ఇరుక్కుపోవాలనీ బ్రహ్మాండమైన ఆశాపాశాన్ని తన మెడలోని శుద్ధ పొందూరు ఖాదీ హారంలాగా అందంగా పెంచుకుంటున్నాడు. అందుకోసమనే ప్రస్తుతం రాబోయే మినిష్టర్‌గారి హార్ధిక లేక ఆర్థిక సహాయ సంపత్తులు పొందాలని ఇలా సదరు శ్రీ వారిచే ఇక్కడ ఈ శంకు స్థాపనా, అక్కడ వూరి పొలిమేరలో ఎప్పణ్ణించో వాడబడుతున్న హరిజన వాడలో కొన్ని ఇళ్ళకు ఓపెనింగ్ సెలిబ్రేషనూ, ఈ వూరి వార మన ప్రియతమ శిష్య బృందంచే శ్రమదానంతో నిర్మింపబడ్డ రెండుంబావు మీటర్ల సుదీర్ఘ గోపీపాతపంథాకు ప్రారంభోత్సవమూ దగ్గిరుండి చేయిస్తూ కాకా కొడ్తున్నాడు.

---

సందట్లో సందడిగా మన సర్పంచ్ ఈ కాలేజీని అమాంతం సీనియర్ కాలేజీ చేయించేసి ప్రస్తుతగ్రాంట్లనీ, డొనేషన్లనీ ద్విగుణీకృతం చేసుకు పదిలం చేసుకోవాలని యమయాతన పడుతున్నాడు. ఇక మన ముష్కరుడుగారు — పాపం వెర్రివాడండీ — కొన్ని విషయాల్లో అతణ్ణిచూస్తే జాలేస్తుంది—మొండావాడు హైస్కూల్లో మేథ్స్ అసిస్టెంట్‌గా అఘోరిస్తూ మెల్లిగా ఈ గరికయ్యని కరిగించుకొని ఈపదవి నధిష్టించాడు మన ఖర్మకొద్దీ. పాపం మేథ్స్ వాడు కదా—లెక్కలూ, తన జేబులో పడాల్సిన లెక్కలూ తప్ప పొలిటిక్స్ అర్థం కావు పాపం! నేనే జాలివేసి నిన్న చెప్పేను 'ఇదిలా జూనియర్ కాలేజీగా వుంటేనే నీకా గ్రాడెజ్ సింహాసనం! సీనియర్ కాలేజీ అయిందా—చూసుకో ఈ త్రిశంకు స్వర్గం నుంచి జారిన మీరూ నేనూ కలిసే డిపార్ట్‌మెంట్‌లో కూర్చోవచ్చు' అని! ఆ మాటలు విన్నప్పటి నుంచీ మేజోళ్ళో తేలు కుడుతున్నట్లు వొకటే యాతన పడతాడేతప్ప పైకి పిసరంత కక్కడు! అమ్మో — గరికయ్యంటే గురూకి నరనరాల్లోంచీ ఎంత వణుకని! సారీ—వొస్తానండీ మేట్నీకి టైమైపోతుంది—రేపు కలుద్దాం'' అంటూ భాస్కరాచారి వెళ్ళిపోయేడు.

అవాళ రాత్రి ఇంటికొచ్చిన అంకాలికి వో కాగితాన్నిస్తూ వెంకట్రామయ్యగారు ''ఈ కాయితాన్ని సైన్సు లెక్చరర్‌గారికి చూపించి; జాగ్రత్తగా చదవమన్నాననీ, ఏమన్నా మార్పులూ చేర్పులూవుంటే చేయమన్నాననీ చెప్పు. తరవాత వాళ్ళచ్చాయిచేత మూడు కాపీలు టైపు చేయించిపెట్టమను. ఈ కాగితంమాత్రం ఆ మేష్టారి దగ్గరే వొదిలేసి, టైపు చేస్తారు చూడు ఆ మూడు కాయితాలూ తీసుకొని, రేపు తలుపులుతోబాటు కాలేజీకి రా. మీటింగులో మంత్రిగారికి అందరూ వినతి పత్రాలని కాయితాలిస్తుంటారు చూడు అప్పుడు మీరిద్దరూ కలిసి స్టేజిమీదకెళ్ళి దణ్ణంపెట్టి మంత్రిగారికో కాయితం, గరికయ్య, సర్పంచ్‌లకి మిగతావీ ఇచ్చేయండి. పోలీసులూ ఇంకా ఎవరైనా మిమ్మల్ని అటకాయించి ఏమిటా కాయితాలన్నా మీరేం చెప్పక్కర్లేదు.

ఈ కాయితంలో వ్రాసిందంతా నీ మేనల్లుడు తలుపుల్ని పిలిచి నేను చెప్పేను. వాడొప్పుకున్నాడు. మరి నువ్వు స్వీపర్‌పోస్ట్‌లో వుంటూ గుడిసె కావాలంటే వొప్పుకోరు. అంచేత తలుపులే తాను నైట్ వాచర్ గాబట్టి ఇల్లు కావాలనీ, వాలీబాల్ కోర్టుకటు వారగా గోడకానుకొని గుడిసె కట్టుకోడానికి ఆర్డర్ద్వారా అనుమతించమనీ మంత్రిగారిని ప్రార్థిస్తున్నట్లుగా ఈ కాయితం వ్రాసేను. అలా ఆర్డరంటూ వచ్చేక నువ్వే ఇల్లు కట్టుకొని వుంటావు—ఏమంటావ్!'' అన్నారు.

''సానా బాగున్నాదండి. తలుపులు నా యింటోనే ఎదిగినాడు కదేటండి. ఆడికి నానంటే సానా ఆపేచ్చున్నాది నెండి'' అంది అంకాలు కాగితాన్నందుకొంటూ.

''మరి వెళ్ళు. ఆ పనులన్నీ చక్కబెట్టుకో. పనయ్యేవరకూ మా పేర్లు బైటకి రానీయకు'' అన్న వెంకట్రామయ్య మాట కడ్డొస్తూ —

''అదేటిబాబూ—నాకు తెల్దేటండి—నాను సచ్చి మి కడుపున పుడతానండి-ఎల్తాను'' అని నమస్కారంచేసి అంకాలు వెళ్ళింది.

మర్నాడు హోమీబాబా ద్వారంవద్ద ఎదురుచూస్తున్న జనం దూరంగా మంత్రిగారి కారు చూడ్డంతో చటుక్కున రోడ్డు కటూ యిటూ తప్పుకొన్నారు.

మంత్రి కారు దిగేరు—ఏ వొక్కరూ తన దగ్గరకి రావడం గానీ, కనీసం నమస్కరించడంగానీ చేయకపోవడంతో వో క్షణం ఇబ్బందిలో పడ్డారు.

ఇంతట్లోనే 'స్టార్ట్' అని వినిపించడం, ద్వారం స్తంభాల వెనకనుంచి ఛటాలున వచ్చిన ఆడపిల్లలు రెండు లైన్‌లలో ఫిజికల్ ఇన్‌స్ట్రక్టర్ అంటున్న ''వన్ టూ—త్రీ ఫోర్-ఫైవ్ సిక్స్—సెవెన్ యైట్; 'యైట్ సెవెన్—సిక్స్‌ఫైవ్—ఫోర్‌త్రీ—టూవన్'' అనే మాటలకి లయబద్ధంగా యూనిఫారంలో వున్న తాము అటూ ఇటూ వొంగి లెజిమ్సు కొడుతూ చరచరా మంత్రి కెదురుగా వొచ్చేరు. వాళ్ళ మధ్యగా కిరీటంతో రాణీవేషంలో వున్న అమ్మాయి మినిష్టరుగారి దగ్గరకొచ్చి, యువరాణి అందించిన వెండిపళ్ళెంతో వారికి హారతిచ్చి, పూలమాల వేసింది. యువరాణులూ, రాణీ పళ్ళేల్లోంచి వొయ్యారంగా తీసి పూలరేకుల్ని నేలపై జల్లుతుండగా మధ్యగా మంత్రిగారు మెల్లగా అడుగులు వేస్తూ వొస్తున్నారు. అటూ ఇటూ లెజిమ్సు కొడుతూ వెనుతిరిగి పిల్లలు చర చర వొస్తున్నారు.

ఎంత నిగర్వికైనా ఇలాంటి తంతు జరుగుతుంటే కొంచెం బుజ్జి ఎగరేస్తూ మరీ నడవాలనిపించి తీరుతుంది!

ఈ వింత స్వాగతానికి మంత్రిగారు గొప్పగా ప్లీజై చిరునవ్వుతో ముందుకు సాగి వొస్తున్నారు—ముకుళిత హస్తాలతో అందరి నమస్కారాల్ని అందుకొంటూ. ఫ్లాష్ కెమేరాలు తెగ మెలుస్తున్నాయి.

కాలేజీ దగ్గరున్న రామన్ ద్వారం దగ్గిర కొందరు బ్రాహ్మణులు చేతుల్తో పూర్ణకలశాలని పట్టుకొని — ''ఓం స్వస్తిర్భామనుష్యేభ్యః'' అని మంత్రాలు చదువుతూ ఎదురొచ్చి, కలశోదకాన్ని మంత్రిగారిపై సన్నగా మామిడాకుల్తో ప్రోక్షిస్తూ, పునాదులదాకా తీసుకువెళ్ళి, అక్కడ షామియానాక్రింద ఓ చిత్రాసనంమీద మంత్రిగారిని కూర్చోబెట్టి, సంకల్పం చేయిస్తున్నారు.

కుర్చీ నరసలలో మధ్యగా కూర్చొన్న వెంకట్రామయ్యగారి బుజంపై పెనకనించి మెత్తగా తట్టి, తనవైపు తిరగ్గానే కళ్ళతో 'బైటకిపోదాం' అని భాస్కరాచారి సంజ్ఞ చేసేరు.

ఇవతలి కొచ్చేక "అలా వెళ్దాం రండి" అని ముందుకు నడుస్తూ, స్టూడెంట్ తెచ్చిన సిగరెట్ పేకెట్టు అందుకొని థాంక్స్ చెప్పి, హైస్కూలు వెనకాతలకి వెంకట్రామయ్యని తీసుకుని భాస్కరాచారిగారు వెళ్ళేరు.

రాసుసిరి చెట్టుకొమ్మ నానుకు సిగరెట్ వెలిగించి వెంకట్రామయ్యగారికి సిగరెట్ అందిస్తూ భాస్కరాచారి మొదలుపెట్టేరు—

"అవునండీ—ఎందుకండి ఆ రాతలు?! ఆ కాయితంపై సదరు మంత్రివరేణ్యుడు ఏ ఏక్షన్ తీసుకొన్నా తీసుకోకపోయినా— మన ప్రెసిడెంట్ సర్పంచ్‌లు మాత్రం మిమ్మల్నో భరతం పట్టిస్తే గాని వో పట్టాన వొదలరు తెలుసా!"

"బాగుంది—వాళ్ళెవరో భరతం పట్టేస్తారేమోనని భయపడి ఈ అన్యాయాన్ని అందునా పాపం దాని కొంప పీకేసి, చాపా ముంతా వీధిని గిరాటేస్తే చూస్తూ కూర్చోడం ఏం ధర్మం చెప్పండి" అన్నాడు వెంకట్రామయ్య బిగించిన పిడికిట్లోంచి పఫ్ లాగబోతూ.

"ఐ మీన్—నా అభిప్రాయం అదికాదు. ఇలా కాయితాల్తో మీరనుకొన్నది ఏం సాధిస్తారని! వూరకే బైటపడిపోయి—వాళ్ళ చిర్రుబుర్రు కోపాలకి మీరు గురవడం తప్ప మరేంకాదు. అయినా ఈ సర్పంచ్ తనకు లొంగని అంకాలికి ఈ వీలు దక్కనిస్తాడనా మీ నమ్మకం!"

"నేను అంకాలు వ్రాసుకొన్నట్టుగా కాయితాన్ని రాయలేదే! తలుపులే ఇల్లు కావాలంటాడు. ఆ ఇంట్లో అంకాలుంటుంది."

"వూరుకోండి మేష్టారూ—మీరు మరీను! ఈ పొలిటికల్ బ్రైన్స్‌కి మీ ఆలోచనలు అర్థం కావనుకొన్నారా? అంతెందుకు? అంకాలిని ఇంట్లోంచి తగిలేసినప్పుడే అది ఎవరెవరి దగ్గరికి సలహాకి పోతుందో కూడా వాళ్ళకి తెలుసునంటే మీరు నమ్మగలరా!"

"అయితే—దాని ఖర్మాన దాన్ని వొదిలేయడమేనా వీళ్ళకి భయపడి!"

"ఏం వొదలక్కరలేదు—హాయిగా వో వారందాకా —అంటే మన కాలేజీలో పరీక్షలు స్టార్టయేవరకూ కూతురింట్లో వుండి; తరవాత గప్‌చిప్‌గా మునపటిచోటే వో పాక లేపి; హాయిగా ఈ కొంగ్రొత్త చంద్రశిలా ఫలక స్థగిత కుడ్యాన్ని తనింటికి వో ప్రక్క గోడగా మలుచుకొని మరీ సుఖంగా వుంటుంది!"

"అదేవిటి? అక్కడ లేబరేటరీ—అదేలెండి — మొత్తంమీద ఏదో వొకటి కట్టేయబోతున్నారుగా!"

"కట్టేయబోతుంటే అంటారేవిటండి? కట్టేస్తేను! ఆ చంద్రశిలాఫలకం వున్న దిమ్మ కట్టేసేరా లేదా?! అంతే—దట్సాల్!"

దూరంగా చప్పట్లూ, మైక్‌లోంచి ప్రిన్సిపాల్ చదివే స్వాగతపత్రమూ విన్పిస్తున్నాయి.

"అంతే మేష్టారూ—మరేంలేదు! అనవసరంగా మీరేమాత్రం వర్రీ అవకండి! వారం రోజుల్లో పరీక్ష లొస్తున్నాయి. ఆపైన సెలవులుకదా! అంకాలు లేపబోయే గుడిసెపై ఎవరైనా దృష్టి త్రిప్పడానికే మూణ్ణెల్ల పైచిలుకు పడుతుంది. ప్రిన్సిపాల్‌కి ఇలాంటి విషయాల్లో చీమ కూడా కుట్టదన్న సంగతి మీకు వేరే చెప్పక్కర్లేదు. అది మళ్ళా గుడిసె లేపేసరికే మన ముష్కరుడి ప్రాణాలు పైకి పోతాయి—అలాంటిది దానితో మాట్లాడ్డమే! ఇక ఒకవేళ సర్పంచ్‌దృష్టి పడినా—ఇప్పుడు తాను దగ్గిరుండి పొమ్మంటే కదా అప్పుడు 'ఎందుకొచ్చేవ్ మళ్ళా' అని అనడానికి! పైగా మీకూ నాకూ ఝడిసి వూరుకొంటాడు. ప్రెసిడెంట్‌కి మనం ఏవేవో వాడి గుట్టు చెప్పేస్తామని మనమంటే వూరకే తెగ బెరుకు. ఇక వొక వేళ అందరూ ఏకమై పాక పీకేస్తామన్నా — మనం వున్నాం— వూళ్ళోవాళ్ళు కొందరున్నారు 'ఏది ఆ మీరన్న భవన నిర్మాణాని కని వొక్కటంటే వొక్క బండెడు రాళ్ళూ, వొక్క బండితో సున్నమూ తెచ్చి అక్కడ పోయించండి! — మేమే దాని పాక పీకేసి, సీకపై చెయ్యేసి మరీ బైటకి గెంటేస్తాం' అని చెప్పడానికి! — ఏవంటారు?"

అసలింతకీ అంకాలిని అప్పుడు ఈ సర్పంచూ, ఈ ప్రెసిడెంటూ పైకి అనకపోయినా లోపల ఎంత మెచ్చుకుంటారో వూహించండి?!— ఎందుకంటే—వాళ్ళకి అవసరం వొచ్చినప్పుడు మారుమాటాడకుండా గుడిసె తీసుకుపోయింది తరవాత గుడిసె వేసుకొని ఇప్పటి ఆ చంద్ర శిలాక్షరాలు ఆ కర్మసాక్షిక్కూడా కన్పించకుండాచేసి వాళ్ళ మర్యాద కాపాడుతుంది కదా! పైగా "ఏస్తే యేసుకున్నావు గానీ—వో నూరుకూడా ఆ తట్టున దించేసుకు యేడవరాదటే—ఆ సెందర సిలాపలకం కంపినీటుగా అవుపించకుండా—పొద్ది! ఆపైన నిదానంగా నీ పొయ్యి వున్నెమూ అని దానికింత మందాన పొగట్టుకుపోయి మాకింత పరువు దక్కిస్తాది గందా!" అని తప్పకుండా అంకాలితో అని తీరతారు చూడండి!

"ఏవిటలా నిర్ఘాంతపోయి చూస్తున్నారు— పదండి పోదాం— వో సిగరెట్ తీసుకోండి!" అంటూ భాస్కరాచారి తనో సిగరెట్ వెలిగించుకొని; సంగోరుమూసిన తన దోసిట్లో వెలిగే అగ్గిపుల్లని అందించి వెంకట్రామయ్యగారి సిగరెట్ వెలిగించేరు.



# ఆనందమే నేను!

కరకర ఆకలేస్తే
తింటాను
కడుపార ...
అమ్మ నాదగ్గరే కూర్చుంటుంది.
గడ గడ మంచినీళ్ళు తాగి
ఎగురుతూ గెంతుతూ
వీధిలోకి పారిపోతాను
ఎంతగాలి!
ఆరబయిట హాయి.
అమ్మ నన్ను కొట్టదు
నాన్న నన్ను తిట్టడు
వాళ్ళ నెప్పుడూ అంటిపెట్టుకునే వుంటాను.
వీధిలో నిలబడితే
నాన్న 'మా అమ్మాయి' అంటాడు.
కళ్ళల్లో చందమామంత వెలుగు
అమ్మా ... అంతే ...
అలా చూస్తూ నవ్వు ద్దెందుకో
నాలాగే తనూ అట!
నా అంగాలు ఎదిగాయి
జాకీట్లు పొడుగయ్యాయి
మబ్బుల్లోని మెరుపులా
నాలో ఏమిటో
గిలగిల కదులుతోంది
కిలకిల నవ్వుకున్నాను
కోకిల కుహు కుహూ ... అంటే
కను రెప్పలటేవుంచి చూస్తున్నాను
కాకి ఎంత విసురుగా వచ్చింది
క్షణంలో హారీ అనేది
నా చిట్టి కోకిలమ్మ
కుహు కుహు మల్లెల చిందర వందరచేస్తూ
తెగిన దండలోని ముత్యాల్లా జారి జారి
అందకుండ ఎగిరిపోయింది
శబ్దానికి వాసనా వెలుగూ ప్రసాదించి
తుర్రుమంది!
ఎందుకంత భయమ్మో ... ?
అంతగా బతకాలని కోరికెందుకో ...
నాకూ అంతే ...
నేను బతుకుతాను!
వెలుగునీ వాసననీ
మాటగా చేసి బతుకుతాను.
మాటనూ మనసునూ ఏకంచేసి
చిందులు తొక్కిస్తాను
ఆనందమే నేను!
నేనంటే
అందరికీ
ఎంత యిష్టమో ...!

# అహం ముళ్ళు

ఊత్త వెన్నెల నీవు
నీ మెత్తని మీగడ తరకల హృదిలో మొలకెత్తిన
జ్యోత్స్నాంకుర జ్యోతిని నేను.
ఎదిగి యెదిగి
నీలోని నిరంతర రాంతర చైతన్యామృత పౌజన్య
సాగరమై
ఈ భూమండలాన
అణువణువునూ చీల్చి
మొలక జాబిల్లి మొనల పూడ్చి
ఆకసంలోని చీకటి బిలాల
కనంతంగా కాంతి వెల్లువల
వెలుగు మళ్ళను

దానం చేశాను.
ఈ కష్టఫలా
న్నీ నేత్ర ద్వయంతో అలవోకగా
చిరు నగవు మెరుపు పులకింతలతో
విలోకించాను.
ఔను !
ఇవాళ నేను ...

సాగరోన్ముఖ ప్రయాణోద్ధృత నదీజలాల దివ్యగానవాహినిని
ఈ భూమి సమస్తం ఒకే ఒక్క పూవుగా విరిసి వెదజల్లిన
సుగంధ సమీరాన్ని
సూర్యుడు నా ఈ వీపు వెనుక తెలిపట్టు కుషనుగా మారిన
వెలుగుల పాదుషాని
నీ ముంజేతి మణిమయ కంకణ దీప్తితో వెలుగు హారతుల
తారామణులందుకున్న దివ్య మనీషిని

ఇంతలో —
టాక్యాన్ కిరణవేగంతో ననువీడి

ఓ నా ప్రజాభ్యుదయ కృషీ విజయ మహోదయానంద
సుందర ప్రగతీ ...

ప్రియవన వధూటీ ...
అనంతంలోకి
గుండె గడియ బిగించి తరలిపోయావా ...
ఈ నా జీవనాడులలోని
అహం ముళ్ళను తాకలేక
కనీసం చూడలేక
వొక్క సెకన్నైనా సహించలేక
అదృశ్య గగనమై
నిశ్శబ్ద రాగమై
మిగిలి పోయావా ...

కోటాను కోట్ల కాంతివత్సరాల వెనుక దిగవిడచి
దిక్కులేని అనంతంలోకి విరక్తిగా వెళ్ళిపోయావా ...

ఈ నీ ప్రియుణ్ణి
నేటి నీ యీ కుంటి వెలుగుల సామ్రాట్టును
చూడరావా ...

చుక్కల కాంతులన్ని నీవై రావా ...
అయ్యో ... ఈ ఆకసం ...
పుచ్చకాయలా పగిలి ముక్కలై పోతున్నదేమిటి ?
నెత్తుటి ముద్దలతో
ఖండ ఖండాలుగా

విశృంఖల విరహ విహార భాష్యాంతర నికృష్ట దీప్తిగా
విశ్వమంతా నిండిపోతున్న దేమిటి ?

గాలిలుంగలు చుట్టుకొనిపోయి
వెలుతు రడుగంటిపోయి
జిహ్వాగ్రాన మెలికలు తిరిగిపోతూ ...
మెరుపు ప్రాణాల
కూకటి వ్రేళ్ళతో
ఆకు దివ్వెల
దుఃఖాశ్రు హీన కిరణాలతో
అబ్బా ... ఈ శ్వాస ...
జడమై నిర్జీవ చంద్రమండలమై
పాషాణ వారాశిగా
ఏలుకాబోతున్నది ... ?

**శ్రీ రంధి సోమరాజు**



సత్యప్రియ

# కవిరాజ శిఖామణి అనువాద పద్ధతి

నన్నెచోడదేవ కవిరాజ శిఖామణి తెనుగునందు కుమార సంభవమను మహాప్రబంధమును రచించి యున్నాడను విషయము యెల్లరెరిగినదే. ఇతడు నన్నయ తిక్కనలకు నడిమి కాలమునకు చెందినవాడని విమర్శకులు భావించుచున్నారు. ఈ గ్రంథమును మొట్టమొదటి సారి వెలుగునకు దెచ్చిన కీర్తి కీ. శే. మానవల్లి రామకృష్ణ కవి గారిది. వీరు యీ కవి నన్నయకు పూర్వుడను వాదమును లేవదీసి నాటి విమర్శకులీ గ్రంథము నుత్కంఠతో జదువుటకు ప్రేరేపించిరి. సందర్భవశాత్తు ఒక మాట. కవిగారికి నన్నయగారి కవిత్వముపై సద్భావము లేదు.[1] కావున నన్నయ ప్రథమాంధ్ర కవి యను సంప్రదాయమును మార్చుటకు నన్నెచోడుడు నన్నయకు పూర్వుడను వాదమును లేవదీసియుందురేమో ?

ఏది యేమైనను యీ కావ్యమును గూర్చి నేటికినీ పరిష్కారము గాని పలు యంశములను వారు ప్రతిపాదించి యుండిరి. అట్టివానిలో నితడు కాళిదాసు కుమార సంభవము ననుసరించ లేదనుట యొకటి.[2]

కొందరితడు యుద్భటుని కుమార సంభవము ననుసరించెనని యనిరి. ఈ గ్రంథమిప్పుడలభ్యము గాన యితడద్దానిని యనుసరించెనో లేదో నిష్కర్షగా తెలుప వలను పడదు.

మరికొందరితడు కన్నడ యుద్భట కవి కుమార సంభవము ననుసరించెననిరి. కన్నడ యుద్భటుడు కుమార సంభవమును రచించి నట్లాధారములు లేవు.[3] కావున నన్నెచోడుడా కావ్యము ననుసరించినట్లుల తెలుపుట కేవలమూహయే.

మహాశివపురాణమును, కాళిదాసు కుమార సంభవమును, ఉద్భట కుమార సంభవమును, మరికొన్ని పురాణాదులను, ప్రాంతీయ గాథల ననుసరించి నన్నెచోడుడు కుమార సంభవమును స్వతంత్ర ప్రబంధముగా రచించెనని పలువురి పండితుల యభిప్రాయమై యున్నది.

ఇది యిటులుండగా క్రీ. శ 1937 లో 'నన్నెచోడదేవ కుమార సంభవ విమర్శన'మను గ్రంథమును రచించిన కీ. శే. శ్రీపాద లక్ష్మీనృపతిశాస్త్రిగారు కాళిదాస కావ్యమే నన్నెచోడుని కావ్యమునకు మూలమని వచించి యెన్నియో పోలిక పద్యములను జూపిరి కాని యీ వాదమునకు ప్రాముఖ్యత రాలేదు. ఖండన మండనలును జరుగలేదు. కారణ మనూహ్యము.

విమర్శకులు చోడుడు కాళిదాసీయము ననువదింప లేదనుకొనుటకీ క్రింది ముఖ్య కారణములగపడుచున్నవి.

1. చోడుడు కాళిదాసు శ్లోకముల నన్నింటిని యనువదింప లేదు. పోలిక పద్యములున్ను బహు తక్కువ.

2. ఇతని పద్యములకు మూలములు సంస్కృత కుమార సంభవమునందేగాక పూర్వ గ్రంథముల యందెన్నిటియందో గలవు.

3. వర్ణనాదులందు రెండింటిలో పోలిక లేదు.

4. సంస్కృత కుమార సంభవము 17 సర్గల గ్రంథము కాగా తెనుగు కుమార సంభవము 12 ఆశ్వాసముల గ్రంథము. (ఇందు కాళిదాస రచితము 8 సర్గలే యని పండితుల యభిప్రాయమై యున్నది.) అనగా కథా ప్రణాళికయందు మార్పు గలదన్నమాట.

5. చోడుని కుమార సంభవములోని మొదటి రెండాశ్వాసములకు మూలము సంస్కృత కుమార సంభవములో లేదు.

కవి కుల గురువగు కాళిదాసు కుమార సంభవమును రచించి యుండగా దానిని పరిగణింపక స్వతంత్ర కావ్యమును రచింపగల ధైర్యము చోడునికి కాదుగదా మరి యెవ్వరికిని యుండబోదు. చోడుడు తన కాలమునందలి కథానువాద పద్ధతి[5] ననుసరించుట వలన యీ యభిప్రాయ భేదములకు తావుగలిగి యుండును. ''స్వతంత్ర ప్రబంధరీతిని నిబంధించుటయే పూర్వకవుల యనువాద రీతి గదా !''[6] యన్న కీ. శే. లక్ష్మీనృపతిశాస్త్రిగారి పలుకులు సత్య సమ్మతములు. కావున కాళిదాసు శ్లోకములకు యథాతథానువాదము తెనుగు కావ్యమున గనిపించుట లేదు. కథా ప్రణాళికను మాత్రమే యనుసరింప బూనుకొనుటచే వర్ణనాదుల యందు చోడుడు స్వతంత్రించెను. అష్టాదశ వర్ణనాదికమును కావ్యమున నిబంధించుట చోడుని ఆశయమైయున్నది.[7] కావున స్వతంత్ర వర్ణన మావశ్యకమయ్యెను. (చోడుడిట దండి కావ్యాదర్శమున దెలిపిన సర్గబంధ కావ్యలక్షణముల ననుసరించినట్లున్నది.) ఎప్పుడైతే వర్ణనాదికమందు స్వతంత్రత భావించెనో యప్పుడే తనకు నచ్చిన తావులందు పూర్వుల శ్లోక భావముల ననువదించుకొనెను. అనువైనచోటుల పురాణ కవులయందు పూజ్య భావమును ప్రదర్శించుటకు వారి భావములను వినయముతో ననుకరించుట సుకవుల లక్షణముగదా! ఆశ్వాస సంఖ్యయందు మార్పున్నంత మాత్రమున కథా ప్రణాళిక యందు మార్పుండనవసరము లేదు. మొదటి రెండాశ్వాసముల కథ దప్ప మిగిలినదంతయు సంస్కృత కుమార సంభవము ననుస

రించిన ప్రణాళికయే. కాకపోతే ఆశ్వాస సంఖ్యయందు మార్పు గలదు. రెండాశ్వాసముల కథయు తన శైవాగమ పద్ధతి కనుకూలముగ శైవమతములో ప్రసిద్ధమైన దక్షాధ్వర ధ్వంస కథనమును తన గ్రంథమున నధికముగ చేర్చుకొనవలసినవాడాయెను. ఈ కథ వలన చోడుడొక ప్రయోజనము నాశించియుండెను. ఈ కథయందు శివుడు వేద బాహ్యుడు కాడనియు, అతడే పరదైవమనియు నిరూపితము. కాళిదాసీ కథ నొకటి రెండు శ్లోకములలో సూచించి యున్నాడు.[8] చోడుడా శ్లోకములందలి భావమును గ్రహించి పెంపు జేసి రెండాశ్వాసముల గ్రంథమును రచించెనన్నను తప్పులేదు. అప్పకవి కూడ ఆంధ్రశబ్ద చింతామణి ననువదించుచు యందలి "వళిరాద్య మనన్త రాక్షరం ప్రాసః" (సంజ్ఞా 41) యను నొక్క సూత్రమును గ్రహించి యొక ఆశ్వాస (తృతీయ) గ్రంథమును పెంపుజేసెను.

కథాప్రణాళికను దృష్టిలో బెట్టుకొని చూచిన చోడుడనుసరించినది కాళిదాస కుమార సంభవమునేగాని తదన్యమును గాదని స్పష్టమగును. చోడుడు కొన్ని ప్రయోజనములను (ముఖ్యముగా మతమును) దృష్టియందుంచుకొని కాళిదాసుని కుమార సంభవమును ప్రబంధరీతిని వ్యాఖ్యాప్రాయముగా అనువదించెనని చెప్పక తప్పదు. ప్రస్తుత వ్యాసమున నీ విషయము పరిశీలింపబడుచున్నది. గ్రంథ విస్తరము గాకుండుటకై సంస్కృత కుమార సంభవము నందలి ప్రథమ సర్గకు చోడుని యనువాద పద్ధతిని విమర్శించుట సమంజసమని భావించి తద్విమర్శనా విధానము ప్రారంభింపబడుచున్నది.

కాళిదాసు ప్రథమ సర్గను హిమవద్వర్ణనతో ప్రారంభించెను (సం. కు. సం 1–1 నుండి 17). పూర్వ పీఠిక వంటి రెండాశ్వాసములను వదలి చూచినచో చోడుడును గ్రంథమును హిమవద్వర్ణన తోడనే ప్రారంభించెను. (తె. కు. సం 3–3 నుండి 18) కాళిదాసు 17 శ్లోకములను చోడుడు 16 పద్యములను రచించిరి. ఈ వర్ణన లందచట నచట (సం.కు.సం.1–13, తె.కు.సం.3-7 పద్య ముత్తర భాగము; సం.కు.సం 1–14, తె.కు.సం.3–15) దప్ప చోడుడు స్వతంత్రించెను వర్ణనాదుల యందు స్వతంత్రించుట నన్నెచోడుని స్వభావమైయున్నదని మున్నే తెలుపబడినది. అనుకరించిన పట్టులందును తన స్వతంత్రతను ప్రకటించియున్నాడు. "య తాంశు కాక్షేప..." (సం. కు. సం 1–14)యను శ్లోకము ననువదించుచు శ్లోకములోని మేఘముల స్థానమున చోడుడు ఇంద్రనీల మణులుగా వ్రాసెను రెండును యుచితములేయయ్యు మార్పునకీ క్రింది విషయము కారణము గావచ్చును. మేఘముల క్రింది నుండి వెళ్ళు వారికి కింపురుషుల రతిక్రీడలు గనిపించవచ్చును గదా యని చోడుడు ఇంద్ర నీల మణుల చీకటిని ప్రవేశ పెట్టియుండును. మేఘుడు పురుషుడు గాన కింపురుషాంగనలు వానిదాపున రతిక్రీడలు సలుపుట కొప్పుకొనరని భావించియే చోడుడు మార్పును గోరియుండును. ఇదే గ్రంథమున ఋషిపత్ను లగ్నివలన శివు వీర్యమును గొని గర్భము దాల్చు ఘట్టమున అరుంధతి వహ్ని పరపురుషుడని (తె. కు. సం.10–33) తొలగిపోయినట్లు వర్ణింపబడినది. అట్లే యిక్కడను భావించియుండును.

హిమవద్వర్ణనా నంతరము రెండు కావ్యములలోను కథ మైనాకుని పుట్టుకతో ప్రారంభమయ్యెను (సం. కు. సం 1–20, తె. కు. సం. 3–19 నుండి 21). అభ్రాతృక కన్యా వివాహము నిషిద్ధము గావున పార్వతి సభ్రాతృక యని తెలుపుటకు కాళిదాసు మైనాక జననమును వర్ణించెనని మల్లినాథసూరి తనవ్యాఖ్యానములో బేర్కొనెను. చోడుడతడు పరమేష్ఠి వరప్రసాదమున పుట్టినటుల పేర్కొనుట యధికము.

తరువాత 'అపగత పుత్రావలోకన సుఖ తత్పరులై' (తె. కు. సం. 3-21) మేనకా హిమవంతులు సతీదేవి తమ పుత్రికగా జన్మించుటకు శక్తినారాధించినటుల తెలుగులో వర్ణితము. సంస్కృతములోను మేనక యెన్నో వ్రతములు గావించినటు లున్నది గాని పుత్రికకై ప్రాకులాడినటుల లేదు. ఎంతమంది పుత్రు లుదయించినను ఇంద్రుని వజ్ర పాతమునకు భీతిల్లి యెటకో పారిపోవకతప్పదు గావున బుత్రికనుగోరి శక్తి నారాధించినటుల తెనుగులో వర్ణించుట యెంతో సమంజసము. చోడుని యీ కల్పనకు మూలము పై శ్లోకమే (సం.కు.సం 1–20). సతీదేవినే పుత్రికగా కోరుకొనుట వారి శివారాధన తత్పరతకు సూచన. సంస్కృతములో హిమవంతునికి పెక్కు సంతానమున్నట్లు వర్ణితము (సం. కు. సం. 1–27). తెనుగులో బార్వతికిముందు మైనాకుడొక్కడే యున్నట్లు వర్ణితము (తె. కు. సం. 3–20, 21).

పార్వతి జనన వర్ణన రెండింటిలోను సమానమే (సం. కు. సం. 1–24, తె.కు.సం. 3–29). కాళిదాసు 'విదూర భూమిర్నవ మేఘ శబ్దాదుద్భిన్నయా రత్న శలాక యేవ' యని శ్లోకములో నొక్క యుపమానమును బ్రయోగింపగా వేలును చూపిన చేయినే మింగువానివలె కాళిదాసుని యుపమానమును 'వర విదూర భూమి వైదూర్య ముదయించు తెఱంగు వోలె' యని తెనిగించుచు దానికి ముందు మరి నాలు గౌపమ్యములనుజేర్చి తన వర్ణనా చమత్కృతిని జాటుకొనెను.

పార్వతి బాల్య వర్ణనము తెనుగులో పెంపుజేయ బడెను. పార్వతి జనన మందిన తర్వాత 'లబ్ధోదయా చాంద్ర మసీవ రేఖా' (సం కు.సం. 1–25) అని కాళిదాసు పలుకగా దానిని 'అంతం బార్వతి శరచ్చంద్ర రేఖయుంబోలె సకల జన నయనేందీవరానంద కరంబై వెలుంగు చుం గ్రమ క్రమంబున' (తె.కు.సం. 3–31) అని యనువదించుచునే దానికిముందు హిమవంతుడు సంతోషముతో 'పుణ్యాహంబు నొనర్చుచు దీనానాథ విద్వజ్జనంబుల నపార వసుధా పారంబుల దేల్చుచు' (తె.కు.సం. 3–31) నని తాను రాజకవి గావున హిమవంతుని రాచఠీకములో తన ఠీవిని స్ఫురింపజేయునట్లు పెంపు గావించెను. చోడుడు పార్వతి బాల్య వర్ణనలో శివ పారమ్యము ను స్ఫురింపజేసెను. ఆమె తొలి పలుకులే 'ఓం నమశ్శివాయ' యను షడక్షరితో ప్రారంభమైనవట (తె కు. సం. 3–34).

శైశవ క్రీడా సమయములోను శివార్చన గావించెడిదట (తె.కు.సం. 3–36). సంస్కృతములో యీ భక్తి పారవశ్యతలేదు. కాళిదాసు 'క్రీడారసం నిర్విశతీవ బాల్యే' (సం.కు.సం. 1–29)యని వ్రాసెనే గాని శివ పారమ్యత భావింపలేదు. చోడకవికి యడుగడుగున శివ భక్తియే గోచరించుననుటకు పార్వతి బాల్య వర్ణన యందలి పద్య ముల నుదాహరణగ గొనవచ్చును. పార్వతి పుట్టిన దాదిగి యామె ప్రతి చేష్టలోను శివ పారమ్యత గనపరచుట జూడగా తాను పార్వ తిలో లీనమై పోయాడేమోనని యనిపించును. పార్వతి శైశవ క్రీడను కాళిదాసు మందాకిని సైకత వేదిక చెంత పార్వతి కందుక ములతో, కృత్రిమ పుత్రికలతో నాడుకొనినట్లు తెలిపెను. (సం.కు. సం. 1–29). చోడుడు మందాకిని సైకతములను స్పృశింపలేదు గాని కృత్రిమ పుత్రికలను చిల్క బొమ్మలనుగాను, దంతపు బొమ్మ లను గాను, మేలి గాజు బన్నరులను గాను, వ్రాని చొప్పికలనుగాను మార్చెను (తె.కు సం.3–36).

కాళిదాసు పార్వతియొక్క ప్రాక్తన జన్మవిద్య యుపదేశ కాల ములో అనగా సకాలములో ప్రారంభమయ్యెనని వర్ణించెను. (సం. కు. సం. 1–30). చోడుడట్లూరుకొనక యిందుకూడ శివభక్తి స్ఫురింపజేయుచు 'ఈశ్వరార్చన బలమున హరుడు గురుడు గాగ' (తె.కు.సం. 3–38) సకల కళా విద్యలు నేర్చినదని వర్ణించెను.

సంస్కృతములో కౌమారము ప్రత్యేకముగా వర్ణింపబడ లేదు. 'బాల్యాత్పరం' (సం.కు.సం. 1–31) అని పార్వతి యౌవ నమును బొందినట్లు వర్ణింపబడినది. వ్యాఖ్యాతయైన మల్లినాథ సూరియు 'బాల్యాశ్చైవాత్ పరమనన్తర భావి, వయో యౌవనం' అని కాళిదాసు బాల్యము తర్వాత యౌవనమును వర్ణించినటుల సూచించెను. అయితే విద్యాప్రారంభకాలము కౌమారములో నారంభ మగును గాన 1–30 శ్లోకములో కౌమారము వర్ణింపబడినదనియే భావింపవలయును. కావున చోడుడు పార్వతి విద్యాభ్యాసము కౌమా రము నందు జరిగినట్లు వర్ణించెను. (తె. కు. సం. 3–38)

పార్వతి యౌవనమునిద్దరును సమానముగా వర్ణించిరి. కాళిదాసు 17 శ్లోకములలోను, చోడుడు 37 పద్య గద్యములలోను వర్ణించిరి. దేవతలను నఖాది శిఖాంతముగా, మానవులను శిఖాది పాదాంతముగా వర్ణింప వలెనను సూక్తిక్రమము నిద్దరు ననుస రించిరి.

కాళిదాసు పార్వతిని 'కామస్య పుష్పవ్యతిరిక్త మస్త్రం' (సం. కు. సం. 1–31) అని వర్ణింపగా, చోడుడు 'మన్మథునారి నమర్ప నున్న కోమల తర పుష్ప బాణ' (తె. కు. సం 3–40) మని సవరించెను. సవరణకు కారణ మీ విధముగా భావింపవచ్చును. దేవతల పనుపు పై శివుని సమాధి భంగము గావించుట కేతెంప నున్న మన్మథునకు పార్వతి యొక యుపకరణముగాగలదు. అది యిట సూచితము. కాముని శిలీ ముఖములు ప్రశస్తమైన పంచ కుసుమములు. పార్వతి యౌవనమును బొందుచున్న సమయములో నామె కాముని శిలీ ముఖములకన్న కోమల తరమైన పుష్పమువలె నున్నది. అందువలన కాముడు తన పంచ బాణములను వదలి వేసి యీ కోమల పుష్పమును సంధించుటకు బూనుకొనెను గాబోలు. ఇట 'అమర్పనున్న' యనుటచేత నమర్చుటకు సిద్ధము చేయబడు చున్నదని స్ఫురణ. అనగా పార్వతి యప్పుడప్పుడే కౌమారమును వీడి యౌవనమునందు ప్రవేశించుచు విరిసీ విరియని సుందర తర కోమల కుసుమము వలె నున్నదని ధ్వనితము.

అట్లే కాళిదాసామె నవ యౌవనమును 'సూర్యాంశు భిర్భిన్న మివార విన్దమ్' (సం. కు. సం. 1–32) అని వికసించిన పద్మ ముతో పోల్చగా, నన్నెచోడుడామె కౌమారమునుండి యౌవనము లోనికి ప్రవేశించుటను క్రమ పద్ధతిని దెలుపుటకో యనునట్లు 'అహిమద్యుతిఁజూడఁగనున్న పద్మకుట్మల' (తె. కు. సం. 3–40) మని సవరించెను.

'నగేంద్ర - హస్తాస్త్వచి కర్కశత్వాత్' (సం. కు. సం. 1–36) అని కాళిదాసు యేనుగు తొండము కర్కశమై పదిగావున బార్వతి యూరులతో పోల్పదగదని వర్ణింపగా, చోడుడామె యూరు లను 'మదనకరికర' (తె. కు. సం. 3–48)ముతో పోల్చి కవి సమయమును గాపాడినాడు. కరికరమునందలి కర్కశత్వమును భావింపకుండుటకై 'మెఱుఁగారు పసిఁడి కంబములనఁగఁగరమొప్ప' (తె. కు. సం. 3–48)ని సవరించినాడు.

'మధ్యేన సావేదివిలగ్న మధ్యా' (సం. కు. సం. 1–39) యను శ్లోకమునందలి భావమున కలరి చోడుడు వ్యాఖ్యాప్రాయ ముగా శ్లోకమునందలి రెండు పాదములకు రెండు పద్యములను రచించెను. (తె. కు. సం. 3–51,53)'కార్తస్వరసోపానముల'ను తెనుగుపమానముకన్న 'కామస్యసోపాన మివ'యను సంస్కృతోప మానమే యందముగా నున్నది. చోడుడు సదా మార్పుకోరు వాడగుటచే సంస్కృతోపమాన మందలి యంద చందములను విస్మరించినాడు గాబోలు.

''అన్యోన్యముత్పీడయదుత్పలాక్ష్యాః'' (సం. కు. సం. 1–40)యను శ్లోక భావమునకు చోడుడు 'ఆంధ్రీస్తనాపహాసుల' (తె. కు. సం. 3–54) అను దానిని చేర్చి అనువదించెను. ఈ మాట చేర్చుట యాతని యాంధ్రాభిమానమును స్పష్టీకరించుటకే యని వేరుగా చెప్పనవసరములేదు.

'శిరీష పుష్పాధిక సౌకు మార్యౌ' (సం. కు. సం. 1–41) యను శ్లోకములో 'హరస్యయౌ కణ్ఠపాశౌ మకర ధ్వజేన'యను భావము బాగుంది గాని 'పరాజితేనాపి' యని రాబోవు కథను వాచ్యము చేయుట బాగుగలేదు. ఇది యూహించియే గాబోలు చోడుడు 'శివునంగ యష్టినిఱియగ నవిరళముగఁబట్టి ప్రౌఁక' (తె. కు. సం. 3–56)నని మార్చెను. 'శిరీషపుష్పాధిక సౌకు మార్యౌ'యను మాటకు 'నవకల్పలతికల పవిదిని'యని వ్రాసెను. బాహువులను లతలతో పోల్చుట కవి సమయము.

'కణ్ఠస్య తస్యాస్స్తన బన్ధురస్సముక్తా' (సం. కు. సం. 1–42) యను శ్లోకములోని భూషణ భూష్య భావమును వదలి

వేసి చోడుడు కంఠమునకు 'ఆననమను నాదర్శంబు పిడియొ, పోక బోదియో' యని రెండుపమానములను వేసెను (తె. కు. సం. 3-60). 'కంబు కంధరమొప్ప' నను నుపమాన పూర్వపద కర్మ ధారయ సమాసమును వాడుటచేత మొత్తము మూడుపమానములు ప్రయోగించి నటులైనది.

'చంద్రంగతా పద్మ గుణాన్నభుజ్తే' (సం కు.సం.1-43) యను శ్లోకమును 'అమృతోద్భవులగు మీలో' (తె.కు.సం.3 61) యను పద్యములో దాదాపుగ చోడుడనువదించెను.

'పుష్పమ్ ప్రవాళోపహితం యది' (సం కు.సం. 1-44) యను శ్లోకములోని ఎవడ సామ్యమును దప్ప 'మానిత మగు గుడ రసమున మానిన' (తె. కు. సం.3 62) యను పద్యములో తెనుగు కవి స్వతంత్రించెను.

'తస్యాశ్శలాకాంజన నిర్మితేవ' (సం. కు. సం. 1-47) యను శ్లోకములోని చతురామనఙ్గః స్వచాప సౌందర్యమద'మను దానిని గ్రహించి, 'గాముదనుః ఖండభాతిఁ'యని వ్రాసి మిగిలిన బద్యమునందు స్వతంత్రత వహించెను. (తె. కు. సం. 3-68).

'లజ్జాతిరశ్చాం యది చేతసిస్యాత్' (సం. కు. సం.1-48) యను శ్లోక భావమును గ్రహించి యితరోపమానములతో చోడుడు రెండు పాదములకు రెండు పద్యములను రచించెను. (తె. కు. సం, 3-70, 71). ఇది కాళిదాసు శ్లోకమునకు వ్యాఖ్యానమే.

పార్వతి యౌవన వర్ణన సమాప్తిలో నిరువురును రెండు బద్యములను వ్రాసిరి కాళిదాసు 'సర్వోపమాద్రవ్య సముచ్చయేన' (సం. కు. సం. 1-49) యని మాత్రమే వ్రాసి యా యుపమా ద్రవ్యముల నూహించుట పాఠకులకే వదలివేసెను. చోడుడు కాళి దాసు గ్రంథమునకు వ్యాఖ్య వ్రాయువానివలె యా యుపమా ద్రవ్య ముల నన్నిటి నేకరువు బెట్టెను (తె. కు. సం 3-78). ఇట్లు చోడుడు కాళిదాసు శ్లోకభావములను వదలక తనకు నచ్చిన చోటుల ననుకరించుచు నచ్చని తావుల వదలివేయుచు బాగా యని పించిన పట్టుల వ్యాఖ్య చేయుచు స్వాతంత్ర్యమును వీడక రచన సాగించినటుల యొక్క యీ పార్వతి యౌవన వర్ణనను బట్టియే యూహింప నైనప్పుడు తదితర గ్రంథములో నెటులనుకరించెనో వేరుగా జెప్పబనిలేదు

పార్వతి యౌవన వర్ణనానంతరము నారదుడు హిమవంతు వింటి కేతెంచుట రెండు గ్రంథములలోను సమానమే. సంస్కృత ములో నారదాగమనము శ్లోకములో నర్ధభాగము రచింపబడగా (సం. కు. సం 1-50), తెనుగులోనిది మూడు గద్య పద్యములకు పెరిగినది (తె. కు. సం. 3-81 మండి83) నారద వర్ణన యింద ధికము. సంస్కృతములో నారదుని రాక కాకతాళీయము. పితుస్సమీ పమునందున్న పార్వతిని జూచి నారదుడామె పరమేశ్వరు నర్ధశరీరము వాక్రమించునని తెలిపెను. తెనుగులో పార్వతి యౌవనవతియైన పిదప హిమవంతుడామె కింద్రాది సురలలో వరుడెవ్వడగునో (తె.కు. సం. 3-80) కదా యని డోలాయమాన మానసుండగుచున్న (తె.కు.సం. 3-81) సమయమున నాతని మనోగతాభిప్రాయమును గ్రహించి పరిష్కార మార్గమును సూచించువాడువోలె నారదు డేతెంచెను. నారదు డభ్యర్చితుడైన పిదప హిమవంతునికి 'హితోప దేశంబు సేయందలంచి శివశక్తి భేదంబులు దెలిపి . ' (తె కు.సం. 3-83) యామె పరమేశ్వరున కగ్రమహిషి యగునని దెలిపెను. దీనివలన తెనుగులో నారదుడు కేవలము శివశక్తుల పునస్సమా గమమునకు బీజము వేయుట కేతెంచినటుల తెల్లము. శ్లోకములో సవతులులేని కాపురమని యుండగా తెనుగులో 'అగ్రమహిషి' యగు నని తెలుపబడినది.

ఈశ్వరుడడుగనిదే తానే యిచ్చెదనన్నచో నంగీకరింపడేమో యని హిమవంతు డూరకున్నట్లు మూలములో తెలుపబడినది (సం. కు. సం. 1-52). చోడుడీ విషయమును దడవక 'నిజ తనయఁ గులదైవముకాఁ గొనియాడుచుండె' (తె. కు. సం. 3-85) నని వ్రాసెను.

శివుడు హిమగిరికి తపస్సునకై యేతెంచుట రెండింటిలోను వర్ణింపబడినది. శివుడు విముక్తసంగుడై హిమగిరి కేతెంచినటుల కాళిదాసు వర్ణించెను. అతని విముక్త సంగతకు కారణమును గూడ చక్కగా వివరించెను. (సం. కు. సం. 1-53) చోడుడు కాళి దాసు భావమును జక్కగా మదిలో నుంచుకొని దానిని విడమర్చి జెప్పవాడన్నట్లు వియోగాగ్ని జల్లార్చుకొనుటకు శివుడు హిమవంత

మునకేతెంచినట్లు వర్ణించెను (తె. కు. సం 3–87). చోడుడిట్లు వర్ణించుట యెంతో సుందరము. ఇట పూర్వ విషయము స్మరింప దగును. మేనకా హిమవంతులు సతీదేవిని బుత్రికగా గోరి యారాధించిన సమయములో దాక్షాయణి 'నిజదేహ విదాహకరంబైన కోపానలంబునకుం బరమేశ్వర వియోగానలంబునకు శిశిరోపచారంబు సేయం దలంచినదియుం బోలె' (తె.కు.సం. 3–23) వారి కోరిక దీర్చుటకు నంగీకరించినది. తన కోపానలమునకు, బరమేశ్వరుని వియోగానలమునకు శిశిరోపచారము గావింపగలవాడు హిమవంతుడొక్కడేయని యెరిగినది గావున యతనికి బుత్రికయై సతీదేవి జన్మించినది. హిమవంతుడు పరమభక్త వరాగ్రగణ్యుడు. భగవంతునకు భక్తుని యింటనుండుటకన్న ప్రీతిపాత్రమేద్ది? పరమేశ్వరుని వియోగాగ్ని చల్లారుటకు గిరిజయైన సతీదేవి యట గలదు. అనగా పురాణ దంపతుల బునస్సమాగమమీ విధముగా బీజరూపముగా నారంభమగుటను చోడుడిట ధ్వనితము గావించెనన నొప్పును.

శివుడు గంగాప్రవాహము చెంత తపస్సునకై స్థల నిర్దేశము గావించుకొని నటుల కాళిదాసు వర్ణించెను (సం. కు. సం1–54). చోడుడిట కాళిదాసును పూర్తిగా ననుకరిస్తూ విపులముగ నొక సీస పద్యములో స్థలౌచిత్యమును వివరించెను (తె. కు. సం. 3–89).

పరమేశ్వరుడు తపస్సు గావించు కొనుటకు నేయే సాధనములను గొనినాడో యొక్క శ్లోకములో (సం. కు. సం. 1–57) మూలములో వర్ణింపబడగా చోడుడు దాని నైదు పద్యములలో వర్ణించెను (తె. కు. సం. 3–91 నుండి 95). ఇందలి మూడు పద్యములు చోడుని యాధ్యాత్మిక భావమును, శైవాచార ప్రకారమును వ్యక్తపరచుచున్నవి. తపస్సునకు నగ్ని, సమిధలను సాధనములుగా కాళిదాసు తెలుపగా, లౌకికములైన యంశములందు దృష్టిని బోనీయక 'నిరతిశయ సమాధి నిష్ఠ' (తె. కు. సం. 3–93) విధానము నెరుక పరచెను. ఇది యాధ్యాత్మిక పద్ధతి. కాళిదాసు శివుని ధ్యానముద్రను తృతీయ సర్గలో రచించెను. ఇది యట సాకల్యముగా పరామర్శింపబడును. కాళిదాసిట 'కేనాపి కామేన' యని యేదో కోరికతో తపస్సు గావించినట్లు వర్ణించినాడు. కాని భగవంతునకే కోరికయుండును? అందుచేత 'భక్తులు దనుఁ బ్రీతిఁ జేరవచ్చు తెరువుఁదాఁదీర్చి జూపెడు తెఱఁగువోలె' (తె. కు. సం. 3-95) తపస్సు గావించినటుల చోడుడు సమర్థించెను.

తపస్సు గావించుచున్న బరమేశ్వరుని సేవించుటకు హిమవంతు డేతెంచుట నిద్దరును వర్ణించిరి. సంస్కృతములో సఖీ సమేతయైన తనూజతో హిమవంతు డీశుని సేవించుట కేతెంచినట్లు కాళిదాసు వర్ణింపగా (సం. కు. సం 1–58), తెనుగులో 'వాజి వరూధదంతి సామంత విలాసినీ స్వజన మంత్రి పురోహిత భృత్యయుక్తుడై' (తె. కు. సం 3 96), 'నిజాశేషకుల కళత్ర పుత్రీ సమేతుండై' (తె. కు. సం 3-97), జనుదెంచినటుల చోడుడు వ్రాసెను. హిమవంతుడిట్లేతెంచుట పరమేశ్వరుని తపోభంగమునకు సరససాధన మగునని యొక విమర్శకుడు భావించెను.[9] గురువునకుగాని, యీశ్వరునకుగాని సమస్తమును సమర్పించుకొనుట శైవ పద్ధతి. కృత్యాదిలో చోడుడు రచించిన 'శరదనీరులు పయోధరము'లను పద్యము (తె. కు. సం 1–49) నిట స్మరింపనగును. హిమవంతుడు చోడునివలె రాజు. రాజు కావున సైన్య సమేతుడై వచ్చి 'నిజదేహాది సమస్త రాజ్య విభవంబులు నీశ్వరు శ్రీపాదంబులకు నివేదించి' (తె కు. సం 3–97) నాడు. హిమవంతుడు విముక్తసంగుడై యట్లు తన భక్తిని ప్రదర్శించుకొనుటచేత నీశ్వరుడాతని భక్తికిమెచ్చి 'కేదారేశ్వరుడై' (తె. కు. సం 3-101) యతని పురమున వసించుటకు నిర్ణయించుకొని వరమిచ్చెను. చోడుని యీ మతదృష్టిపరమైన ప్రయోజనమును గ్రహింపక విమర్శకుడు పొరపడియుండును. చోడుడు సర్వసైన్య సమేతుడై యేతెంచుటచే శివుని యేకాంతతకు భంగము వాటిల్లునని విమర్శకుడు భ్రమపడెను. ఏకాంతతకు భంగము యొక్కరు వచ్చినను గలుగును, పదిమంది వచ్చినను గలుగును. కాని శివుడు సమాధి నిమగ్నుడై యున్నప్పుడతని యేకాగ్రత నెవ్వరును భంగపరచలేరు. నందీశ్వరుని యనుజ్ఞ లేక పశు పక్ష్యాదులు కూడ సవ్వడి చేయుటకు వీలులేదు. ఈ విషయమును కాళిదాసు తృతీయ సర్గలోను (చూ. శ్లో.41, 42), చోడుడు పంచమాశ్వాసములోను (చూ. ప. 7 నుండి 9) వివరించిరి. నందీశ్వరుడు ద్వారపాలకుడుగ నుండగా నీశుని యేకాంతత కెట్టి పరిస్థితులలోను భంగము వాటిల్లదు. కావున విమర్శకుడు పాక్షిక దృష్టిచే చోడుని దుయ్యబట్టెనని యొప్పుకొనక తప్పదు.

సఖీ సమేతయైన పార్వతి సపర్యకై నియమింపబడినట్లు సంస్కృతములోను, 'అనేక మాణిక్యాకల్పాలేపాంబరాలంకృతంబైన కన్యాంతఃపురంబుతోన' (తె. కు. సం. 3–103) పార్వతి నియమింపబడినట్లు తెనుగులోను రచితము. చోడుడామె సఖీ జనమును 'పొలుపుగఁ జంద్రశేఖరు తపోవన మంగజ చక్రవర్తి దోర్బలమున ముట్టి చూరగొనఁ బంచిన దండొకొ నాఁగఁ బొల్చి కన్యలు దనుఁ గొల్చిరా' (తె. కు. సం. 3–107) యని వర్ణించెను. దీనివలన భావిలో భావజుడు దేవతల పనుపుపై శివుని తపోభంగమున కేతెంపనున్నాడను విషయము సూచితము. విశ్వనాథవారి మాటలలో జెప్పవలెననిన యిదియొక మహాశిల్పము. ఇట్టి శిల్ప చమత్కారములు చోడుని గ్రంథములో కోకొల్లలు.

తపస్సమయమున స్త్రీ సమక్షము వికారహేతువైనను చిత్తచాంచల్యము లేకపోవుట ధీరలక్షణమనియు, శివుడట్టి ధీరుడు గావుననే యామె సపర్యకు నొప్పుకొనెననియు కాళిదాసు వర్ణించెను (సం.కు.సం. 1–59). చోడుడిట యేమియు చెప్పక 'అతని విన్నపమున నంతకు భక్తవత్సలుఁడు నెమ్మనమున సమ్మతించి' (తె. కు. సం. 3–102), 'అదత్త ప్రతి వచనుండైన దానికి మహా ప్రసాదంబని' (తె.కు.సం. 3–103) హిమవంతుడు పార్వతిని సపర్యకు నియమించినటుల వ్రాసెను. కాని యీ వాక్యమును దృష్టియందిడుకొని చతుర్థాశ్వాసాదిలో తన భావమును వ్యక్తీకరించెను (తె. కు.సం.4–3). ఉత్తములు విపరీత చరితులైనను సమర్థనీయమే

ననియు వికారములు వారి దరి జేరవనియు కావున పార్వతి సపర్య నాయన దపస్సాధనముగ జరించినను విపరీతము గాదనియు చోడుడు కాళిదాసు భావమును తన మాటలలో వివరించెను.

'అపచిత బలి పుష్పావేది సమ్మార్గ దక్షా' (సం. కు. సం 1–60) యను మూల శ్లోకమును చోడుడు స్వేచ్ఛగా ననువదించెను (తె. కు. సం. 3–106). తెనుగులో నొక తాపసి ఇల్లు స్ఫురింపజేయబడెను. అది హిమగిరిగావున యట లభించు కస్తూరి చేతను, ముక్తాఫలముల చేతను, కుసుమ పల్లవ లతా కోరకముల చేతను పార్వతి వేదిక నలంకరించెను. తాను రాజకుమారి గావున మణి కలశములచేత గంగాంబువులను నించి పెట్టెను.

దీనితో కాళిదాసుని కుమార సంభవములో ప్రథమ సర్గ సమాప్తము. తెనుగులోను మూడవ యాశ్వాసము పూర్తి. కీ. శే. లక్ష్మీపతి శాస్త్రిగారు తెలిపినటుల యిది కాళిదాసు కుమార సంభవమునకు స్వేచ్ఛగా గావింపబడిన పరివర్తనము.[10] చోడు డిద్దానిని స్వతంత్ర ప్రబంధరీతిని నిబంధించుటయేగాక శైవాగమ పద్ధతిని నిబంధించుచు కాళిదాసీయమునకు వ్యాఖ్యాప్రాయముగా తన ప్రబంధమును గూర్చెను. కావున నన్నెచోడుని కుమార సంభవము కాళిదాస కృత కుమార సంభవమునకు పరివర్తనమేగాని యే యుద్భటుని కుమార సంభవమున కనువాదమో లేక స్వతంత్ర కావ్యమో యనజెల్లదు. ఈ విషయమును క్రీ. శ. 1937లోనే కీ. శే. లక్ష్మీపతి శాస్త్రిగారు నిరూపించియున్నారు.[11] ఈ వ్యాసము నందింకను లోతునకు వెళ్ళి వారి వాదన సమర్థింపబడినదే గాని క్రొత్త ప్రతిపాదన గాదు. పోలిక పద్యములను వివరించుటపట్ల వీలైనంత వరకు శాస్త్రిగారు తెలుపని యంశముల పైననే దృష్టి కేంద్రీకరించడమైనది. పొరపాటున వారి భావములున్ను దొరలియుండవచ్చును. పెద్దలు మన్నింతురుగాక.

ప్రస్తుత వ్యాసమున గ్రంథ విస్తర భీతిని కాళిదాసు కుమార సంభవములోని ప్రథమ సర్గకు మాత్రమే నన్నెచోడుని పరివర్తన విధానము పరిశీలింపబడినది. ఒక్క సర్గనే కించిత్తు విడువక అనువదించినాడన యితర సర్గలను కూడ నిట్లే యనువదించి యుండునని విజ్ఞులు భావింపగలరు. అన్నమంతా యుడికినదని రెండు మెతుకులు బట్టుకొని వ్యవహారములో గనుగొనునట్లే యిచటను పండితులు భావింతురని యాశయము. అయినను ముమ్ముందు తదితర సర్గలకును చోడుని యనువాదవిధానము శక్తివంచనలేక పరామర్శింపబడును.

ఈ కావ్యమును కాళిదాసు కుమార సంభవముతో గలిపి యచ్చు వేయించుట యుచితము. సంస్కృత కుమార సంభవమునకు మహా శివ పురాణముతో కలిపి యట్టి ముద్రణ యొకటి గలదు.[12] అది క్రీ. శ. 1955 నాటికే 14 ముద్రణల నందినది. కావున సాహిత్య అకాడమీవారుగాని, తదితర సాహితీ సంస్థలుగాని యిట్టి ముద్రణకు బూను కొని సాహితీ సేవ గావించుట యత్యావశ్యకము.

# అధోజ్ఞాపికలు

1 ''అధర్వణ భారతము తిక్కన భారతముతో సరిపోల్పదగినది కాకున్నను నన్నయ కవిత్వము కంటె రసవంతముగా నుండును'' ''నన్నయ భట్టారకుఁడు వయసు మీఱిన వాఁడగుటచే సందర్భ శుద్ధిని బాటింపఁడయ్యె'' ''నన్నయ భట్టారకుని భాషాంతరీకరణ మెంత మాత్రము తృప్తికరముగా లేదు'' ఇత్యాది. చూ: ఆంధ్రభాషనుగూర్చిన యుపన్యాసము–మానవల్లి కవి–రచనలు.

2 ''ఈ కుమార సంభవము కాళిదాసు కావ్యమునకుఁ దెనుఁగు గాదు.'' కుమార సంభవము– ప్రథమ భాగము పే. 2 – మానవల్లికవి–రచనలు.

3 నన్నె చోడదేవ కుమార సంభవ విమర్శనము–కీ.శే. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు పే. 121–122.

4 Ibid పే. 45–75.

5 అనువాద పద్ధతులను గూర్చి దివాకర్లవారి సిద్ధాంత గ్రంథమునుచూడనగును. (ఆంధ్రవాఙ్మయారంభదశ పే. 522)

6 నన్నె చోడదేవ కుమార సంభవ విమర్శనము పే. 57.

7 (తెనుగు) కుమార సంభవము 1–44, 45.

8 (సంస్కృత) కుమార సంభవము 1- 21, 53.

9 ''... యేకాంత వాసి యొద్దకు ఉచ్చైః శిరస్కుఁడైన గిరి రాజు దండయాత్రకు వెడలినట్లు ఇంత దండుతో వెళ్ళుట యిప్పు డుచితముగాఁ దోచదు. సర్వసంగ పరిత్యాగియైన 'సమస్త రాజ్య విభవ సమర్పణము' ఎందులకు ? ఈ విలాసినీ జనము అతని తపోభంగమునకు చక్కని సరస సాధనము కాదా ? ఈ యసందర్భములలోనే యొక్క టి యు సంస్కృతమునఁగాన రాదు.'' – శ్రీకాళిదాస నన్నె చోడ కవులు – తత్కుమార సంభవములు – విద్వాన్ ఖండవిల్లి సత్యనారాయణశాస్త్రి – ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక – సంపుటము 54, సంచిక 6.

10 నన్నెచోడ దేవ కుమార సంభవ విమర్శనము పే. 57.

11 Ibid ద్వితీయ ప్రకరణము పే· 45–79.

12 కుమారసంభవ్–నిర్ణయసాగర్ ప్రెస్, బొంబాయి, 1955.



# జ్ఞాన రేఖ

జీవితోద్గమం ఓ బిందువై
  అనుభవాల పాయలను కలుపుకుని కలుపుకుని
నదులన్నీ సాగరంలో కలిసి ఏకాకారమైనట్టు
ఓ మహానుభూతి చైత్యచిత్రమై చివరకు మిగిలింది –
ఈ భూమిలో వేల ఏండ్లనుంచి నిద్రిస్తున్న చరిత్ర
నాకు మళ్ళీ
ఈ హిమనగసానువుల మౌనప్రవచనంలో
ఈ నిర్మల తోయతల హాసరేఖల్లో
ఈ విరామంలో ప్రమగ్నతున్న ఆరామ సంచయాల్లో
మళ్ళీ హరివిల్లులా వికసిస్తున్న చెమట బిందువుల రత్నాలమాలల్లో
దర్శనమిస్తోంది నడచివస్తూ, నర్తిస్తూ –
ఒట్టి ఎండిన ఆకులపై
ఎంత సంపదను నిక్షిప్తం చేసిపోయారో
అక్షరాల ఖజానాల్లో –
తీగలను మీటుతున్నకొద్దీ రాగాలు పక్షుల్లా ఎగిరినట్టు
నా దేశపు ప్రాంతాలను నే ననుభవిస్తున్నకొద్దీ
జ్ఞాన సముద్రమే నాలోకి ప్రవహిస్తూంటుంది ఊపిరై
ఋతువులకు ఋతువులనే పొందిన ఈ అరణ్యాలను, మైదానాలను చూస్తూ
చూపులను ఋషిలాంటి ఆకాశంలోకి వదులుతాను
వెలుగు నిశ్శబ్ద గర్జనలతో హృదయం నిండా నిండుతుంది
యిప్పుడు
ఆకులను రాలుస్తున్న చెట్లను చూచి నాలో నిరాశ ఉద్యమించదు
వాటి కొమ్మల్లో
రేపు ప్రవహించబోయే హేమంత, వసంత స్వప్నాలతో
ఓ సంపూర్ణ జగత్ చిత్రం ప్రకాశిస్తుంది మహోజ్జ్వలమై !

# పడవను దోచుకుపోయే ప్రవాహాలు

యీ తోటలో పక్షులు గొంతులతో రాగాలను వర్షించి
      ఎక్కడికి ఎగిరిపోయాయో...,
వసంతచ్ఛాయలో కూర్చుని మనసును విప్పగానే
గాలి నిశ్శబ్ద 'గీతా' గానంతో ఆత్మను అపహరించుకుపోతుంది
ప్రవాహాలు పడవను దోచుకుపోతున్నట్టు –

క్రోటన్ ఆకులపై మచ్చలు ఎంత అందాన్నిస్తాయో
జీవితంలో కష్టాలు మనిషికి పూర్ణత్వాన్నిచ్చినట్టు
వర్షం నీరు గులాబీరేకులపైనుంచి జారుతున్నప్పుడు
గుండెల్లో ఆ దృశ్యం ఎంత క్షుభితమై తన్నుకుంటుందో
జీవిని పిండుతూండే
ప్రచలితాత్మ కాంతిబిందువై ఓ స్వర్గంలోకి జారిపోతున్నట్టు –
ఓ ఎడబాటు గొంతులో ఎడారిలా ...
భావాలు యోగాసనాలు వేసుకుని ఉంగలు చుట్టుకుంటున్నాయి
"The integrated point delivers the world –"...ఓహ్
ఓ సుందర భావశరం బురదమెదడులోంచి విరజిమ్మగానే
పొగగొట్టంలోంచి పావురం చొచ్చుకొచ్చినంత చిత్రంగా
మళ్ళీ నీడల మచ్చలపైనుంచి ఒకటే నడక...నడక ...
అన్నీ శకలాలే –
భావాలు...బ్రతుకులు...మేఘాలు...భూపేలికలు...సముద్రాలు...కవితావాక్యాలు
ఏవైనా ముక్కలుగా తెగిపడిన అపరిపూర్ణ పూర్ణాలే
అరికాలులో ఏదో గుచ్చుకోగానే
గుండెకదేం రోగమో,... మొత్తుకుంటుంది నరాల గొంతులతో
ఒక్క భూమిపైనే నీవు ఏడుస్తూంటే–నేను నవ్వుతాను మనసుతో
యిరుకు...యిరుకు...యిరుకు
యిరుకు సందిలో నేను ఎంత "పెద్ద"గా అనిపించాను
యిప్పుడీ మైదానంలోకి పరుగెత్తుకురాగానే
యీ 'సువిశాల వైశాల్యంలో నేనో బిందువునై
"...జీవితం తప్పకుండా తెగిపోయే ఓ రాగం..."
విషాదమో, ప్రమోదమో రాగం గుండెలో నిక్షిప్తమై ఉన్నంతసేపూ
నేను లక్షల నక్షత్రాలను మోస్తున్న ఆకాశంలా ఎంత పరిపూర్ణుడ్నో!

శ్రీ రామచంద్రమౌళి



శ్రీ కె. రామమోహనరావు

# "విష్ణుకుండినులు ఇక్ష్వాకుల అనుయాయులా?"

ఏదయినా పాతబడిపోయిన విషయాన్ని చెప్పాలంటే "ఇక్ష్వాకుల కాలం నాటిదని" చెప్పటం తెలుగునాట పరిపాటి. శాతవాహనుల పరిపాలన అంతరించిన తరువాత ప్రాచీనాంధ్ర దేశాన్ని పాలించిన రాజవంశాలలో ఇక్ష్వాకులు ఒకరు. వీరి పూర్వీకులు రామాయణ కాలంనాటి ఇక్ష్వాకులేనని కొందరి అభిప్రాయం. ఉత్తరహిందూ దేశంలోని అయోధ్యకు చెందిన ఇక్ష్వాకులకు కృష్ణాలోయలోని నాగార్జునకొండ ప్రాంతాన్ని పాలించిన ఇక్ష్వాకులకు ఏవిధమైన సంబంధము ఉన్నట్లు కనపడదు. ఈ సందర్భంలో కాల్డ్వెల్[1] అభిప్రాయాన్ని గమనించటం అవసరం.

"దక్షిణ భారతదేశానికి వలస వచ్చిన ఆర్యులలో క్షత్రియ సైనికులకంటె, వైదిక మతగురువులు, శిక్షకులు, ఉండి ఉండవచ్చు. ద్రావిడులయిన పాండ్య, చోళ, కళింగ మొదలయిన రాజులు మొదట నాయకులుగానుండి, వారి గురువులచేత ప్రభావితులై, ఆర్యుల అభిరుచులను, వైభవములను అలవరచుకొని, సూర్య చంద్ర, అగ్నికుల వంశపు రాజులను అనుకరించిరి."

"అంతమాత్రంచేత విజయపురిని పాలించిన ఇక్ష్వాకులు ఉత్తర భారతంనుంచి వలస వచ్చిన వారని కాని, హిందూమతాన్ని స్వీకరించి గౌరవనీయమైన రాజవంశీయుల నామాన్ని పెట్టుకొన్న ఆదిమవాసుల వంశమని కాని నిర్ణయించటానికి వీలులేదని" అంటూనే వీరు ఉత్తర హిందూదేశంనుంచి వలస వచ్చిన ఆర్యులు కారని చెప్పటానికి కూడ వీలులేదని డి. సి సర్కార్[2] అభిప్రాయం వెలుబుచ్చారు. "ఇక్ష్వాకు" అనే సంస్కృత శబ్దానికి "గుమ్మడికాయ" అనే అర్థమున్నదని కూడ సర్కార్ ఉదహరించారు.

ఆంధ్రదేశాన్ని పరిపాలించిన ఇక్ష్వాకులనే శ్రీ పర్వతీయులని,[3] ఆంధ్రభృత్యులని[4] పేర్కొనటం జరిగింది.

ఆంధ్రాణామ్ సంస్థితే రాజ్యేతేషామ్ భృత్యాన్వయాన్నృపాః
సప్తైవాంధ్రా భవిష్యన్తి దశాభీరాస్తతానృపాః।
ఆంధ్రాః శ్రీపర్వతీయాశ్చతే ద్విపంచాశతమ్ సమాః
సప్తషష్ఠిస్తు వర్షాణి దశాభీరాస్తథైవచ।

అనే పురాణ శ్లోకాలను ఇందుకు సాక్ష్యాధారాలుగా ఉదహరించినారు. జగ్గయ్యపేట, నాగార్జునకొండ, గురజాలలో లభించిన శాసనములవలన ఈ రాజవంశమువారి ఉనికి తెలియుచున్నది. ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురావస్తుశాఖవారిచే గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా కేసానపల్లి గ్రామంలో కనుగొనబడిన శాసనము వలన కూడ ఇక్ష్వాకులకు సంబంధించిన కొన్ని క్రొత్త విషయాలు తెలిసినవి. మొదటి మూడు శాసనములలో[5] మాఢరిపుత్ర, శ్రీ వీర పురుషదత్త అను రాజుల పేర్లును, నాలుగవదయిన కేసానపల్లి శాసనములో[6] సిరిశాంత మూల అను రాజు పేరును పేర్కొనబడినవి. వాసిష్ఠిపుత్ర శాంతమూలుని పదమూడవ రాజ్యపాలనా కాలమయిన హేమంత ప్రథమపక్షము ప్రథమ దివసమున గుణబుద్ధి అనువాని కుమారుడు, హనిగ అనునామె, మరి కొంతమంది వర్తక సమూహాము (వీరిలో మహాచనిద, చుల అనువారు కూడ కలరు.) నడిగరి అను వ్యాపార కేంద్రమువద్ద కలసి తమ తెగ ఐకమత్యము కొరకు బహుసుతియయొక్క మూలవాసి విహారమునకు చెందిన మహాచైత్యమువద్ద బుద్ధుని కంబమును నిర్మించినట్లు పై శాసనమున చెప్పబడినది. శాంతమూలుని పేరు అతని కుమారుడైన శ్రీ వీర పురుషదత్తుని నాగార్జునకొండ మొదలయిన శాసనముల వలనకూడ తెలియుచున్నది.

శాంతమూలుడు "మహారాజస విరూపాక్షపతి మహాసేన పరిగ హితస హిరణకోటి గోశత సహస హలశత సహసదయిస నవతేసు అపతి హత సఙ్కపస వాసతి పుతస ఇక్షకుస సిరిశంత మూలస" అని అభివర్ణింపబడినాడు. ఈ వాసిష్ఠీపుత్ర శ్రీ శాంత మూలుడే ఇక్ష్వాకుల మూలపురుషుడు.

శాతవాహనుల సామ్రాజ్యము పతనమయిన తరువాత వారి సామంతులు స్వాతంత్ర్యము ప్రకటించుకొని చిన్న చిన్న స్వతంత్ర రాజ్యముల నేర్పరచుకొనిరి. శాతవాహనుల అనంతరము కృష్ణా, గుంటూరు ప్రాంతములను ఇక్ష్వాకులు[7] పరిపాలించారు. వీరి పూర్వులు శాతవాహన రాజుల కింద "మహాతలవరులు"గా నుండిరి. శాతవాహన సామ్రాజ్యపు దక్షిణ ప్రాంతమున మహారథి చుటుల వలెను, పశ్చిమాన అభీరులవలెను, శాంతమూలుడు కూడ తన రాజ్యాన్ని స్థాపించాడు. శ్రీ శాంతమూలుడు అగ్నిష్టోమ, అగ్నిహోత్ర, అశ్వమేధ, వాజపేయ, మొదలయిన క్రతువులు చేసినట్లు చెప్పబడినాడు. 'వాజపేయ' అనే క్రతువు సింహాసనాన్ని అధిష్ఠించ డానికిముందు జరిపి తరువాత సామ్రాట్‌గాను, చక్రవర్తిగాను






గుర్తింపబడతారు. ప్రాచీన దక్షిణ భారతంలోని రాజులలో వాజపేయ క్రతువు జరిపినవారు ముగ్గురే కనపడతారు. వీరు, శాతవాహనులలో మొదటి శ్రీ శాతకర్ణి, పల్లవ శివస్కందవర్మ, ఇక్ష్వాకులలో శ్రీ శాంతమూలుడు. దీనినిబట్టి శ్రీ శాంతమూలుడు ఎంతటి శక్తిమంతుడైన రాజో తెలియుచున్నది.

శాంతమూలుని తరువాత అతని కుమారుడు శ్రీ మాఢవీపుత్ర శ్రీ వీర పురుషదత్త రాజ్యానికి వచ్చాడు. ఆతని పరిపాలనా కాలంలో కృష్ణాలోయ ప్రాంతంలో బౌద్ధమతము ఉచ్ఛస్థితి నందుకున్నది. శాతవాహనుల వలెనే ఇక్ష్వాకులు కూడా ఉజ్జయినీ పాలకులయిన శకవంశపు రాజులలో వైవాహిక సంబంధాలు కలిగి ఉండేవారు. ప్రాచీన మైసూరు ప్రాంతాన్ని పాలించిన కేకయ వంశజులతో కూడ అట్టి సంబంధం కలిగి ఉండేవారని డూబ్రియెల్ [8] పేర్కొనినాడు.

శ్రీ వీరపురుషదత్త పశ్చిమ క్షాత్రప రాజయిన మొదటి రుద్రసేనుని కూమార్తె మహాదేవి రుద్ర ధార భట్టారికను వివాహం చేసుకున్నాడు. వీర పురుషదత్తకు వాసిష్ఠీ భట్టి దేవకు కలిగిన కుమారుడు ఎహువుల శాంతమూలుడు. శ్రీ శాంతమూలుని తోబుట్టువులలో ఒకతె అయిన కాంతిసిరినిక కుమార్తె వాసిష్ఠీభట్టిదేవ. ఆ విధంగా మనకు తెలిసిన ఇక్ష్వాకు రాజులు శాంతమూల, శ్రీవీర పురుషదత్త, రెండవ ఎహువుల శాంతమూల, రుద్రపురుషదత్త [9] అను నలుగురే. ఈ వంశములో చివరివాడయిన రుద్రపురుషదత్త కాలంలో పల్లవ రాజయిన మొదటి సింహవర్మ ఇక్ష్వాకుల రాజ్యం మీద దాడిచేసి, ఓడించి, వారి భూభాగాన్ని తన రాజ్యంలో కలుపుకున్నాడు. ఈతనికిచెందిన ప్రాకృత శాసనం ఒకటి పల్నాటితాలూకా మంచి కల్లులో 4వ శతాబ్దానికి చెందిన బ్రహ్మీ లిపిలో లభించినది. [10] ఈ శాసనంలో తన రాజ్యంలోని భాగాన్ని పల్లవులు ఆక్రమించు కోవటాన్ని ప్రస్తావించబడింది.

వీరి రాజ్య పరిపాలనా కాలాన్ని గురించి చరిత్రకారులలో భిన్నాభిప్రాయాలున్నాయి. మత్స్య పురాణంలో వీరు పరిపాలించిన కాలం ''ద్విపంచా శతన్'' అని పేర్కొనబడింది. దీని కొందరు 52 సంవత్సరాలని, మరి కొందరు 100 సంవత్సరాలని నిర్వచించారు.

''శాతవాహనులు క్రీస్తుశకం 205 సంవత్సరాని కంటె ముందు అంతరించి ఉండటానికి అవకాశం లేదు గనక ఇక్ష్వాకులు 52 సంవత్సరాలే పరిపాలించి ఉంటారని గోపాలాచారిగారి[11] అభిప్రాయం. డి. సి. సర్కార్[12] కూడా వీరి రాజ్యపాలనా కాలాన్ని క్రి. శ. 223 నుండి క్రి. శ. 275 వరకేనని నిర్ణయించారు.

ఇంతవరకు లభించిన ఇక్ష్వాకుల శాసనములలో రెండు శక సంవత్సరములలోను, మిగిలినవి, ఆయా రాజుల పరిపాలనా కాలాన్ని సూచించే సంవత్సరాలలోను ఉన్నవి. వీటిలో మొదటిది వీరపురుషదత్త I కాలంలో ''విజయ'' సంవత్సరమునకు సరియగు క్రీ.శ.273వ సంవత్సరానికి చెందినది. రెండవది అతని కుమారుడు ఎహువల శాంతమూలుని కాలంలోని ''విజయ'' సంవత్సరమునకు సరియగు క్రీస్తుశకం 333వ సంవత్సరానికి చెందినది. ఇక్ష్వాకుల రాజ్య పరిపాలనా సంవత్సరాలలో వేయించిన శాసనాలవలన, ఆయా శాసనాలలో పేర్కొనబడిన రాజులు సాధించిన ఘనకార్యములనుబట్టి ఈ క్రింది కాలానుక్రమణికను కొందరు పరిశోధకులు[13] నిర్ణయించినారు.




ఇక్ష్వాకుల రాజ్యపరిపాలన క్రీస్తుశకం నాలుగవ శతాబ్దం మొదటిభాగంలో అంతరించి ఉండవచ్చునని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు[14] అభిప్రాయపడినారు. ఈ వంశంలోని ఒక్కొక్క రాజు పరిపాలనా కాలం కనీసం ఇరవయి అయిదు సంవత్సరాలుగా గ్రహించినా శాంతమూలుడు మొదలుకొని రుద్రపురుషదత్తునివరకుగల నలుగురు రాజుల పరిపాలనా కాలం నూరుసంవత్సరాలు అవుతుంది. పైన చూపిన కాలాను క్రమణిక ప్రకారం ఇక్ష్వాకుల పరిపాలన రమారమి క్రీస్తుశకం 344వ సంవత్సరందాకా సాగిందనడంలో సందేహంలేదు.

షుమారుగా అదే కాలంలో విష్ణుకుండినులు తెలంగాణా ప్రాంతంలో తమ రాజ్యాన్ని స్థాపించి ఉండవచ్చు. కొమర్రాజు లక్ష్మణరావుగారు[15] నిర్ణయించిన కాలానుక్రమణిక ప్రకారం విష్ణుకుండినుల పరిపాలన క్రి. శ 357లో ప్రారంభమైంది. నేలటూరి వెంకటరమణయ్య గారు[16] కూడ తుమ్మలగూడెం శాసనం మొదటి గుదికర్త అయిన గోవిందవర్మ తాత ఇంద్రవర్మ క్రి. శ. 358 ప్రాంతంలోని వాడని నిర్ణయించారు. కాని ఇంద్రవర్మను గురించి కాని అతని కుమారుడైన మొదటి మాధవవర్మను గురించి కాని మనకు ఎక్కువగా తెలియదు. బహుశ వీరిరువురు సామాన్యులయిన సామంతులై ఉండవచ్చును. ఇంద్రవర్మ మనుమడైన మొదటి

గోవిందవర్మతోనే విష్ణుకుండినుల ఉచ్ఛదశ ఆరంభమైంది. ఇతడు కూడ మొదట సామంతుడై ఉండి తరువాత సాటి సామంతులను జయించి రాజ్యాన్ని స్థాపించి ఉండవచ్చును. ఇతడు స్వభుజ బలోత్సావ ప్రభావానురాగా వ్యాప్త స్వరాజ్యము కలవాడు. అన్యసామన్తాక్రాన్త రాజ్యాన్తరుడు. (తుమ్మలగూడెం తామ్రశాసనం మొదటి రేకు రెండవప్రక్క; రెండవరేకు మొదటిప్రక్క).

విష్ణుకుండినులు ఎవరికి సామంతులుగా నుండిరో తెలుపు ఆధారములులేవు. ఆనాడు మధ్య దక్కను ప్రాంతంలో మహోజ్వలంగా పాలించుచుండిన వాకాటకులకు వీరు సామంతులుగా నుండి తరువాత స్వతంత్రించి ఉండవచ్చునని ఊహింపవచ్చును. లేదా ఇక్ష్వాకులకే సామంతులుగానుండి వాకాటకుల సహాయమువలన స్వతంత్రించి ఉండవచ్చును.

ఇక్ష్వాకులలో చివరివాడయిన రుద్రపురుషదత్తునకు, విష్ణుకుండిన ఇంద్రవర్మ సమకాలికుడనుట అసమంజసమేమీ కాదు. ఆనాటి రాజకీయ సాంఘిక పరిస్థితులు, మత సంబంధమయిన పోలికలు, ఈ విషయాన్ని మరింత బలపరుస్తున్నాయి. శాతవాహనుల కాలమున అత్యంత ఉచ్ఛస్థితిలోనుండిన బౌద్ధమతము, ఇక్ష్వాకుల కాలమున క్షీణించటం ఆరంభమయింది. ఇక్ష్వాకులు బౌద్ధమతాన్ని ఆరాధించినప్పటికి వారిలో అనేకులు అశ్వమేధాది వైదిక క్రతువులు చేసినట్లు తమ శాసనములలో పేర్కొన్నారు. కొందరు శివాలయాలను నిర్మించారు· ఏహువుల శాంతమూలుని సైన్యాధ్యక్షుడయిన ''ఎలిశ్రీ'' సర్వదేవాధి వాసమైన దేవాలయాన్ని నిర్మించినట్లు వారి శాసనాలలో పేర్కొనబడింది. రాజులు వైదికధర్మాన్ని పాటిస్తూ వచ్చినా వారి రాణులు బౌద్ధమతాన్ని అనుసరిస్తూ అనేకమైన స్తూపాలను, సంఘారామాలను కట్టించటమేకాక, వాటిని పోషించటానికి భూములను దానం చేసినట్లు శాసనములు తెలుపుతున్నాయి. ఆ రోజుల్లో వారి రాజధాని అయిన విజయపురి బౌద్ధ మతస్థులకు కేంద్రంగా విలసిల్లింది.

విష్ణుకుండినుల కాలంలో కూడ బౌద్ధ, వైదికధర్మాలు రెండూ అనుసరింపబడుతున్నా కూడా వైదిక ధర్మముయొక్క ప్రాబల్యం ఎక్కువైంది. రాజులనేకులు యజ్ఞాది క్రతువులను చేసినట్లు తెలుపుతున్నాయి. రెండవ మాధవవర్మ ఏకాదశాశ్వ మేధావభృదావ ధూత జగత్కల్మషుడుగా, అగ్నిష్టోమ, సహస్రయాజిగా ఈపూరు తామ్రశాసనం [17] లో పేర్కొనబడినాడు. ఇంకా సర్వమేధ, పురుషమేధ, బహుసువర్ణ, వాజపేయ, పౌణ్డరీక, రాజసూయ మొదలయిన యాగములను, నాలుగవ మాధవవర్మక్రతు సహస్ర ఏకాదశాశ్వమేధములు చేసినట్లు వారి శాసనాలు చాటుతున్నాయి. వీరికి సమకాలికులయిన ఇక్ష్వాకులు, పల్లవులు అశ్వమేధాగ్నిష్టోమాది క్రతువులు చేసినట్లు చెప్పుకోవటాన్నిబట్టి ఆ కాలంలో దక్షిణ భారతంలోని రాజ్యాలన్నిటిలోను వైదిక క్రతువులు బహుళ జనాదరణపొందుతూ ఉండేవన్న, నేలటూరి వెంకటరమణయ్యగారి [18] ఊహ సరి అయినదే ననటంలో సందేహం లేదు.

విష్ణుకుండినులలో మొదటి గోవిందవర్మ, అతని పట్టపు రాణి పరమ భట్టారికా మహాదేవి, మొదటి విక్రమేంద్ర భట్టారకుడు బౌద్ధమతానలంబులయి స్తూపములను, విహారములను నిర్మించి, బౌద్ధమత ప్రచారానికై భిక్షుక సంఘాలను పోషించినప్పటికీ, తరువాతి రాజులు వైదిక ధర్మాన్నే అవలంబించినారు· పరమ మాహేశ్వరులమని, శ్రీపర్వత స్వామి పాదానుధ్యాతులమని చెప్పుకున్నారు. శివాలయాలను నిర్మించారు. ఇంద్రభట్టారకుడు, అతని కుమారుడు రెండవ విక్రమేంద్ర పరమ మహేశ్వరులు. మహేశ్వరుని తప్ప అన్యదైవాన్నికొలువమని ప్రతినబూనారు. విష్ణుకుండినులు సనాతన హిందూ ధర్మాన్ని సంరక్షించిన ధర్మనిరతులు.

ఇక్ష్వాకుల కాలమున బౌద్ధ ధర్మమును, సకల విద్యలను నేర్పుటకు వారి రాజధానిఅయిన విజయపురిలో గొప్ప అంతర్జాతీయ విద్యా కేంద్రం ఉండేది. విష్ణుకుండిన రాజు ఇంద్రభట్టారకుడు ఘటికా స్థానమును స్థాపించి విద్యాభివృద్ధికి తోడ్పడినాడు. ''యధావిధి వినిర్యాపిత ఘటికా వాప్త పుణ్య సంచయస్య'' అని చిక్కుళ్ళ తామ్ర శాసనములో [19] పేర్కొనబడినాడు. ఘటిక అనగా బ్రాహ్మణ విద్వాంసుల పరిషత్తని డాక్టరు కీల్హారన్ [20] అభిప్రాయపడినారు. ప్రాచీన ఘటికా స్థానములన్నియు బ్రాహ్మణ విద్యాస్థానములే.

వాస్తు నిర్మాణ కౌశలంలో కూడ విష్ణుకుండినులు వారికి ముందున్న ఇక్ష్వాకులను అనుసరించారు. విష్ణుకుండిన రాజులచే నిర్మింపబడిన ఉండవల్లి, మొగల్రాజపురం గుహాలయాలను చూసి పల్లవరాజు మొదటి మహేంద్రవర్మ ఉత్తేజితుడై తన రాజ్యంలో కూడ అటువంటివే నిర్మించాడని ఫ్రెంచిపండితుడు డ్యూబ్రియేల్ [21] అభిప్రాయపడినాడు. ఇవే కాకుండ పశ్చిమ గోదావరి జిల్లా జీలకఱ్ఱ గూడెం వద్దనున్న గుంటుపల్లి గుహాలయములు, కరీంనగర్ జిల్లాలోని అడివి సోమినిపల్లి, నెల్లూరు జిల్లాలోని భైరవకొండ గుహాలయములు, రంగారెడ్డిజిల్లాలోని కీసరగుట్ట రామలింగేశ్వరాలయము, సత్యవోలులోని రామలింగేశ్వర, భీమలింగేశ్వర దేవాలయాలు, అలంపురంలోని నవబ్రహ్మ దేవాలయాలు, శ్రీకాకుళం జిల్లాలోని ముఖలింగం దేవాలయము విష్ణుకుండినుల కాలానికి చెందినవని నిరూపించటానికి తగిన ఆధారాలున్నాయని యిటీవలి చరిత్రకారులు [22] అభిప్రాయపడుతున్నారు.

రాష్ట్ర పురావస్తు శాఖవారు నల్గొండ జిల్లా కృష్ణా తీరంలో ఏలేశ్వరం దగ్గర క్రిందటి దశాబ్దంలో జరిపిన త్రవ్వకాలలో ఇక్ష్వాకుల కాలానికి చెందిన ఎరుపు రంగు మృణ్మయపాత్రలు, ఎర్రమట్టి బొమ్మలు, 50.8 సెంటిమీటర్ల పొడవుగల పెద్ద

సైజు ఇటుకలతో నిర్మించిన స్తూపపు శిథిలాలు బయటపడినవి. ఈ శిథిలాల పైననే విష్ణుకుండినుల నాణేలు దొరికినవి. చిన్న సైజు శివాలయములు కూడ దొరికినవి. ఈ ఆధారములనుబట్టి ఏలేశ్వరం వద్దగల కృష్ణాలోయ ప్రాంతం ఇక్ష్వాకుల అనంతరం విష్ణుకుండినుల అధికారంలోకివచ్చి ఉండవచ్చునని పరిశోధకులు 23 భావిస్తున్నారు.

ఖమ్మం జిల్లాలోని నెల్కొండపల్లిలో జరిపిన త్రవ్వకాలలో కూడ ఇటుకలతో నిర్మింపబడిన పెద్ద స్తూపము వెలుగులోనికి వచ్చినది. ఈ ప్రాంతంలో కుప్ప తెప్పలుగా ఇక్ష్వాకుల నాణేలు, ఒకటి రెండు విష్ణుకుండిన నాణేలు దొరికాయి. స్తూప నిర్మాణంలో వాడబడిన ఇటుకల పరిమాణాన్ని బట్టి యిది క్రీస్తుశకం 4–5 శతాబ్దులలో నిర్మితమై ఉండవచ్చునని భావింపబడుచున్నది. ఈ నెలకొండపల్లి ఖమ్మం పట్టణానికి 20 కిలోమీటర్ల దూరంలో విజయవాడ వెళ్ళే రహదారిలో ఉన్నది. ఈ గ్రామానికి ఈశాన్యంగా విరాట్రాజు దిబ్బ లేక ఎర్రదిబ్బ అని పిలువబడే పెద్ద మట్టిదిబ్బ ఉన్నది. ఈ దిబ్బపై మట్టిని తొలగించి అయిదు మీటర్ల లోతు వరకు త్రవ్వగా ఏబది రెండు వరుసల ఇటుకలతో నిర్మితమైన గోళాకారపు అండము బయటపడినది. ఒక్కొక్క ఇటుక పరిమాణము 18"×9"×2 1/2" ఉన్నది. కాల్చినవి, సగం కాల్చినవి యిటుకలు ఈ స్తూప నిర్మాణములో వాడబడినవి. ఈ గ్రామానికి కొంచెం దూరంలోనున్న బైరాగిగుట్ట దగ్గర ప్రాచీన కాలానికి చెందిన ప్రజలు నివసించిన చిహ్నాలు కనపడుతున్నాయి. ఈ ప్రదేశంలో ఒకటిన్నర మీటరు లోతున త్రవ్వగా, నలుపు ఎరుపురంగుగల మృణ్మయపాత్రలు, మట్టిపూసలు, మట్టితోచేసిన మనిషిబొమ్మ, లెక్కలేనన్ని సీసపు నాణెములు లభించినవి. ఈ నాణెములమీద తొండము పైకెత్తిఉన్న ఏనుగు బొమ్మ ఉన్నది. ఇవి నాగార్జునకొండ, ఏలేశ్వరములవద్ద లభించిన ఇక్ష్వాకుల నాణెములను బోలి ఉన్నవి. ఇక్కడ లభ్యమైన ఎరుపురంగు మృణ్మయ పాత్రలు, యితరములయిన అలంకరణ వస్తువులు, ఏలేశ్వరములో లభించిన ఇక్ష్వాకులనాటి వస్తువులతో సరిపోలుచున్నది. వీటి నన్నింటినీ సమీక్షించి చూడగా నెలకొండపల్లి ఇక్ష్వాకుల కాలమున అభివృద్ధి చెందిన పట్టణమని, బౌద్ధమతమును ప్రోత్సహించుటకు యిక్కడ స్తూపము నిర్మింపబడినదని యాఢి అగుచున్నది.

గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో సత్తెనపల్లి — అచ్చంపేట రోడ్డుపైనున్న వేల్పూరులోని రామలింగేశ్వరస్వామి ఆలయంలో ఇక్ష్వాకుల కాల నాటి ప్రాకృత శాసనాలు అనేకం ఉన్నాయి. విష్ణుకుండిన రాజు రెండవ మాధవవర్మ వేయించిన శిలాశాసనము కూడ ఈ దేవాలయములోనిదే.

కాని ఇక్ష్వాకుల శాసనాలన్నీ శాతవాహనుల శాసనాలవలెనే అన్నీ ప్రాకృతంలో ఉన్నాయి. విష్ణుకుండినుల శాసనాలన్నీ సంస్కృత భాషలో ఉన్నాయి. ఒక్క భాష విషయంలో తప్ప మిగతా ఆచార వ్యవహారాలన్నిటిలోను మత సామరస్యంలోను ఇక్ష్వాకులకు, విష్ణుకుండినులకు సన్నిహిత సంబంధాలున్నాయనటంలో సందేహంలేదు.

ఇందుకు కారణం ఊహించటం ఏమంత కష్టమేమీకాదు. రెండు రాజవంశాలు పాలించినది తెలుగు దేశము. ఇక్ష్వాకులది పరిమితమైన రాజ్యము. విష్ణుకుండినులది విస్తృతమైన రాజ్యము. ఇక్ష్వాకులు విజయపురిని రాజధానిగా చేసికొని గుంటూరు, కృష్ణా మండలాలను రమారమి నూరుసంవత్సరాలు జనరంజకంగా పాలించారు. విష్ణుకుండినులు ఇప్పటి హైదరాబాద్‌లోని ఒక ప్రాంతంలో స్వతంత్రం ప్రకటించుకొని, రాజ్యాన్ని స్థాపించి కాలక్రమేణ యావదాంధ్రదేశాన్ని తమ ఆధీనంలోకి తెచ్చుకొని, రమారమి 250 సంవత్సరాలు పరిపాలించారు. వైదిక ధర్మాన్ని ఆదరించి, అనుసరించి ప్రచారం చేశారు. బౌద్ధమతం క్షీణించటం ప్రారంభమైంది. అయినా ఆనాడు వీరిచే నిర్మితమైన చైత్యములు, విహారములు, శిథిలావశేషరూపాలలో ఈనాటికీ మనకు కనపడుతున్నాయి. ఇటువంటి అవశేషాలలో యిటీవలి త్రవ్వకాలలో విజయవాడ మొగల్రాజపురం కొండపైన బయటపడిన బౌద్ధచైత్యము ఒకటి. ఈ కట్టడము నిర్మింపబడిన విధానం చూస్తే యిది మొదట చైత్యమని అనంతరకాలంలో వైదిక ధర్మానికి చెందిన ఆలయంగా మార్పు చేయబడింది కావచ్చునని రాష్ట్రపురావస్తు శాఖ పరిశోధకులు భావిస్తున్నారు. ఇది విష్ణుకుండినుల కాలానికి చెందిన నిర్మాణము కావచ్చును.

ఇక్ష్వాకుల భవన నిర్మాణ కౌశలము ఆ కాలమునాటి యితర రాజవంశములకంటె కూడ విష్ణుకుండినులే ఎక్కువగా అనుకరించి, ఆదరించి, ప్రోత్సహించినట్లు కనపడుతుంది. ఆనాటి కట్టడముల నిర్మాణములో గోచరించు మూడుదశలు మనకు విష్ణుకుండినుల కాలంలోనే కనపడుతున్నాయి. మొదటిదశలో కేవలం యిటుకలతోనే నిర్మాణం జరిగింది. రెండవదశలో రాయి వాడబడింది. ఆ తరువాత దశలో వాస్తు, శిల్పకళాకౌశలం ఉట్టిపడే దేవాలయ నిర్మాణం కొనసాగింది.

విష్ణుకుండినులకంటె ఇక్ష్వాకులకు శాతవాహనులతో మిక్కిలి సన్నిహిత సంబంధం ఉండటంచేతనే ఇక్ష్వాకులు శాతవాహనులవలె ప్రాకృత భాషను రాజభాషగా స్వీకరించి ఉండవచ్చు. బౌద్ధమతానికి దూరమవుతూ వైదికమతాన్ని అవలంబించి అశ్వమేధాది వైదిక క్రతువులను ఆచరించి రమారమి నూరు సంవత్సరాలు

( మిగతా 49 వ పేజీలో )

# గది

## శ్రీ ధూర్జటి వేంకట బాలాజి

మీరెవ్వరూ ఎరుగరు –
మీ కెవ్వరికీ తెలియదు –
మీరు–కనీసం ఒక్కసారైనా–ఒక్కమారైనా
దీనిని గురించి ఆలోచించిఉండరు –

యీ –
నాగదిని గురించి కనీసం ఊహలలోనైనా భావించిఉండరు.

నాగది –
ఎంత విశాలమైనది –
అనంతమైన యీ పృథ్వీవలయంకన్నా –
ఎంత గంభీరమైనది –
ఉవ్వెత్తుగా లేస్తున్న కెరటాలతో కూడుకొన్న
సముద్రంకన్నా–
విశాలమైన యీ – నా గదిని
మానవత్వపు – యిటుకలతో నిర్మించుకొన్నాను.

యీ గదికి కళ్ళులేవు –
అయినా చూడగలిగిన శక్తుంది –
యీగదికి చెవులులేవు –
అయినా వినగలిగిన శక్తుంది
ఒకవేళ –
నాసికాపుటములు లేకపోవచ్చును గానీ –
నాగదికి ఆఘ్రాణించ గలిగిన శక్తుందంటే నమ్మండి !
యింకా –
జిహ్వాచాపల్యాన్ని అర్థం చేసుకొనే నాలుక –
స్పృశించ గలిగిన చర్మం –
నా గదికుండే వెలలేని ఆభరణాలు –

**యీ గదిలో** –
ఎన్నెన్ని జ్ఞాపకాలను –
ఎన్నెన్ని మధురమైన అనుభూతులను –
మరింకెన్నో తీయనైన తీపి కలలను
యింకా –
ఎన్నో యుగాల విశిష్ట గాథలను –
ఎన్నో తరాల సాంప్రదాయాలను,
జాగ్రత్తగా – అత్యంత పదిలంగా భద్రపరచుకొన్నాను.
అంతేకాదు – -
ఎన్నో చల్లని వెన్నెల రాత్రులందు –
ప్రేయసితో జరిపిన వెచ్చని సంభాషణలను
ఎన్నో చీకటి రాత్రులందు బరువుగా
భవిష్యత్తును గురించి చేసిన ఆలోచనలను
చిన్ననాడు చిలిపి చేష్టలను
పెద్దనాడు ఊహించిన భావిజీవితపు కలలను
యిక్కడనే –
యీ గదిలోని ఆల్మైరాలోనే –
జాగ్రత్తగా దాచిపెట్టి
ఎవ్వరూ దానిని తీయకుండా ఉండేరీతిలో –
తాళం వేసి దానిని నా మొలకు కట్టుకొన్నాను.

చిన్నప్పుడు –
యీ నా జీవితంలో –
నాకో ప్రత్యేకమైన గది ఉండాలనీ –
అందులో–ఎన్నెన్నో వస్తువులను దాచుకోవాలనీ
ఎవ్వరూ దానిని గురించి ఊహించని రీతిలో –
ఎవ్వరూ దాని తలుపులు తెరువని రీతిలో
మరింకెవ్వరూ దానిని గురించి భావించని రీతిలో
**నాకు** నేనై జాగ్రత్తగా చక్కని నమూనాలో కట్టుకొన్నాను.

**ఈ గదిలో** –
నా చిన్నప్పుడు మేష్టారు విధించిన దండనలను
పెద్దయి ఉద్యోగం రానప్పుడు –
బంధుమిత్రులు–ఉద్యోగం రానందులకు హేళనగా నవ్వినప్పుడు
ఆ హేళన తాలూకు మరువలేని చిత్రమైన సంఘటనములను
వివస్త్రగా – బాలునిగా
తల్లిదండనకు పాత్రమై భుజించక ఎక్కిళ్ళుపెట్టి ఏడ్చిన
రోజులను

యువకునిగా –
ఏవేవో ఆశయాలను—ఆశలను

లక్ష్యాలను గమ్యాలను --
యిక్కడనే —
యీ గదిలోనే —
జాగ్రత్తగా దాచుకోగలిగాను —

ఏనాటికైనా —
నా గదిలాంటి గదిని కట్టుకోమని,
అందులో —
నేను పెట్టిన వస్తువులు లాంటివే పెట్టుకోమని
నేను చేసిన – ఊహలను – బాసలను చేయమని
ఎందరికో — యిలా ఎందరికో
యింకెందరికో -- యింకా యిలా ఎందరెందరికో
చెప్తున్నాను–చేసి చూపిస్తున్నాను శాయ శక్తులా
ప్రోత్సహిస్తున్నాను.

అయితే – ఒక్కటి –
యీ విషయం గురించి మీకింతవరకు చెప్పలేదు.
ఏనాడూ-దీనిని గురించి మీతో మనసు విప్పి మాటాడలేదు.

యీ – నా గది
ఎప్పటికైనా – ఎన్నటికైనా
అంతర్థానమౌతుంది – అంతమవుతుంది.

అదీకూడా – నాతోనే –
అందులకే –
నేనులేనిదే – తనులేదు
తనులేనిదే – నేనులేను
యీ నాగదిని —
నేను తప్ప ఎవ్వరూ తీయలేరు.
నేను తప్ప ఎవ్వరూ తాకలేరు.

## "విష్ణుకుండినులు ఇక్ష్వాకుల అనుయాయులా !"

(47వ పేజీ తరువాయి)

అంటే దక్షిణాన పల్లవులు, తూర్పున బృహత్పలాయనులు విజృంభించే వరకు అవిచ్ఛిన్నంగా ఇక్ష్వాకులు రాజ్యపాలన చేశారు. తరువాత రాజవంశాలవారికి మార్గదర్శకులయ్యారు.

## అధోజ్ఞాపికలు


1 Comparative Grammar 2nd edition Introduction, P 113.
2 Successors of the Satavahanas P· 11.
3 Purana Text of the Dynasties of the Kali Age.
4 మత్స్య, వాయు, బ్రహ్మాండ, విష్ణుపురాణములు.
5 Ancient History of the Deccan P. 83.
6 Epigraphia Andhrica Vol. I, P. 146–147.
7 Early History of the Andhra Country P. 131.
8 Ancient History of the Deccan P. 88–101.
9 Epigraphia Indica XXVI, PP 125.
10 Ancient History of the Deccan PP 55–57.
11 Early History of the Andhra Country P 138.
12 The Successors of the Satavahanas Chapter I.
13 J. A. H. R. S. Vol. XXX, P. 135. (K. Syamasundaram)
14 తెలుగు విజ్ఞాన సర్వస్వము మూడవ సంపుటి పుట 108.
15 భారతి Vol. VII, P 473–74.
16 విష్ణుకుండినులు P 24.
17 Epigraphia Indica XVII. No. 21, PP 337–39.
18 విష్ణుకుండినులు P 41
19 Epigraphia Indica Vol. IV PP 193–98.
20 Epigraphia Indica VIII, P 20. N 1.
21 Pallavas Chapter III. P 27 f.
22 The Vishnukundins.
23 A Monograph on Yeleswaram Excavations.

డా. కె. ఏ. సుందరాచార్యులు

# యయాతి చరిత్రమే మొట్టమొదటి అచ్చ తెలుగు కావ్యము

'భారతి' జూన్ 1972, పుట 29 లో శ్రీ రంగాచార్యులుగారు 'యయాతి చరిత్రము మొట్ట మొదటి అచ్చ తెలుగు కావ్యమా ?' అను శీర్షికతో నొక వ్యాసమును ప్రచురించిరి. దానికి ఇంతవరకు సందేహ నివారకములైన వ్యాసము లేవియు పండితులు వ్రాయలేదు. కావున నా పరిశోధన కందిన విషయములతో ఈ వ్యాసము వ్రాయుచున్నాను.

అచ్చతెలుగు ప్రక్రియలో మొట్టమొదటి కావ్యము యయాతి చరిత్రమని కవి చరిత్రకారులు వ్రాసియున్నారు. సాహిత్య లోకము నందు ఇదియే తొలి కబ్బమని వాడుక గలదు. గ్రంథాధారములను బట్టి ఈ విషయమును నిర్ణయింపనగును.

పొన్నికంటి తెలగన 'యయాతి చరిత్రము' మొదటిదని ఈ పద్యమున ఉదహరించెను.

'అచ్చ తెనుంగుఁ బద్దె మొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది యెన్నచు నేర్పునఁ బొత్తమెల్లని
ట్లచ్చ తెనుంగున న్నుడువ నందుల చంద మెఱుంగువారు నిన్
మెచ్చరొ యబ్బురంబనరొ మేఁనరో కొనియాడరో ననున్'

(యయాతి. 1-12)

ఈ పద్యము మరింగంటి అప్పనగారు తెలగన్నను పిలిచి అంత వరకున్న తెలుగు కావ్యములలో నట నట నొక్కొక యచ్చ తెలుగు పద్యము లుండి హాయిని గొలుపుచున్నవని, కావున కబ్బ మంతయు నట్లే యచ్చ తెనుఁగున గూర్చినచో కొనియాడుదురని చెప్పి--

'మున్నెవ్వరు నొడువని యీ
తెన్నిడి కడుమీఱి యచ్చ తెనుఁగుం గబ్బం
బెన్నిక మీఱఁగఁ జెప్పిన
నిన్నుం బొగడంగఁ గలడె నెలతాల్పయినన్'

(యయాతి 1-11)

అని ప్రోత్సహించెను. పైపెచ్చు అమీనుఖానునకు అంకిత మిమ్మని, సిరులను పొగడ్తలను పొందుమని సలహా నొసగెను దీనినిబట్టి పొన్నికంటి తెలగన్నయే అచ్చ తెలుగు కృతి కర్తలలో మొదటివాడని భావింపవచ్చును. కాని ఇంచుక సమకాలికుడు, అప్పనగారి తమ్ముడును అగు మరింగంటి సింగరాచార్యులు తన శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణమున యయాతి చరిత్రములోని పై పద్యములను పోలిన పద్యములను పీఠికలో వ్రాసెను. అవి —

''మున్నెవ్వడు నుడువని యీ
తెన్నెడ యెడ మీరి యచ్చ తెనుఁగు నిరోష్ఠ్యం
బెన్నిక జెప్పిన ప్రోడన్
నిన్నుం బొగడంగఁ గలడె నెల తాల్పయినన్'

(సీతా. క. పీ. 21)

'అచ్చ తెనుంగుఁ బద్దె మొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడు కొందురొగి నెన్నుచు పెద్దలు గ్రంథమెల్ల ని
ట్లచ్చ తెనుంగునన్ నుడువ నందలి చందమెఱుంగువారు ని
న్మెచ్చరొ యబ్బురంబనరొ, మేలనరో, కొనియాడరో కడున్'

(సీతా. క. పీ. 22)

[1]ఈ రెండు పద్యములను గమనించిన సాహిత్య విమర్శకులకు ఏ కావ్యము ముందు రచింపబడినదను సందేహము కలుగుటకు అవకాశము కలదు. ఈ రెండు పద్యములలో రెండవ పద్యమున భేదమేమియు లేదు. కాని మొదటి పద్యమున తెలగన 'అచ్చ తెనుఁగుం గబ్బంబు'అని చెప్పగా సింగరాచార్యులు 'అచ్చతెలుఁగు నిరోష్ఠ్యంబు' అని చెప్పుట వల్లనే వారిరువురును చెరొక ప్రక్రియకు ఆద్యులని చెప్పుకొన్నట్లయినది. అనగా అచ్చ తెలుగు రచనకు తెలగన ఆద్యుడు కాగా, అచ్చ తెలుగు నిరోష్ఠ్య రచనకు సింగరాచార్యులు ఆద్యుడయ్యెను. ఈ విషయము మరికొన్ని పద్యముల వల్లను ఋజువగుచున్నది. సింగరాచార్యులు -

'రాఘవ పాండవీయ కృతిరత్నము పింగళి సూరనార్యుడే
శ్లాఘ సముద్ధరించె నది సర్వ బుధప్రతతుల్ గణింప నా
హాఘనమయ్యె దానికెన యాంధ్ర నిరోష్ఠ్య మహా ప్రబంధమెం
తే ఘటియింపఁ జేయ నలుదిక్కుల యందు ప్రసిద్ధమయ్యెడున్.'

(సీతా. క. పీ. 20)

అను పద్యమునందు ఆంధ్ర నిరోష్ఠ్యమహాప్రబంధమనియే పేర్కొనెను. అట్లే —

'తెనుఁగునఁ గొన్ని కావ్యములు తెల్లముగా రచియింపవచ్చు బే
ర్కొనఁగ నిరోష్ఠ్య కావ్యములు గొన్ని యొనర్పగ వచ్చుగాక చ
క్కననివి రెండు చందములు గ్రచ్చర గూరిచి నేర్పుచేత నె
వ్వనికి రచింప శక్యమగు వాంఛ యొనర్చితి దాని సేయగన్.'

(సీతా. క. పీ. 27)

అను పద్యము నందు అచ్చ తెలుగు కావ్యము, కేవల నిరోష్ఠ్య కావ్యము వ్రాయవచ్చుఁగాని ఈ రెంటినిచేర్చి ఒకే కావ్యమువ్రాయుట కష్టమని, కావుననే అట్టి కావ్య రచన గావింతునని చెప్పుకొనెను. అనగా అచ్చ తెలుగున యయాతి చరిత్రము గలదనియు, నిరోష్ఠ్యమున తాను రచించిన దశరథరాజనందన చరిత్రము కలదనియు, ఆ రెండు నియమములను ఒకే కావ్యమున నన్వయించి తన రచనా పాటవమును చూపుదునని స్పష్టపరచినాడు. అంతేగాక —

'తొలుతటి సుకవులు ఘనులై
యిలనాంధ్ర నిరోష్ఠ్య కావ్య మేలా సేయం
దలచరో! నాకు ప్రసిద్ధము
గలుగగ నొనరించు కొఱకు గావలె నరయన్.'

(సీతా. క. పీ. 29)

అను పద్యమందు కవిత్రయము భాగవతము వ్రాయకుండుట తన భాగ్యమని చెప్పుకొన్న పోతనవలె తనకీ రెండు నియమములు కూర్చు ఘనత దక్కుటకే తెలగనాదులు నిరోష్ఠ్యమును కూర్పలేదని కృతజ్ఞత చెప్పుకొనెను. మరియు—

'ఇల కవితా ప్రయాసమగు నెన్నికమై యుభయార్థ కావ్యముల్
గల విపుడట్ల విన్నయది గద్దిక ముందరగల్గ నేర్చునే
తెలుగు నిరోష్ఠ్యపుం గృతి యిదేమఱి తక్కగ నిప్పటందులన్
గలుగదు వింటలేదె యిక కాగల జాడలు నెన్న నేటికిన్!'

(సీతా. క. పీ. 31)

అను పద్యములోను 'తెలుగు నిరోష్ఠ్య పుంగృతి' అనియే చెప్పుకొనుటవలన శుద్ధాంధ్ర నిరోష్ఠ్య రచనమున తానే మొదటివాడు. కాని శుద్ధాంధ్రమున మాత్రము కాదని చెప్పినట్లయినది.

అచ్చ తెలుగు కావ్య నిర్మాణ విషయమున తెలగన—

'తెనుఁగునను మాఱు పేళ్ళిడి
పెనచిన వినఁగూడదనుచు బిరుదులు పేళ్ళన్
మునువేల్పు బాస వెంబడి
మునిచెదఁ గాదనకుఁడయ్య యుల్లములందున్.'

(యయాతి. 1-14)

అను పద్యమునందు బిరుద నామములను తెలుగునకు మార్చినచో కథావగాహనము కష్టమగును గావున తత్సమములనే ఉపయోగింతునని, కాదనుకు డని సాహితీమూర్తులను వేడుకొనెను. ఈ నియమమునే సింగరాచార్యులు —

'ఇల సుర భాషల కొన్నిటి, తిలకింపగ వికటమనుచు తిరమగు నామం
బులు కథలు తెలియుకోసము, నిలిపితి కవి సమ్మతాన నిల్కడఁగన్.'

(సీతా. క. పీ. 34)

అను పద్యమునందు 'కథలు తెలియుకోసము నిలిపితి కవిసమ్మతాన' అని చెప్పటలో తెలగన యభిప్రాయమును విశదపరచుటయేగాక తనకు ముందు తెలగన నియమ మేర్పరచినట్లు, తాను అనుసరించుచున్నట్లును తెల్పుకొనెను. కాగా తెలగన ఒకే నియమమును తెలిపెను. కాని సింగరాచార్యులు—

'తరమక ప్రతిపదములు వ
ల్మరునరయుచు సముచితోక్త మార్గంబులనున్
దెరువులు దెలియుచు నర్థం
బెరగగ దగు నుభయసంధు లెనయుటకతనన్.'

(సీతా. క. పీ. 32)

'అరయ కగ చజ టడ తద నాయల సహా
రద్వయమెగాని యొండక్షరములు సొరవు
మఱియు నౌత్వోత్వములు కొమ్ము మానుడియును
వలవదామీద సురభాష నిలుపరాదు.' (సీతా. క. పీ. 33)

అను రెండు అదనపు నియమములు నిరోష్ఠ్యమునకు చెందినవే కాని అచ్చ తెలగునకు సంబంధించినవికావు. నియమబాహుళ్యము తరువాతి రచననునే బలపరచుట సహజము.

సింగరాచార్యులు అప్పనగారికి అయిదవ తమ్ముడు. ఆనకృతిని నరాంకితము గావించుటకు విముఖుడగుటచే అతని 'మున్నెవ్వరు నొడువని'' ''అచ్చతెనుంగు బద్దె మొకట్లైనను'' అను పద్యములను అప్పనగారు అమీనుఖానునకు అంకితమివ్వ నిష్టపడిన మిత్రుడు తెలగన కావ్యమున చొప్పించినట్లు భావించుటకును వీలులేదు. సింగరాచార్యులు అప్పనగారిని దశరథరాజనందన చరిత్రమునందును, అట్లే సీతాకల్యాణమునందు—

'మత్తేభ నరహయ మనుజేంద్ర మకుటాగ్ర
మిళితాంఘ్రి యుగళు డప్పల గురుండు
నిగమచేత స్వతంత్ర నిపుణార్థ సంపత్తి
నతిశయిల్లెడు వేంకటార్యమౌళి
సంగీత నాటక స్వరకల్ప సాహిత్య
చిత్ర కవితుడు నారసింహ గురుడు
పరవాది కుమతుల పటుశాస్త్ర హరణుడై
రాజిల్లు కోనేటి రాయశౌరి

వినుత శతఘంట బిరుదాంక విజయుడైన
జగ్గగురు కాంతదేశిక చంద్రునకును
అనుజులగు రంగ నరసింగ రార్యఘనులు
నవని ప్రబలిరి యే సింగరాహ్వయుడను' (సీతా. క. పీ 52)

తమ సోదరులను ప్రస్తుతించుచు 'ముగురు రాజులచేత మ్రొక్కులుగొన్నవాడని అప్పనను ప్రశంసించెను. కావున అప్పనగారి వంటి సహృదయుని శంకించి సింగరాచార్యులను అచ్చతెలుగు రచన కాద్యునిగ భావించుట సింగరాచార్యులకే అపకారమొనర్చినట్లగును.

సింగరాచార్యులు పీఠిక, ఆశ్వాసాద్యంత భాగములను మిశ్రాంధ్రమున వ్రాయుట బాగనిపింపక తెలగన్న వానిని కూడ అచ్చ తెలుగులో కూర్చి యుండుననీ, కావున యయాతి చరిత్రము తరువాతి రచనమని భావించుటకును వీలులేదు. తెలగన అచ్చతెలుగున ఆద్యంతము వ్రాయగా సింగరాచార్యులు తన నియమ బాహుళ్యమువల్లనో, కాక అచ్చ తెలుగున కథాభాగము మాత్రను వ్రాయనెంచియో పీఠికాదులను మిశ్రాంధ్రమున రచించెననుటయే యుక్తము:

అచ్చతెలుగున 'ఆదికవి' తెలగన. యయాతి చరిత్రము ఆది కావ్యమని అచ్చతెలుగు రచయితలు కూడ తమ కృతులలో పేర్కొనుట పై అభిప్రాయమునకు ఉపబలకము. మచ్చ వెంకటకవి శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన కుశచరిత్రమున—

'చెన్నుగఁ దెనుగుంగయితలు
దిన్నగఁ జేసిన కడింది దిట్టలఁ దలఁతున్
నన్నయ—నెఱ్ఱయనల ది
క్కన్నన్సింగన్న సూరయందెలగయ్యన్' (కుశ.చ.1–14)

అనియు, అబ్బరాజు హనుమంతరాయ శర్మ పాకయాజి 'అచ్చాంధ్ర నిరోష్ఠ్య నిర్గద్య దాశరథీ చరిత్రము'న—

'తలఁచెద నెద నిల జిట్టుల
గలిగిన కతలన్ యయాతి కతకత తేనెల్
జిలికెడి కఱదల దానిం
దెలిగించంగఁ దెలఁగన్నె తెల్లన్ననినేన్' (దాశ.చ.1–11)

అనియు, జంగా హనుమచ్ఛాస్త్రిసోదరి 'శుద్ధాంధ్ర నిర్వచన సత్యా వివాహమున—

'తెలగనయు దిమ్మనయు నచ్చతెలుఁగు గూర్చి
గొప్పతన మొందిరని నేను గూర్చుటరయ
కడలి దూకిన యనుమని గాంచియొక్క
కోతియును దూకిపడినట్టి రీతిగాదె' (పీఠిక 6 పుట)

అనియు, అయ్యనకోట పార్థసారథిసెట్టి 'సత్యవిజయము'న—

'మున్ను దెనుంగుఁగ యీసరి
మిన్నల నన్నయ నెఱ్ఱన్న మేటిల్లిన తి
క్కన్నను సోమనఁ దెలగన
నన్నువమొల్లమ్మఁ దిమ్మయన్ మదిఁదలఁతున్'
(పీ 1–13)

అనియు తెలగన అచ్చ తెలుగు రచయితలలో మొదట స్తుతింపబడుటచేతను, కందుకూరి వీరేశలింగం పంతులు మొదలగు కవి చరిత్రకారులందరును తెలగన్నయే అచ్చతెలుగు రచనకార్యుడని చెప్పుటచేతను, యయాతి చరిత్రమే అచ్చతెలుగు కృతులలో మొట్టమొదటిదగుచున్నది.

ఇక వీరిరువురి కాలనిర్ణయమునకు తగిన సాధనములు లేకున్నను, సింగరాచార్యులు 'తెలగన—అప్పనల' సమకాలికుడైనను వయోవ్యత్యాసముచే తెలగనకన్న చిన్నవాడైయుండును. అప్పలాచార్యులకు, సింగరాచార్యులకు మధ్య ఒక్కొక సంతానమునకు రెండు సంవత్సరముల అంతరమున్నను సుమారు పది సంవత్సరముల వ్యత్యాస మేర్పడును. ఇబ్రహీం కుతుబ్‌షా 1581లో మరణించు నాటికే యయాతి చరిత్ర రచింపబడినట్లు అందలి పీఠికయే చెప్పుచున్నది. నాటికి తెలగన—అప్పనగారలు ఇరువదైదేండ్ల వారైనను సింగరాచార్యులు పదునైదేండ్ల వాడగును. అతడు తన గ్రంథములలో అప్పలాచార్యులను గూర్చి చెప్పిన ముగురు రాజుల మ్రొక్కులు గొన్న సందర్భమునాటికే జరిగినట్లు తలపవలసి యున్నది.

కావున ఈ కారణములను అచ్చతెలుగు కవులలో మొదటివాడు పొన్నికంటి తెలగన్న. మొట మొదటి అచ్చతెలుగు కావ్యము యయాతి చరిత్రము.

## ఆ ధా ర ము లు

1 'భారతి' ఫిబ్రవరి—1966. పుట. 48. 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' ని. వెం.

2 'భారతి' జూన్ – 1972 పుట. 29. "యయాతి చరిత్రము మొట్టమొదటి అచ్చతెలుగు కావ్యమా?" శ్రీ రంగాచార్య.

3 యయాతి చరిత్రము=పొన్నికంటి తెలగన్న. వావిళ్ళ ప్రతి.

4 శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము=మరింగంటి సింగరాచార్యులు.

a. శ్రీ రంగాచార్య వ్రాత ప్రతి.

b. S.V.O.R.I. No.D.1378 తిరుపతి తాళపత్రప్రతి.

5 ఇతర అచ్చతెలుగు కృతులు—కవిచరిత్రములు మొ॥

శ్రీ ఎ వి ఎస మూర్తి

# కొండమీద యిల్లు

గోపీ, వాసూ బడినుంచి యింటికి వచ్చారు.

వాళ్ళకి ఎదురెళ్ళింది రత్న.

''కొండింటి తాతాలు కాలికెల్తున్నాం ! అమ్మ చెప్పింది!''

ఆ వార్త వాళ్ళలో ఎనలేని ఉత్సాహాన్ని రేపింది. భుజాన ఉన్న సంచులను విసిరేసి అమ్మదగ్గరకు పరుగెత్తారు.

''కొండింటి తాతయ్య దగ్గర కెళ్తున్నామా?''

''ఎప్పుడెల్తున్నాం?'' ''బస్సుమీదా? రైలుమీదా?''

మల్లమ్మ ''ఊ!'' అంది. ఒకరిచేయి ఒకరు పట్టుకు పరుగులు తీస్తూ ఊరంతా చుట్టేసారు.

వాళ్ళ పరుగులూ గెంతులూ నవ్వులూ కబుర్లూ చూస్తూ అనుకుంది మల్లమ్మ

''మునుపటి తాతయ్య కాదురా వెధవల్లారా!'' అని.

పిల్లలకి తాతయ్య అంటే ఎన్నో గుర్తొస్తాయి.

ఆయన వాళ్ళని భుజాని కెక్కించుకుంటాడు! 'గాగం గక్కచ్చి' ఊపుతాడు! సైకిలుమీద కూర్చోబెట్టుకుని ఫ్యాక్టరీకి తీసుకువెళతాడు. అక్కడ చెరుకులూ పానకం ఉంటాయి. అంత దూరం సైకిలుమీద కూర్చుంటే కాళ్ళు తిమ్మిర్లెక్కుతాయి. దిగినప్పుడు నించోలేరు. తమాషాగా ఉంటుంది. ఎన్నో ఉంటాయి దోవలో. అన్నింటిగూర్చీ అడుగుతారు. ఆయన జవాబిస్తాడు. యింటికి వచ్చేసరికి రెండు జేబుల్నిండా బిస్కత్తులు! చాక్లెట్లు!

ఆ వూళ్ళో వాళ్ళ అమ్మ ఏం అడిగినా చేసిపెట్టేది. రోజుకో పిండివంట. గడ్డ పెరుగు. జుర్రుకు జుర్రుకు తినేవారు. పెరట్లో ఆ కొండమీద జామిచెట్లూ మామిడిచెట్లూ ఉన్నాయి. బండరాళ్ళున్నాయి. వాటిమీద కూర్చుని మామిడికాయలు తినేవారు. పులుపెక్కిన పళ్ళతో అన్నాలముందు కూర్చుని అంతా దిగబెట్టేసేవారు. మల్లమ్మ తిడితే వాళ్ళు బిక్కమొగాలు వేసేవారు. తాతయ్య వాళ్ళని వెనకేసుకు వచ్చి కూతురిని కోప్పడేవాడు. అమ్మ కోపం ఉత్తుత్తికోపం అని వాళ్ళకీ తెలుసు. కాస్సేపు భయం నటించేవారు. ఆరుబయట మంచాలు వేసుకొనేవారు తాతయ్య ఎన్నో కథలు చెప్పేవాడు: తల్లిని చుట్టుకుపడుకునే కుక్కపిల్లల్లా ఆయన్ని అల్లుకుపోయేవారు. క్రమంగా నిదురలోకి జారిపోయేవారు.

ఉన్నదేదో తినేసి పుస్తకాలు ముందేసుకుని గోపీ, వాసూ తాతయ్య విశేషాలు చెప్పుకుంటున్నారు. వాళ్ళపక్కనే రత్నం నేలమీద నిద్రపోతోంది.

మల్లమ్మ చదువుకోమని ఆరోజు వాళ్ళని గసరలేదు. వంటగది గడపనే తలగడగా చేసుకొని కొంగుపరుచుకుని పడుకొంది. వెంకట్రావు వచ్చేసరికి తొమ్మిది దాటుతుంది. కాకినాడలో స్టోర్సులో సేల్సుమేన్ అతను. ఎనిమిది వరకూ వ్యాపారం జోరుగా ఉంటుంది. ఆరుమైళ్ళదూరం సైకిలుమీద రావాలి! 'పట్నంలో ఏదయినా యిల్లు చూసుకుందామనీ, యీ యిల్లు అద్దెకు యిచ్చేద్దామనీ' పెళ్ళయిన కొత్తలో అనేది. 'యీ మట్టి యింటికి, పట్నానికి యింత దూరంలో ఏమాత్రం అద్దెపలుకుతుందీ...? స్వంతదంటూ, ఓ కొంప ఉన్నాక ఎక్కడో అవస్థలు పడటం ఎందుకూ ?' అంటూ పడనిచ్చేదుకాదు. క్రమంగా అలవాటయిపోయింది. అయితే గాలేస్తే ఎగిరిపోయేటట్టుండే అతని నీరస శరీరాన్నీ, అది పడే కష్టాన్నీ తలుచుకున్నపుడల్లా ఆమె కడుపులో దేవుతున్నట్టుంటుంది. కొద్దిపాటి పెట్టుబడి దొరికితే — వ్యాపారంలో అంతో యింతో అనుభవం ఉంది గనక—వ్యాపారం చేయించాలని మల్లమ్మ ఆశపడేది. ఆ ఆశకు ఆధారం తండ్రి వీర్రాజు! యీమధ్య తండ్రి గూర్చి తెలిసిన వార్త ఆమె ఆశలకు గొడ్డలిపెట్టులా ఉంది.

మల్లమ్మ ఆలోచనలు సాగుతున్నాయి.

నాలుగవ యేటనే ఆమెకు తల్లిపోయింది. అప్పటికి వీర్రాజు వయసు ఇరవైతొమ్మిది. తల్లీదండ్రీ శతవిధాల నచ్చజెప్పారు. అత్తా మామా రెండవదాన్ని యిస్తామని ముందుకు వచ్చారు. దగ్గరవాళ్ళూ, దూరపువాళ్ళూ అనేక రకాలుగా సలహాలు యిచ్చారు. వీర్రాజు పెళ్ళికి ఒప్పుకోలేదు మల్లమ్మ సన్నగా అర్బకంగా ఉండేది. నల్లటి నలుపు! బారు జుట్టు! ఆ జుట్టుబరువు మొయ్యలేకే అలా ఉందా అనిపించేది. ఎప్పుడూ దేనికో దానికి ఏడుస్తూ, ముక్కు చీమిడి కారుస్తూ ఉండేదిట. ఊరికొసనున్న మిట్టమీద యిల్లు కట్టాడు వీర్రాజు. అక్కడ గాలీ వెలుతురూ పుష్కలంగా ఉండేది గాని నీరు ఉండేదికాదు. ఓ భుజాన కావిడీనీ మరో భుజాన మల్లమ్మనీ వేసు కొని ఊళ్ళోకి వచ్చేవాడు. అందరూ ఆయన్ని కొండింటి మామయ్యగారనేవారు. పదోయేటిదాకా—పిల్ల దక్కుతుందా దక్కదా—అన్నట్టుండేది. అలాంటి పిల్లను కంటికి రెప్పలా చూసుకుంటూ పెంచి, పెద్దచేసి, ఓ యింటిదాన్నిచేసి, పురుళ్ళుపోసి యింతదాన్ని చేసాడు.

అలాంటి మనిషి యీనాటికి ........

మల్లమ్మ పెద్దగా నిట్టూర్చింది.

తల్లి పరధ్యానంలో ఉండటంతో పిల్లల గొంతులు పెరిగాయి. ఆమె బుర్ర ఎత్తి 'వెధవల్లారా! చదూకోండి!' అంది.

గొంతుకలు కట్టేసుకున్నారు. కాని వాళ్ళ నవ్వులు ఆగటం లేదు. దొంగచూపులు చూస్తున్నారు. బుగ్గలు పొంగుతున్నాయి. నిద్రమత్తులో చిలిపితనం పెరుగుతోంది. ఒకరి చదువుకి ఒకరు అడ్డుపడుతూ చేతులు అడ్డుపెట్టి వెలుతురు పడకుండా చేస్తున్నారు. చేతుల నీడలను ఒకరికొకరు చూపించుకుంటున్నారు. ఉషారు హెచ్చింది. వాసు చెయ్యి చిమ్నీమీద పడింది. 'అమ్మోయ్—' అంటూ చెయ్యి నోట్లో పెట్టుకున్నాడు. గోపీ నవ్వులు బయట పడ్డాయి.

ఆ పళంగా మల్లమ్మ లేచి యిద్దరినీ చెరొకటీ బాదింది. ''వెధవసంత! వెధవల్లరి! నోరెత్తారంటే పీక పిసికేస్తాను. గోతిలో వెధవల్లారా!''

గట్టిగా అరిస్తే గుండె ఆగిపోతుందేమో అనిపిస్తోంది. యింటి చాకిరీకే ఆమె సత్తువ అంతా హరించుకుపోతోంది. ముగ్గురు పిల్లలు. రెండుగర్భస్రావాలు. వారానికి రెండుమార్లు యిల్లంతా అలుకుతుంది. ''ఓమారు చాల్లేవే'' అంటాడు మొగుడు. వినదు. శ్రీమహాలక్ష్మి శుభ్రంగా ఉన్న గడపలోకే అడుగెడు తుందిట. గవర్నమెంటువారి పుణ్యమా అని పదహారు కదుళ్ళ చరఖా దొరికింది. చన్నీళ్ళకు వేణ్ణీళ్ళు! మధ్యాహ్నంపూట నూలు తీస్తుంది దానిమీద. మొన్న మొన్నటిదాకా దాని ఆదాయం ఆ అప్పు చెల్లగొట్ట డానికే సరిపోయింది. యింట్లో కడుపులు పూడాలనేగదా యింత తాపత్రయ పడుతుంట! ఏం లాభం? పిల్లలు ఎదుగుతున్నారాయె. యిద్దరికీ ఒక్కదుప్పటే సరిపోయేది. రెండు కావల్సివస్తున్నాయి. ఎన్నిసార్లు కుట్టినా అవి పిగిలిపోతున్నాయి. రోజూ తడపటంతో భర్త లుంగీలు అట్టగట్టిపోతున్నాయి. చీరలు సరేసరి! అలుగ్గుడ్డల కన్న కనికిష్టంగా తయారయాయి. యీ దరిద్రపు బ్రతుకికి ఏదోనాడు మార్పు వస్తుందనే యింతకాలమూ అనుకొంది ...

బయట చూరు చప్పుడవుతోంది. పక్కింటివాళ్ళ గేదె కొమ్ము కొట్టినా, భర్త సైకిలు ఎక్కుస్తున్నా చప్పుడవుతుంది.

ఆలోచనల్లోంచి తెప్పరిల్లి బుర్ర ఎత్తి వీధిలోకి చూసింది. ఏ అలికిడీలేదు. పిల్లలు నిద్దరోయారు. లేచింది. పుస్తకాలు తీసి గూట్లో పడేసింది. ముగ్గురికీ పక్కలువేసి పడుకోబెట్టింది. లాంతరు వీధిగుమ్మంలో ఉంచింది. అరుగు దిగి, కనిపించినంతమేర రోడ్డువయిపు చూసింది. ఏవో కబుర్లు దూరంనుంచి వినవస్తు న్నాయి. వాళ్ళు దాటిపోయేదాకా అలాగే నిలుచుంది. పమిట బిగించి కప్పుకున్నా చలి ఆగటంలేదు.

లోపలికి వచ్చేసరికి గోపీ కాలు దుప్పటి చిరుగులోంచి బయటపడింది. వాడు దుప్పటి సరిచేసుకోటానికి కాళ్ళు కదిపితే మొత్తం దుప్పటి తొలగిపోయింది. కాళ్ళు నేలమీద ఉన్నాయి. మల్లమ్మ వాడిని చాపమీదకి ఈడ్చి దుప్పటి కప్పింది. గోనెగుడ్డ కాళ్ళదగ్గిర పరిచింది. గోపీ కలవరిస్తున్నాడు! ''కొండింటి తాతయ్య!.. కొం...డిం...టి''

ఆ నుదురుమీద ముద్దు పెట్టుకుంది మల్లమ్మ.

యింత ప్రేమగానూ చూసిన తండ్రి, తనలా నిరీక్షించే భార్య లేకుండా యిన్నాళ్ళూ గడిపిన తండ్రి ఆమెకు గుర్తు వస్తున్నాడు. ఆమె ఆ రూపాన్ని చెరిపేసుకొంటోంది.

''మల్లా! నీళ్ళు పట్రావే!''

భర్త గొంతు వింటూనే నీళ్ళతో బయటకి వెళ్ళింది.

దోవలో గాలిపోయిందిట. బురద! చీకటి! దిగడిందట.

''ఏముందన్నంలోకి?''

''కంది పచ్చడీ, చారు.''

''ఆకలి దంచేస్తోంది! క్విక్!''

ఆవురావురుమని తింటున్నాడు. కందిపచ్చట్లో చింతపండు వేస్తే అతనికి యిష్టం. పాపిష్టిది! తన పాదుపంతా అక్కడే తగులడింది! లేకపోవటాన్ని పాదుపు అనుకొంటోంది.

అతనితోపాటు భోజనానికి కూర్చోదు మల్లమ్మ. అతగానికి ఒక్క ముద్ద తక్కువవుతుందేమోనని ఆమె బెంగ! అవీ యివీ మాట్లాడుతుంటే 'ఊ! ఆ!' అంటోంది.

''ఏం...? రేపే వెళ్ళాలనుకుంటున్నావా ?''

''మీ గురించే ఎలాగా అనాలోచిస్తున్నాను.''

ఆమాట నిజంకాదని యిద్దరికీ తెలుసు.

''బావుంది! ఎప్పుడూ నువ్వు వెళ్ళలేదా? నే గడుపుకో లేదా ?''

''సర్లెండి! ఏదో చేస్తాను...!''

''నీ యిష్టం! పదిసేను తెచ్చాను! వడ్డీ లేదులే...!''

మొగుడు రొక్కించటం ఆమెకి యిష్టంలేదు. శలవు దొరి కాక యిద్దరూ కలిసే వెళ్ళవచ్చు. మొగుడి ఎదురుగా తండ్రితో ఏం మాట్లాడుతుంది ?

''మీరేం చెప్పటం లేదు!'' బుర్ర వంచుకొని వేలితో నేల మీద రాస్తూ అంది.

''ఏమిటి చెప్పడం ?''

''నే వెళ్ళటం మీ కిష్టం లేనట్టుంది!''

''అదేం లేదు...!''

అదే అతనిలో గుణం! వెళ్ళమనడు! వద్దనడు! మునుపు యీ గుణం ఆమెను యిరుకున పెట్టేదికాదు. ఈ పరిస్థితిలో తనో నిర్ణయానికి రాలేకపోతోంది. అతనే నిర్ణయిస్తే బాగుండును. వెళ్ళి కన్నతండ్రిని ఎలా నిగ్గదీస్తుంది? కూతురు కలగజేసుకోదగ్గ విషయమేనా?...అతను తేల్చలేదు.

''కుర్రాళ్ళూ...?'' మంచినీళ్ళు తాగుతూ అన్నాడు.

ఉట్టిమీద మజ్జిగ దించుతోంది. దిక్కుమాలిన చీమలు! పాతగుడ్డ తెచ్చి వడకడుతూ అంది.

''తల్లితోబాటే పిల్లలూనూ...''

ఇంతకు ముందు రెండు మూడుసార్లు వాళ్ళని వదిలేసి వెళ్ళనే వెళ్ళింది. కుర్రాళ్ళ మొహం చూసయినా తండ్రి కరుగుతాడని ఆమెకు తెలీకుండానే ఆశపడుతోంది. పిల్లలను ఎరవెయ్యటానికి తీసుకెళ్తున్నానన్న ఊహను అంగీకరించటం లేదు స్వాభిమానం. అందుకే జవాబివ్వటం అంత ఆలస్యమయింది.

వెంకట్రావు చేతులు కడుక్కుంటూ అన్నాడు.

''గొడవ పడకు!''

## 2

రైలు ఆగినపుడు గోపి నోటీసులు చదువుతున్నాడు. తమ్ముడు తప్పు చదివితే కోప్పడుతున్నాడు. అమ్మకానికి వచ్చే తినుబండారాల వైపూ తల్లివైపూ చూస్తున్నాడు వాసు. రత్న ఆ అరుపులని చిలక పలుకులు పలుకుతోంది ఆ పలుకులు అమ్మ విననందుకు అసహనం పెరుగుతోంది పిల్లలకు.

'గొడవపడే రకమా తను? అంతమాట ఎందుకు అనటం? అయినా పడితే పడుతుంది. తన తండ్రి! తన యిష్టం...'

రాత్రి అతను చెయ్యి వేసాడు. ఊరుకొంది. పిలిచాడు. కదిపాడు. లేవలేదు. ఊరుకొన్నాడు. జాలేసింది. లేచి అతన్ని గుండెలకు హత్తుకోవాలనిపించింది. యిదంతా అతనిమీద కోపమా? కాదు. అలా చిత్రించుకొంటోంది. గొడవ మనిషివన్నాడని తెగ గింజుకుంటోంది.

గొల్లుమంది రత్న. కిటికీలోంచి వంగి చూస్తోందని గోపీ కొట్టాట్ట. మల్లమ్మ వెనకాముందూ చూడలేదు ముగ్గురికీ వడ్డించింది. చుట్టు పక్కల వాళ్ళు ఊరుకోలేదు.

ఆ పిల్లల బుద్ధిమంతతనాన్ని మెచ్చుకున్నారు. తల్లి అశ్రద్ధ తగనిదన్నారు. ఏదో కొని పడేస్తేపోలా? అన్నారు. ఓ ముసలమ్మ మాటలు కలిపింది. ఓ స్టూడెంటు రత్నాన్ని భుజాన వేసుకుని నిద్ర పోగొట్టాడు వద్దంటున్నా వినక ఓ నడివయసు మనిషి జంతికలు కొని యిచ్చాడు. యిదంతా చూస్తూ—

''ఏ పాపం ఎరగని పిల్లలు! ఏ సంబంధం లేనివాళ్లే యిన్ని విధాల చూస్తున్నారు! ఆ పెద్దాయనకు ఆ మాత్రం లేకపోయింది వీళ్ళపట్ల'' మల్లమ్మ తండ్రిని నెప పెట్టుకుంటోంది.

రాజుపాలెం స్టేషనులో రైలు ఆగింది.

ఖాళీగా ఉంది ప్లాట్‌ఫారం. ఆ స్టేషన్‌లో గడచిన చిన్నతనం...తనను దిగబెట్టటానికి వచ్చే తండ్రీ ... ఆ కళ్ళలో నిండే నీరూ... ఒకదాని వెనక ఒకటి ఆమె మనసులో నిండిపోయాయి. ఉత్తరం రాస్తే చాలు! సెలవు పెట్టుకొని, ఆరున్నరకు వచ్చే బండికి నాలుగ్గంటలకే — కాఫీ కూడా తాగకుండా — వచ్చి ఎదురు చూస్తూ ఉండేవాడు.

ముసలి కూలీ ప్రశ్నల వర్షానికి జవాబియ్యలేక ముందుకు అడుగువేసింది. గోపీ వాసూ కూలీ వెనక అవీ యివీ చూస్తూ నడుస్తున్నారు.

'ఫ్యాక్టరీకి వెళ్ళిపోయే ఉంటాడు. ఇంట్లోకి అడుగు పెట్టనిస్తుందో లేదో మహాతల్లి —' చెదురుతున్న మనసు కూడ గట్టుకుంటూ మిట్ట ఎక్కింది. వాకిట్లో కనవచ్చిన దృశ్యం ఆమెకు భరించరాని అసహ్యాన్ని కలిగించింది.

పట్టె మంచం మీద పడుకుని ఉన్న వీర్రాజు కాళ్ళు పడుతోంది కాసులమ్మ. ఆమె మొహం వాకిటి వయిపు లేదు. అతని కళ్ళు మూసుకుని ఉన్నాయి.

గిర్రున వెనక్కి తిరిగింది మల్లమ్మ. అదే క్షణాన రత్న నిద్ర లేవటం, 'అమ్మా...!' అంటూ ఏడుపు అందుకోటం జరిగిపోయాయి.

'రామ్మా! రా!' అంటూ వీర్రాజు లేవబోయాడు. కాసులమ్మ ముందుకువచ్చి చేతిలో పిల్లనుఅందుకుంది. పిల్లను అందివ్వకుండా ఉండటానికి ఆమె స్వభావం సహకరించ లేదు. ఒక్కసారిగా ముంచుకు వచ్చిన దగ్గుతెరతో ఉక్కిరి బిక్కిరి అయిపోతున్న తండ్రి స్థితికి ఆమె గుండె గుబగుబలాడింది.

గోపీ, వాసూ రయ్యిన వెళ్ళి తాతయ్య పొట్టమీద ఎక్కేసారు. మల్లమ్మ వాళ్ళను లాగటానికి ముందుకు వెళ్ళింది. అదే సమయంలో కాసులమ్మ ఆ పనే చేసింది.

'ఈవిడగారు పిల్లలను దగ్గరకుకూడా రానీదు కాబోలు—' మల్లమ్మ ఫళ్ పళ్ ఫళ్ ఫళా నాలుగు చరిచింది పిల్లలను. ఆ అడావుడిలో గాజులు పగిలాయి.

''పిచ్చిగా నీ ఎక్కిందేమిటే నీకూ ...?'' ఆయాసపడుతూ పిల్లలిద్దర్నీ ఆమె నుంచి బయటకిలాగి కోప్పడ్డాడు వీర్రాజు.

'ఆహా! ఎక్కింది. నాకుగాదు. నీకు ...! దానికి ...!' నాలుక చివరిదాకా వచ్చింది. పిల్లలను లోపలకు తీసుకుపోయింది కాసులమ్మ.

''కూల్డబ్బులిచ్చెయ్ తల్లీ !'' కంగారుపెట్టేడు కూలీ.

లోపలున్న కాసులమ్మను చిల్లర తెమ్మని అరిచాడు వీర్రాజు.

''ఏదే ఉందండీ...! ఆ ! రూపాయుంది.''

రూపాయకు చిల్లరుంటే యింక లేనిదేముందన్నాడు కూలీ.

'ఇదో నాటకం ! కూలివాడికిచ్చే డబ్బులకుకూడా అడ్డుపడు తుంది కాబోలు...'

పెట్టె తెరిచి కూలి డబ్బులు యిచ్చేసింది మల్లమ్మ.

వచ్చిన దగ్గర్నుంచీ ఒక్క పలకరింపయినా పలకరించని కూతురి ప్రవర్తన పట్టించుకోకుండా అల్లుడి గురించి యోగ క్షేమాలు అడగటం ప్రారంభించాడు వీర్రాజు.

ముక్తసరిగా జవాబులు వస్తున్నాయి.

ఈలోగా పిల్లలు బెల్లం ముక్కలు తింటూ బయటకు వచ్చారు. వాసు తన బెల్లంముక్కను తల్లికిచూపిస్తూ 'ఒచ్చ్...! ఒచ్చ్...!' అంటూ ఊరించాడు.

''దిక్కుమాలిన బెల్లం ముక్కలు ! వెధవ ఆబ ! పురుగులు పట్టి చస్తారు ! పారెయ్యండి !'' తిట్టింది.

అయితే—ఆమె ఎవరికి దెబ్బ తగలాలని ఆశించిందో ఆ వ్యక్తి అక్కడ లేదు.

## 3

అప్పటికి మూడు రోజుల్నించీ వీర్రాజుకు విరోచనాలుట. పైగా దగ్గు. డాక్టరు ఫరవాలేదన్నాడుట. కాస్త నిమ్మళించింది.

పొయ్యిమీద ఎసరుపడేసి ఊళ్ళోకి వెళ్ళి కాసులమ్మ కూరలు తెచ్చింది. వస్తూ గ్లాసుడు పాలుతెచ్చింది. కొంచెం అన్నం పాలలో ఉడకబెట్టి బెల్లం వేసింది. వంకాయ అల్లంపెట్టి కూర చేసింది. బఠాణీలు గుండ కొట్టింది. మజ్జిగలో పోపు పెట్టింది. అంతా ముప్పావుగంటలో పూర్తయింది.

అందాకా బయటే కూర్చున్నారు తండ్రీ కూతురు. పిల్లలు పాత కాగితాలతో విమానాలు చేస్తున్నారు. వీర్రాజు చెప్పేది వింటోంది. తప్పనిసరయిన చోట జవాబిస్తోంది. అప్పటికప్పుడే మనసులో ఉన్నదంతా కక్కెయ్యాలని ఉంది ఆమెకు. వాళ్ళిద్దరిలో గాభరాగాని, సిగ్గుపడటంగాని లేకపోవటం మల్లమ్మకు ఆశ్చర్యంగా ఉంది: ఆశాభంగంగా ఉంది.

కాసులమ్మ తెలియని మనిషి కాదు —

దూరపు బంధువు. చెడ్డగా చెప్పుకుంటారు. మొగుడు లేడు. మంగలివాడు ఎవడితోనో లేచిపోయిందిట· వాడికి ఓబిడ్డను కన్నదనీ, ఆ పిల్ల ఎక్కడో ఉంటున్నదనీ అంటారు. ఆ మంగం కూడా పోయాక తిరిగి వచ్చిందిట. ఆ వంచనా ఈ పంచనాజేరి చాకిరీ చేసి బ్రతుకుతోంది. వయసు ఉడిగిపోయింది. ఎవడికి పని కొస్తుంది? అందుకే తిరిగొచ్చిందన్నారు

కాకినాడ పెద్దాసుపత్రిలో మొదటి పురుడయింది. ఖర్చుకి ఖర్చూ అయిపోయింది సుఖమూ లేకపోయింది. పైగా కాన్పు సులువు అవడంతో రెండో పురుడు యింటి దగ్గరే తలపెట్టాడు తండ్రి. అపుడే కాసులమ్మ మొదటిసారిగా ఆ యింటి గడపను ఎక్కింది. మల్లమ్మకు ఆవిడపట్ల చాలా జాలిఉండేది. ఎప్పుడూ విసుక్కొనేది కాదు. నోట్లో మాట నోట్లో ఉండగానే అన్నీ అమర్చేది. కాయం చేసేది. పిల్లడికి కాటుక చేసింది. చంటిపిల్ల గుడ్డలు కూడా ఉతి కేది. 'తల్లిలేని లోటు తీరుస్తున్నావ'ని కూడా అంది ఓమారు. మూడో నెలలో తనతోపాటే ఆమె కూడా బండి ఎక్కేసింది. ఆ తర్వాత తండ్రీ కూతురూ కలిసినపుడల్లా కాసులమ్మ మంచితనం గూర్చి ముచ్చటించుకోడం పరిపాటయిపోయింది.

'...నా వల్లకాదు మంచితనం ! అమ్మక్కగా యింత ముద్ద పడేసేటపుడు మంచిగా ఉండక చస్తుందా ?' కాసులమ్మ భోజనా లకు రమ్మన్నపుడు అనుకొంది మల్లమ్మ.

పరమాన్నం చూడగానే పిల్లల ఉత్సాహం పొంగి పొరలింది గాజు ప్లేటుతో మల్లమ్మ కంచం ముందు పెడుతూ ''పంచదార అమరలేదమ్మా !'' అంది కాసులమ్మ.

''ఖర్చవుతుంది మరి ! ఒక్కరు కాదుగా'' అటూ యిటూ చూసింది. రెండు మూడు గ్లాసులూ, పులుసుగిన్నె, కంచం, నూనె గిన్నెలూ, చంచాలు...కొత్తగా కనిపిస్తున్నాయి.

'ఈ స్టీలు ముంతలు లేకపోతే యీావిడగారికి ముద్ద దిగదు కాబోలు.'

బయట నుంచి వచ్చి పీట వాల్చుకు కూర్చుంటూ యాదా లాపంగా అడిగాడు వీర్రాజు —

''ఏంటే అంటున్నావ్ ?''

''నేనేం అనెయ్యటం లేదులే బాబయ్యా...!''

వడ్డన సాగుతోంది. పిల్లలు యిష్టంగా తింటున్నారు.

''వాపిరిగొట్టు వెధవల్లారా ...? ఎప్పుడూ తిండి మొహవేం ఎరగనట్టు...ఏవిటా తిండం ?'' అంటూ తిట్టింది.

''ఏవిటే ఆ తిట్టడం...'' తండ్రి గసిరాడు.

''నా పిల్లలను కూడా నేను తిట్టుకోకూడదంటావా ...?

''తిట్టుకో...! కొట్టుకో...! నీ ఇంటి దగ్గర.. ! నా ఎదు రుగా తిడితే నన్నే తిట్టినట్టుంది.''

మల్లమ్మ జవాబివ్వకుండా కూర కెలుకుతోంది.

''చిచ్చీ ! వెధవకూర !'' మొహం చిట్లించింది.

''ఉడకలేదా ?'' తండ్రి అడిగాడు.

''ఉడికింది ! నాకీ కూరంటే అసహ్యం...''

''పోనీ...అడిగే వండలేకపోయావా కాసులమ్మా!''

''మునుపు వంకాయ యిలా వండితేగానీ తినేదికాదు...''

''బావుంది ! మనుషులు ఎప్పుడూ ఒక్కలాగే ఉంటారా ఏమిటి?'' సూటిగా చూస్తూ అని ఆ కూర కంచంలోంచి తీసేసింది.

* * *

సాయంకాలం రత్నను తీసుకుని ఊళ్ళోకి వెళ్ళింది.

పండగకి నేస్తురాళ్ళింకా రాలేదు. మాస్టారి భార్య పోయిందిట. ఆయన కొడుకుల దగ్గరకు వెళ్ళాడుట. యిళ్ళన్నీ తిరుగుతూ పుల్లమ్మగారి యింటికి వెళ్ళింది మల్లమ్మ. అక్కడ మల్లమ్మకు అవసరమయిన సానుభూతి లభించింది.

కూతుళ్ళు కోడళ్ళలాగా, కోడళ్ళు పనివాళ్ళలాగా అగ్గగ్గలాడుతూ ఉంటారు పుల్లమ్మగారి ముందు. ఊరంతటికీ తగవరి అయిన భర్త ఆవిడముందు నోరు మెదపడు. ఆవిడతో మల్లమ్మ అనేకసార్లు గొడవ పడింది. 'ఊళ్ళో అడ్డమయిన గొడవలూ యీ విడికే కావాలి—' అని అసహ్యించుకునేది.

అలాంటి మనిషి—

''అవును పిన్నీ! ఎవ్వరడిగినా బుర్రదించుకోవలసి వస్తోంది'' అంది.

''అవ్వ! అవ్వ! ఏ కాలాన్నయినా చూసాంటే యిలాంటి విడ్డూరం ! నువ్వుగనక ... ఆ చెమా బెమాలేని తండ్రిమీద వ్యామోహంకొద్దీ ఆ గడపలో అడుగు పెట్టావు కానీ ..''

ఓ గంట అక్కడ ఉంది మల్లమ్మ.

చాలా మందికి తమకు నచ్చే తీరులో మాట్లాడే మనిషి కావాలి. కొందరికి తను మాట్లాడేది ఎదుటివాడికి నచ్చుబాటు అవాలి. మల్లమ్మకు మాట్లాడే మనిషి దొరికింది. పుల్లమ్మకు తన మాట నచ్చే మనిషి దొరికింది.

''వస్తాను పిన్నీ!''

''వెళ్ళిరా తల్లీ! కాగల కార్యం గంధర్వులే తీరుస్తారు. యీలోగా దాని నంగిరి నంగిరి మాటలు విని మాయలో పడక! బొత్తిగా పూచిక పుల్లలా తయారయావు! బెంగపెట్టుకుని చేసేదేమీ లేదు!''

యింటికి చేరేసరికి యిల్లంతా చీకటిగా ఉంది.

నట్టింట్లో దీపం పెట్టకుండా ఏ పెత్తనాలకు వెళ్ళిందో అనుకుంటూ గదిలో ప్రవేశించింది.

''బాబయ్యా! బాబయ్యా!''

తండ్రిగొంతుకకు బదులు తండ్రి మంచంమీంచి కాసులమ్మ గొంతు వినిపించింది. ''యిలా రామ్మా!''

''ఏంటయింది.''

''దీపం ఆరిపోయింది. ఆ గూట్లోనే అగ్గిపెట్టె కూడా ఉంది. వెలిగించు!''

ఈ విడగారికి రోగమేదో తగలడినట్టుంది! లైటు వెలిగించింది. ఆ వెలుతురులో కాసులమ్మను పరకాయించింది. ఆమె శరీరమంతా వణుకుతోంది. జ్వర తీవ్రత మొహంలో కన్పిస్తోంది.

''వంటయింది. దీపం వెలిగించా కానీ...కిరసనాయిలు లేక ఆరిపోయింది. ఆయన పిల్లలని తీసుకు కొట్టుమీదకు వెళ్ళారు...''

ఒక్కొక్క ముక్కా ఆగి ఆగి చెప్పింది.

వత్తికాలి మళ్ళీ ఆరిపోయింది దీపం.

''బాధ్యత గలవాళ్ళు కిరసనాయిలుందో లేదో ముందే చూసుకుంటారు... !''

కాసులమ్మనుంచి జవాబు రాలేదు. దగ్గరకు వెళ్ళింది. ఒంటిమీద చెయ్యి వేసింది. నిప్పులమూట ముట్టుకున్నట్టుంది. దుప్పటీ కప్పింది. యింకా వణుకుతోంది. యింకో దుప్పటీ కప్పింది.

''యింకా రాలేదా మీ నాన్నగారు?'' దుప్పట్లోంచి అంది.

ఆ కుటుంబంలో తండ్రిని 'బాబయ్య' అని పిలుస్తారు. 'నాన్న' అన్నమాట ఆమె చెవికి కటువుగా పరాయిగా ఉంది. జ్వరం మనిషిని ఏమీ అనలేకపోయింది.

తాతా మనవలు వచ్చారు.

''ఎక్కడికి తగలడ్డా కొందరి రాతలంతే! చేసే వాళ్ళెంత మంది ఉన్నా యింటెడు చాకిరీ నెత్తిమీద పడుతూనే ఉంటుంది.'' విసుక్కుంటూ ఆ సీసా అందుకొంది. భోజనాలు అయాక తండ్రికి వాసినసోలు కట్టింది. కాసులమ్మకు కాఫీ, నేడి మంచినీళ్ళు యివ్వటం ఆమెకు తప్పలేదు.

జ్వరం మనిషి చలిగాలిలో బయట పడుకోడం ఎందుకు అందానుకుంది. ఊరుకుంది. పిల్లల్తో గదిలోనే పడుకొంది మల్లమ్మ.

ఓ రాత్రివేళ మల్లమ్మకు మెలకువ వచ్చింది.

చావిట్లోంచి మాటలు వినిపిస్తున్నాయి. తండ్రిగొంతే తరచు వినిపిస్తోంది. కాసులమ్మ ఏడుపుమాత్రం అపుడపుడు వినిపిస్తోంది.

'వద్దు!' 'వెళ్ళొద్దు!' 'అదేం అనుకోదు...' 'నేను మాట్లాడులానుగదా!' అంటున్నాడు తండ్రి.

''ఇంతకాలమూ చేయించుకొని పంపెయ్యటం నావల్లకాదు కాసులూ ! అది ఉడుకుమోత్తనంలో ఉంది ... అదే సర్దుకుంటుంది...''

మల్లమ్మ నిద్ర పూర్తిగా తేలిపోయింది.

'కాసులూ!' అన్న తండ్రిగొంతు ఆమెకు నిలువెల్లా కారం రాసినట్టుంది. ''వెళ్ళి యిద్దరినీ పట్టుకుని జాడించేద్దునా ?''

'ఛూత్ ! ఎంత సిగ్గుమాలిన పనది !'

# 4

మల్లమ్మవచ్చి పదిరోజులయింది. తండ్రి ఫ్యాక్టరీకి వెళ్ళే దాకా యింట్లోనే ఉంటుంది. ఆయనతోబాటే నాలుగు మెతుకులు నోట్లో వేసుకుంటుంది. ఎవరిమీద ఏమాత్రం చికాకు కలిగినా పిల్లలని చావబాదుతుంది. తండ్రి కసిరితే మాట్లాడదు. ఆ తర్వాత ఊళ్ళోకి బయల్దేరుతుంది. మళ్ళీ కాఫీకి వస్తుంది. మళ్ళీ ఊరు! రెండుసార్లు కాసులమ్మకు పాలి ఊష్ణం వచ్చింది.

తండ్రి ఎదురుగా నిలబడి ప్రశ్నించటానికి అవసరమైన నిర్మోహమాటంగాని, మాటకి మాట పెంచి గొడవలు పడటానికి కావల్సిన కరకుతనం గాని ఆమెలో లేవు.

కాసులమ్మ నోరు మెదపకుండా అన్నీ చేస్తుండటం బాగానే ఉందిగాని అది మంచితనంగా అంగీకరించలేకపోతోంది. ''ఏ హక్కు పెట్టుకుని పోట్లాడుతుందిలే—'' అని సమర్థించుకుంటోంది.

ఆ రోజు మాస్టారు వచ్చారని తెలిసింది. పలకరించటాన్కి వెళ్ళింది. తండ్రి తరవాత తండ్రిలాంటి వాడాయన.ముసలితనంలో ఆయనకు కలిగిన కష్టానికి మల్లమ్మ చాలా బాధపడింది.

''అత్తయ్యగారు పోయారని తెల్సాక చాలా యిదయాను మాస్టారూ !''

పిల్లకు కాస్తంత పంచదార ప్లేట్లోవేసి యిచ్చాడు. అది తిండిరంధిలో పడ్డాక వాళ్ళు మాటలకు దిగారు. 'చనిపోయినవాళ్ళు పుణ్యాత్ములనీ బ్రతికున్నవాళ్ళే పాపాత్ములనీ' మాస్టారు దిగులుగా అన్నారు

పండగ గడుపుదామని పిల్లల దగ్గరికి వెళ్ళాట్ట. కోడళ్ళు పుట్టిళ్ళకు వెళ్తున్నారుట. కొడుకులు వాళ్ళవెంటే ఉండటం 'ధర్మం'. 'తగుదునమ్మా' అంటూ వాళ్ళు రమ్మంటేమాత్రం ఎలా వెళ్ళగలడు? ఆ నాల్రోజులూ ఓ స్నేహితుడి యింట్లో భోజనం కుదురుస్తానన్నాడుట ఓ కొడుకు. రెండోవాడు అదీ అనలేదుట. అంతా చెప్పి—

''వాళ్ళనిమాత్రం తప్పు పట్టాల్సిన పనేముందమ్మా! తను పెట్టా పెట్టడు... అడుక్కుని తినాలియ్యడు . అన్నట్టు వాళ్ళ కేద యినా చేసే ఓపిక నాకెల్లాగూ లేదు...''

''పెట్టుపోతలదేముంది మాస్టారూ... మీ వెర్రి గాని...''

''నువ్వు ఆడపిల్లవి తల్లీ! తండ్రి తిన్నాడా లేదా తలి బట్ట కట్టుకుందా లేదా...అన్న బాధ ఆడదానికి ఉన్నట్టు మగవాడికి ఉండదమ్మా. కాలొంగినా కన్నొంగినా 'నా బంధో' అంటూ చేర దీసేది ఆడపిల్లే...!''

మాస్టారి మాటలు మల్లమ్మ మనసుని కదిపాయి.

''మాట వచ్చింది గనక చెపుతున్నాను. ఆడది మగాడి మీద ఒకందుకు ఆధారపడితే మగాడు ఆడదానిమీద మరొకందుకు ఆధారపడేటట్టు భగవంతుడు చేయటంలోనే అంతా వుంది. అయితే మగాడు ఆడదానికిచ్చేదాన్ని ఆడది సంపాదించుకోటాన్కి అవకాశముంది కాని, ఆడది మగాడికి యిచ్చేదాన్నిమాత్రం మగాడు ఏంచేసీ సంపాదించుకోలేడు. వయసు ఉడిగాక, చేసే దిక్కులేని మగాడిబాధ పగవాడిక్కూడా వద్దు! ఈ విషయంలో మీ నాన్న చేసింది చాలా మంచిపని...''

''ఏం మంచి మాస్టారూ! నలుగురూ నవ్వుతున్నారు...''

మల్లమ్మ దొరికిపోయింది.

''ఎవరమ్మా ఆ నలుగురూ...? ముప్పయ్యేళ్ళబట్టీ లేని ఆడదాని అవసరం యీనాడు వచ్చిందంటే నువ్వెలా నమ్మావ్? పండగపూటయినా పిలిచి పట్టెడు మెతుకులు పెట్టని నలుగురూ... ఆయన నడుం వంగి చేసుకోలేనపుడు ఓ మనిషిని చేరదీస్తే తప్పు పట్టడానికి బయల్దేరారా? ఆ మనిషి చిన్నదా ? చితకదా? ఆయనకన్న ముందో వెనకో అన్నట్టుంది. ఏదో... వాళ్ళు బ్రతుకు వాళ్ళు బ్రతుకుతున్నందుకు...సంతోషించడంపోయి ....!''

''అందరూ మనంత మంచిగా ఉంటారా మాస్టారూ...'' నసిగింది.

''మంచి! మనది మాత్రం ఏపాటి మంచి? అదేదో విడ్డూరంగా మాట్లాడుకోటం లేదూ...? లోపల్లోపల కోపాలు ఉంచుకోటం లేదూ...?''

ఆఖరు మాట కావాలనే అన్నట్టుతోచింది మల్లమ్మకు. ఆ మాటా యీ మాటా మాట్లాడి యింటి మొహం పట్టింది.

యింటికి చేరేసరికి తలదిమ్ముగా ఉంది. వంటగదిలో ఉంది కాసులమ్మ. పిల్లల అలికిడి లేదు. పెరట్లో ఉండుంటారు. ఒకట్లో ఏ పురుగయినా అంట బొడుస్తుందేమో !! వెదికే ఓపిక మల్లమ్మకు లేకపోయింది. రన్నను జోకొట్టి నిద్రపోగొట్టింది.

మాస్టారి మాటలు ఆమెను విడువటం లేదు. కలగజేసుకుని పనిలో సాయపడే తను యిక్కడ పూచికపుల్ల అక్కడ పెట్టటం లేదన్న నిజం ఆమె గుండెల్లో ముల్లులా ఉంది.

ముగ్గతో చిమ్నీలుతుడిచి దీపం బుడ్లల్లో కిరసనాయిలు పోసింది. ఆరేసిన బట్టలు తెచ్చి మడతలు పెట్టింది. మంచాలు వాల్చి పక్కలు వేసింది. చలిఒంపటిలో ఎండిన పేడముద్దలు వేసి తండ్రి కోసం సిద్ధం చేసింది.

కాసులమ్మ వచ్చేసరికి అన్ని పనులూ పూర్తయి ఉన్నాయి. మంచం మీద పడుకునుంది మల్లమ్మ. రెండుసార్లు పిలిచి జవాబు రాకపోయే సరికి ఒంటిమీద చెయ్యేసింది.

''ఏ హక్కూ లేక యిలా కక్క లేక మింగలేకా అణిగిమణిగి ఉంటోంది కాని...యీావిడ మాత్రం మంచిదా ?'' అనుకుంటోంది అప్పుడే.

'చల్లగానే ఉంది' అనుకుంటూ పెరట్లోకి వెళ్ళింది. పిల్లలను తీసుకువచ్చి 'అమ్మనిద్రోతోంది' అంటూ హెచ్చరించింది. వాళ్ళు 'అమ్మమ్మా !' అంటూ ఎవరో చెప్పి పెట్టినట్టు పిలవడం మల్లమ్మకు కష్టంగా ఉంది. 'ఆఖరికి పిల్లలని కూడా లోంగ దీసేసు కుంటుంది కాబోలు !'

పొందికగా కూర్చుని పాత సినిమా పాటల పుస్తకాలను తీసి పేర్లు చదువుతున్నారు గోపీ, వాసు. అవంటే మల్లమ్మకు ప్రాణం. తండ్రి ఫ్యాక్టరీ నుంచి వచ్చేదాకా పాడుతూ కూర్చునేది అలాంటి పుస్తకాలను వాళ్ళుపాడు చేస్తారేమో... ! ఆమె లేవలేదు

''జాగర్త ! చిరిగితే అమ్మ చంపేస్తుంది.''

''ఛీ ! అమ్మ చెడ్డది ! అత్తమానూ కొడుతుంది.''

''మనూళ్ళో చదూకోపోతేనే కొట్టేది ! ''

పిల్లల కబుర్లు ఆమెకు ఆసక్తికరంగా ఉన్నాయి.

''పుల్లమ్మామ్మ చెప్పింది. తాతయ్య డబ్బులన్నీ అమ్మమ్మకే యిస్తాట్ట. అందుకే అమ్మకి కోపంట.''

''బిస్కత్తులూ, డబ్బులూ బోల్డు యిత్తున్నాడేం !''

''పాపం ! అమ్మకి యివ్వట్ట ... ! ''

కొరడా దెబ్బ తగిలినట్టయింది మల్లమ్మకు.

కాసులమ్మ నెమ్మదితనం చూస్తూనే ఉంది అది మంచి తనమని ఒప్పుకోవటం లేదు. తండ్రికీ ఆమెకూఉన్న బంధం ఎవరికీ ఏ నష్టమూ చెయ్యదని తెలుసు. అది నీతికి సంబంధించినదనుకోటం తన కల్పన. అది అంగీకరించటం లేదు. యిలా ఒప్పుకోకపోటానికి కారణం ? పిల్లల నోట వినిపిస్తున్నది ఆమె గుండెలను రంపపు కోత కోస్తోంది.

యింతో అంతో ఆస్తిలభిస్తే తన జీవితం కాస్తంత మెరుగవుతుందని ఆశ. ఆ ఆశలో తప్పేం లేదు.

ఆ ఆశకు విఘాతం కలుగుతుందేమోనన్న భయాన్ని బహిరంగపరచలేక పోతోంది. 'నీ తదనంతరం ఆస్తి నాకే వచ్చే హామీ ఉంటే యీా జరుగుతున్నదానికి నేనేం బాధపడనుబాబయ్యా!' అన్న ముక్క ఎలా అంటుంది ?

దరిద్రం ! దరిద్రం ఎంత పనిజేస్తుంది !!

ఏ మంచి తనాన్నయినా ఎలా అణిచివేస్తుంది !!!

యిన్నాళ్ళు బట్టి తండ్రిని ఆమె కష్టపెట్టడం గుర్తు వస్తోంది. కన్నీరు ధారలు కట్టింది. తండ్రి వచ్చి లేపేదాకా అలాగే ఉండి పోయింది.

# 5

భోగినాడు ఉదయమే యింటిల్లిపాది తలగిడుగులూ పూర్తయాయి. కలిగినంతలో వీర్రాజు అందరికీ బట్టలు కొన్నాడు. వెంకటావు టిఫిను తింటుంటే దగ్గర కూచుని కబుర్లు చెబుతోంది మల్లమ్మ. అది ఆమెకు సరికొత్త అనుభవం ! కాసులమ్మ వంటంతా చూసుకోటంతో దగ్గరుండి భర్తకు పండగ పూటా టిఫిను పెట్టగలుగుతోంది.

''ఓమాట అడుగుతాను.''

ఉప్మాలో జీడిపప్పుపలుకు ఆమె నోటికి అందిస్తున్నాడు.

''మాట్లాడరేం ?''

''అడగదల్చుకున్నప్పుడు అనుమతి ఎందుకూ ?''

భర్త హాస్యాన్ని ఆమె అందుకోలేదు.

''మా బాబయ్య గురించి... '' నసిగింది.

''ఊ ! మీ బాబయ్య గురించి ...? ''

అతను అసహ్యించుకుంటున్నాడేమో ఆమెకు తెల్సుకోవాలనుంది.

''ఏం లేదు లెండి !'' అనుకున్నట్టే అతను రెట్టించ లేదు.

''మీరో పని చెయ్యాలి!''

''తప్పకుండా ! రాణీగారి ఆజ్ఞ !''

''జాకెట్టూ చీరా పసుపూ కుంకం. . . కావాలి ''.

నాళ్ళిద్దరూ డబ్బు లెక్కలు వేసారు. కూడారు. తీసేసారు.

పెద్ద పండగనాడు మధ్యాహ్నం తండ్రి పెట్టిన చీర కట్టుకొని వస్తూ ఓ పళ్ళెంలో తను తెప్పించినవన్నీ పట్టుకొచ్చింది మల్లమ్మ.

ఆమె మాటలు వింటూ ఆశ్చర్యపోయింది కాసులమ్మ.

''అవునమ్మా ! యీా వేళ మా అమ్మ తిరిగి వచ్చినట్టుంది నాకు. పచ్చగా పసుపురాసుకొని యింత బొట్టు పెట్టుకొని బాబయ్య పక్కన నిలబడితే కళ్ళారా చూడాలనుంది. నా మాట తిసెయ్యకు!''

వీర్రాజు కళ్ళు తడిదేరాయి.

భర్తతో కలసి వాళ్ళ పాదాలకి వంగి వాటిని తాకి మరీ నమస్కరించింది మల్లమ్మ.

ఆ సమయంలో ఆ మధ్యతరగతి బీద మహిళ మనసులో 'యిదంతా తండ్రి ఆస్తి కోసం వేస్తున్న సరికొత్త ఎత్తు కాదు గదా' అన్న కించా భావం మెదులుతూనే ఉంది.

ఏ కారణాలవల్లనయితేనేం — కొండమీది ఆ యిల్లు ఊరంతటికన్న ఎత్తుగానే ఉంది !



# ప్రజలూ - ప్రజాకవీ

## [రూపకం కం కవిత్వం]

డా. నరసింహారెడ్డి

### రంగం

అనంతపురం కృష్ణకళామందిరం.

### పూర్వ రంగం

"'కళాసంస్థ' వారు శ్రీమాన్ వామనరావును భాగ్యనగరం నుంచి బెంగళూరుకు విమానంలో, అక్కడ్నుంచి 'ఫస్ట్‌క్లాస్ కోచ్'లో అనంతపురానికి ఆహ్వానించి, సభ పెట్టి, దుశ్శాలువా కప్పి, దండలతో మెడ నిండించి, (ఆ మెడబలిష్టం కాబట్టి సరిపోయింది గానీ లేకుంటే కవిగారు ప్రజా పవిత్ర పాదధూళి కళ్ల కద్దుకొనే వారు) పర్చిచ్చి, 'ప్రజాకవి' అనే బిరుదు ప్రదానం చేస్తారు.

### ప్రజా కవి

సోదర ప్రజలారా ! సోదరీ మణులారా ! ! నా కవిత్వగానం చేయబోయే ముందు కొన్ని మాటలు మీతో మనవి చేస్తాను. నాకు 'ప్రజాకవి' బిరుదాన్నిచ్చి సత్కరిస్తున్నందుకు ఈ కళా సంస్థకు నేనెంతైనా కృతజ్ఞుడ్ని. నేను మీ అందరివాడ్ని. వివిధ వర్గాల ప్రజల్ని గురించి యీ సభాస్థలిలో కవితాగానం చేస్తాను. ఆయా వర్గాల ప్రతినిధులు ఈ వేదిక నెక్కి వారి కష్ట నిష్ఠూరాలు చెప్పుకోవాలని మనవి. తద్వారా మీ మీ ఇబ్బందులు నా కవిత్వంలో ప్రతిబింబిస్తాయి. ఇక నా ప్రజా కవిత్వం చిత్తగించండి.

*    *    *

### ప్రజా కవి

కర్షకా ! ప్రజా ప్రహర్షకా ! !
రైతే రాజురన్నా !
యీ కాలంలో, లోకంలో.
రైతన్నే వెన్నెముక
మన యీ దేశానికీ, మా యీ దేహానికీ.
కృషి చేసి కూడు పెట్టే కిసానులు మీరు
మట్టి పిసికి, మా కోసం పసిడి పండిస్తున్నారు
మీ భాగ్యమే మా సౌభాగ్యం
మీ ఆనందమే మాకు బ్రహ్మానందం.

### రైతు

ఆపండి కవి బాబా ! మీ కవిత్వ సిత్తాన్ని
'రైతే రాజు' అన్న నిన్నటి రాజకీయ రాణాలు
మా వోట్లతో గద్దెల మిద్దె లెక్కి
మా కండ్లల్లో దుమ్ము తూరిపిస్తున్నారు
మా ఎముకలు సున్నం చేసుకొని
కండలు కరిగించుకొని
కాలుపెడితే కరిసే పుష్య మాసం బుడదలో
దున్నపోతుల్తో దుక్కి దున్నీ, దున్ని
వగిసి పెండ్లాన్ని ఇంటిలో ఇడి సొచ్చి
క్పైల తోలలేదా ? కాలవ జాములు కట్టలేదా ? ?
పగులనకా, రేయనకా !
మొబ్బనకా, మోడ మనకా ! !
మోటు సేద్యము చేసినాము
మోసపోయి వగుస్తున్నాము.
రేతిర్లు జడివానల్లో, పొగ మంచుల్లో
కంటి మింద రెప్పెయ్యకుండా కావిలి కాసి
పంట పండించినాము
ఇంట జేర్చినాము.
మేమూ, మా ఆడోళ్ళూ
గొడ్ల గందరంలో తాన మాడినాము
పెద్దోళ్లు బీరు పీపాల్లో మునిగినట్లు
అష్టకష్టాలూ పడి ఆరవచాకిరీ చేస్తే
వడ్లకు దుడ్లు రావు
చెరుకు వంట చెరుకయింది
బెల్లం నాటుసారా యయింగి
కూరగాయలు గొడ్లకు పెట్టుకున్నాం
బండ్ల బాడిగెలు గిట్టుకోక
అయ్యా ! కవి గారూ ! !
మా కష్టాలకు పలము నష్టాలా ?
కిసానుల కన్నా సానులే మేలు బాబా !
సానుల్ది సరుకు మంచి దయితే

మేలుదర గిడ్తుంది.
మా సరుకు మంచి దయినా
డీలు దరే పలుకుతుంది డీలరు ముండా కొడుకుల దగ్గర
కారు కారంతా, పిల్లా జెల్లా, గొడ్డూ గోదా
చెమటా, రగతమూ దారపోసి పండిస్తే
మా దాన్యం దర యాపారి నాయాండ్ల
లాబం కన్నా ఎప్పుడూ లొటలొటే గదా
యాపారి నాకొడుకులు మిద్దెల మింద మిద్దెలు
కట్టేస్తున్నారు మా దాన్నంతో,
రైతులు ఇల్లుపీకి పందిరేసుకుంటున్నారు తిప్పులకుప్పల్లో
మేం పండించిందల్లా మురి కగ్గవే
కొనాల్సిందీ, తినాల్సిందీ మాత్రం కొరివి కారెమే.
రైతు వెన్ను ఎముక కాదు బాబూ
మీరంతా పోటీలు పడి గతికే వెన్న ఎముక.
కూడు పెట్టే రైతుల్ని గోదు పెడ్తాంది గవరమెంటు
వద్దు బాబూ! వద్దు! మాకీ ఎద్దు మొద్దు బతుకులు
ఎద్దు ముడ్డి పొడిసి ముద్దలు మింగే మొరటోళ్లం
మా గోడూ, గొడవా ఎవరి క్కావాలి బాబూ ?
ఎవరి క్కావాలి ? ?

## ప్రజా కవి

అట్టడుగు బడుగు ప్రజల్లారా !
హరిజన సోదరుల్లారా ! ! మన మంతా ఒకటే ! !
ప్రాగేది మానండి ! ఆడేది ఆపండి ! !
దర్జాగా బ్రతకండి తమ్ముళ్లారా !
ప్రభుత్వ సూర్య కృపా వికసిత తమ్ముళ్లారా ! !

## హరిజనుడు

అయ్యా ! పరజాకవీ ! నమసకారం.
'మన మంతా ఒగటే' అని మాట మీరకండి !
ఆ మాట కుతికెలో నించి వస్తాంది, గానీ
కడుపులో నుంచి కాదు.
ఒగ రకంగా సూస్తే,
మీరూ మేమూ సమాన్లమే.
మీరూ, మేమూ ఏసుకొనేది సీమ సరుకే
కాక పోతే కాస్సెంత తేడా
మీరేమో సీమ నీటు సరుకు,
మాదేమో రాయల సీమ నాటు సరుకు
మీరూ మేమూ తినేది గొడ్డుసీలే
మీరేమో ప్యాసనుకూ, మేమేమో పొట్టకూ.
ఇసిపెట్టాకులు ఇసిపెట్టేయ్ మంచి రా బాబుగారూ
మీరు 'లబ్బు'ల్లో ఆడేది ఆ యాటే గదా
మీకో నాయం మాకో నాయమా బాబూ ?
ఎన్నాళ్లు పెడతార్లే అయ్యా కస్టాలు
ముందుందయ్యా మీ 'పెద్దల పండగ'
నాకూ గవర మెంటోళ్లు కత్తులూ, కటార్లూ
మరీలెలూ, పిడి బాకులూ
తుపాకులూ, తూటాలూ యిస్తారంట
మొన్న 'లేడియా' చెప్పిందిలే.
అప్పుడు సూస్కుందాం
మన కతలు తేల్సుకుందాం
అయినా, కవి బాబూ!
ఇప్పుడు ఊరికే మాకెందుకు మీతో మాట్లాట.

## ప్రజా కవి

సోదరురాలా ! చోర వీరుల్లారా ! !
''దొంగతనం తప్పురా ! దోపిడీలు ముప్పురా'', అని
శల విచ్చాడు ఓ సినీ మహాకవి ఏ నాడో
చేయకండి దొంగ తనాలు !
చేయరండి దొరతనాలు ! !

## చోరుడు

ఆగవయ్యా సామీ !
ఆపాపు నీ ఉప న్యాసం ! !
మీ పెద్దోళ్లే గదా—దూరేది దొమ్మర గుడిశలూ
దోచేది ప్రజల సొమ్ములూ.
కడుపుల కోసం, ఉడుపుల కోసం
జేబులు కత్తిరిస్తాం మేము.
మందు కోసం, ముందు కోసం
మంచి కుతికెలు ఉత్తరిస్తున్నారు మీరు.
మేము దొంగలమే అయ్యా !
అనుమానం లేదు.
మీరో! దొంగల కొడుకులు ! !
మీ నాయనోళ్లు ఎందరి గొంతులు
తడిగుడ్డల్తో కోయంపే,
మీరు...యీ పొద్దు
పడవలంత 'ఫారిన్' కార్లలో
షికార్లు కొడుతున్నారు
డాలర్లలో మునుగు తున్నారు

దేశాన్ని ముంచుతున్నారు
అయినా ! యిదేం నాయం బాబా
మా బోటి చోటా దొంగలకు జైలు
మీబోటి దొరదొంగలకు జైజైలు.

## ప్రజా కవి

అయ్యా ! కార్మికా ! ధనుర్విముక్తకార్ముకా ! !
సమాజ వినాశకాలు,
ఉత్పత్తికి విపత్తులు.
సమ్మెలు...వద్దు.
కష్టపడి పని చేసి,
ఘర్మజలం చిందించి,
ఉత్పత్తి ఎక్కువ చెయ్యండి.
దేశాన్ని నడిపించండి ముందుకు
దేశంతో పాటు మీరూ పదండి ముందుకు
ముందు ముందుకు.

## కార్మికుడు

అయ్యా ! కవి గారూ !
చెవి నేసుకుంటారా మాగోడు.
కర్మం మాది, ఘర్మం మాది
భర్మం మాత్రం ఓనర్లది.
చెర్మం మాది-చెప్పులు వాళ్లవి
మా బతుకులు నూతిలో కప్పలు
మీ తిప్పలు కుప్పలు తిప్పలు
మా జీతాల గొర్రెల తోకలు
వేలే పోతుందో, కాలే పోతుందో
పనిలో.. పాణమే పోతుందో
యంత్ర పిశాచి ఏ నిమిషంలో
యములాడిని చూపిస్తుందో,
ఎవరి కెఱుక ?
దినదిన గండం నూరేళ్లాయుస్సు మాది
దేశం ముందు ముందుకు పురోగమిస్తున్నా
మేము వెనిక్కి వెనిక్కి తిరోగమిస్తున్నాం
దేశం ఉత్పత్తిలో పురోగమిస్తున్నా
మా బతుకుల్లో శాంతి, కాంతి, తిరోగమిస్తోంది.

## ప్రతినిధులందరూ ఏక కంఠంతో..

అయ్యా ! కవి గారూ ! !
మా గోడూ, గొడవా మీ కెట్లా తెలుస్తాయి
ఒక్కసారి మా గుడిశెల్లో దూరితిరా ?
ముక్కు మూసుకుంటారు, మురిగ్గా ఉందని.
'ఇంత ఇరుకు బతుకులా ! బాబోయ్' అని
కండ్లు మూసుకుంటారు చూళ్లేక.
వీళ్లకు నాయం జరిగే దాకా,
అవాకులూ చెవాకులూ వాగకూడదని
నోరు మూసుకుంటారు.
ఆకలిని నిగంటువుల్లోనే చూసిన మీరు
ఆకలి కేకల కవిత్వం రాయకుండా ఉంటారు.
కవిగారూ ! ప్రజాకవినని
పది మందితో చెప్పుకోకండి
అదే మీరు మాకు చేసే మేలు
అదే మాకు పదివేలు.

* * *

## ప్రజా కవి

సోదరులారా ! ఇంతసేపూ దండలతో నా మెడ వంగిపోయింది. ఇప్పుడు సిగ్గుతో వంగిపోతోంది. ప్రజల కష్టాలు తెలియని నేను 'ప్రజాకవి' బిరుదును ఇప్పుడే త్యజిస్తున్నాను. పేదల ఉపయోగార్థమై ఈ 'పర్సు' కూడా సంస్థ వారికే తిరిగి ఇస్తున్నాను. నా కళ్లు తెరిపించినందుకు ప్రతినిధులకు ధన్యవాదాలు. అందరికీ వందనాలు.

తె ర వా ల్తుం ది.



శ్రీ విశ్వనాధం బత్తినేని

# మన రాజ్యాంగములో ప్రాథమిక విధులు

## ఒక విమర్శనాత్మక విశ్లేషణ

"మన రాజ్యాంగము నిజమైన ఒక మంచి ప్రజాస్వామ్యానికి పునాది వేసింది. స్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాతృత్వము మరియు సాంఘిక న్యాయం అనే నాలుగు మహదాశయాల సాధన మన లక్ష్యమని ఉపలక్షిస్తున్నది. వ్యక్తి స్వేచ్ఛకు మరియు గౌర వానికి భంగంవాటిల్లని విధంగా నూతనసమాజాన్ని మనం నిర్మించు కోవాలని ప్రకటిస్తున్నది."[1]

మన భారత రాజ్యాంగ చరిత్రలో 1975 మరియు 1976 సంవత్సరములు చాలా చీకటి రోజులుగా అనేకులు వర్ణించారు. అప్పటి కేంద్ర ప్రభుత్వము రాజ్యాంగ విధ్వంసకు వివిధ రకాల చర్యలు తీసుకోవడమే దీనికి గల కారణము. అట్టి వాటిలో భాగం గానే క్రొత్తగా రాజ్యాంగానికి తేబడ్డ 42వ సవరణ చట్టం (1976). ఇటీవలి కాలంలో కేంద్రంలో క్రొత్తగా అధికారంలోకి వచ్చిన జనతా ప్రభుత్వం ఈ సవరణ చట్టంలోని అభ్యంతరకర మైన మరియు అపాయకరమైన అనేక అంశాలను తొలగిస్తూ 45వ రాజ్యాంగ సవరణ బిల్లును పార్లమెంట్‌లో ప్రవేశపెట్టి ఆమోదింపజేసింది. కాని 42వ రాజ్యాంగ సవరణ చట్టంలోని ప్రాథమిక విధుల అధ్యాయాన్ని యధాతథంగా ఉంచింది.

ఈ వ్యాసంలో ప్రాథమిక విధుల అధ్యాయం ఏ పరిస్థితులలో రాజ్యాంగములో చోటు చేసుకొన్నదో, దాన్ని యధాతథంగా రాజ్యాంగ ములో ఉంచడమువల్ల చట్టపరంగా మరియు ఇతర విధంగా ఉత్పన్న మయ్యే చిక్కులేమిటో సోదాహరణంగా చర్చించడము జరిగింది.

దేశంలోని వివిధ స్థాయుల్లోగల ప్రభుత్వాలు దేశ సాంఘిక మరియు ఆర్థికాభివృద్ధికి అనేక రకాల కార్యక్రమాలను చేపట్టి అమలుపరుస్తున్నవి. దాదాపు 27 సంవత్సరాల రాజ్యాంగ చరిత్ర గడిచిన తర్వాత మన రాజ్యాంగములోని అనేక ప్రకరణాలు అభివృద్ధి కార్యక్రమాల అమలుకు ప్రతిబంధకాలుగా ఉన్నాయని, దేశంలో సామ్యవాద తరహా సమాజ స్థాపనకు మన న్యాయస్థానాలు మరియు కొన్ని వర్గాల ప్రజలు అనేక విధాల ఆటంకాలను కల్పించడము జరుగుతున్నదని, పర్యవసానంగా ప్రభుత్వాలు ప్రజల కిచ్చిన వాగ్దా నాలను నిలబెట్టుకోలేక పోతున్నాయని, తక్షణంగా రాజ్యాంగానికి అవసరమైన మార్పులు చేయడంద్వారానే దేశం ఎదుర్కొనే సమస్య లన్నింటిని పరిష్కరించుకోవడము సాధ్యమని, అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వాలు, ఆ పార్టీ నాయకులు అభిప్రాయపడ్డారు. దేశంలో బహిర్గతమైన మరియు ఆంతరంగికమైన అత్యవసర పరి స్థితి నిరాఘాటంగా అమల్లో ఉన్న ఆ రోజుల్లో, రాజ్యాంగ సవర ణలు, కేవలం కాంగ్రెస్ పార్టీకి సంబంధించిన విషయంగా భావించి, అప్పటి ఆ పార్టీ అధ్యక్షులైన దేవకాంతబారువా, శ్రీ స్వరణ్‌సింగ్ అధ్యక్షతన పదిమంది పార్టీ సభ్యులతో, ఒక రాజ్యాంగ సవరణల సంఘాన్ని నియమించారు. దానికే స్వరణ్‌సింగ్ కమిటి అని పేరు. అనతి కాలంలోనే, ఈ కమిటి రాజ్యాంగములో మార్పులకై మూడు తాత్కాలిక నివేదికల్ని పార్టీకి సమర్పించింది. ఈ మూడు నివేదిక ల్లోనూ, ప్రాథమిక విధులకు సంబంధించిన ఎట్టి సిఫారసులు లేవు.

రాజ్యాంగంలో ప్రాథమిక విధులను పేర్కొనడమంటే, మరీ అతిగా పోవడమే అని కమిటి తొలుత భావించింది. అందువల్లనే, వారి తొలి నివేదికల్లోగాని, తర్వాత పార్టీకి సమర్పించబడ్డ పునః సమీక్షించిన ముసాయిదాలోగాని, ఈ విషయం ప్రస్తావనకురాలేదు. అటుమీదట, జరిగిన ఆలిండియా కాంగ్రెస్ కమిటి చర్చలలో ఇది ఒక రూపం దిద్దుకుంది.

రాజ్యాంగము మరియు రాజ్య శాసనాల ప్రకారం వ్యవహరించి, జాతికి విధేయులై జాతి ఏకరూపత మరియు సమైక్యతలను నిల బెట్టి శక్తివంతం చేసేటందుకు, జాతి జీవనవిధానంలో క్రమశిక్షణ పాటించి, చిత్తశుద్ధితో ప్రభుత్వ ఆస్తుల్ని పరిరక్షించడానికి సంబం ధించి, పౌరులకు కొన్ని ప్రాథమిక విధులను రాజ్యాంగంలో పొందు పరిచే విషయమై, కొన్ని ప్రతిపాదనలు చేయవలసిందిగా స్వరణ్ సింగ్ కమిటీని కోరుతూ, చివరి నిమిషంలో, ఆలిండియా కాంగ్రెస్ కమిటి, హడావిడిగా ఒక తీర్మానాన్ని ఆమోదించింది.[2] అతి స్వల్ప వ్యవధిలోనే, కమిటీ ఈ మేరకు, 8 ప్రాథమిక విధులను సిఫారసు

చేస్తూ, తన చివరి నివేదికను సమర్పించింది. కమిటి సిఫారసు చేసిన 8 ప్రాథమిక విధులు, వరసగా :

1 ''మన రాజ్యాంగము పట్ల, దేశ చట్టాల పట్ల పౌరులందరు గౌరవం, విధేయత కలిగి ఉండవలె.

2 దేశ సార్వభౌమత్వాన్ని, సమైక్యతను పౌరులందరు పరిరక్షించవలె.

3 రాజ్యాంగములో పేర్కొన్న ప్రజాస్వామిక సంస్థల గౌరవాన్ని, ఆధిపత్యాన్ని భంగించే కార్యకలాపాలను పౌరులు చేపట్టరాదు.

4 దేశ రక్షణ పౌరులందరి ప్రధానవిధి. అవసరమైన సైన్యంలోను, జాతీయ సర్వీసుల్లోను చేరడానికి పౌరులందరు సిద్ధంగా ఉండవలె.

5 మత తత్వాన్ని, కుల తత్వాన్ని పౌరులు విడనాడవలె.

6 రాజ్యాంగంలోని నిర్దేశక నియమాల అమల్లో పౌరులందరు ప్రభుత్వంతో సహకరించవలె. సాంఘిక, ఆర్థిక న్యాయాలను సాధించుటకు, సమిష్టిసంక్షేమానికి అందరు కృషిచేయవలె.

7 పౌరులందరు హింసను విడనాడవలె. ప్రభుత్వ ఆస్తులను కాపాడవలె.

8 చట్టం ప్రకారం ప్రతిపౌరుడు పన్నులు చెల్లించవలె.''[3]

పై విధులను పేర్కొనడమేగాక కమిటి మరో సూచనకూడ చేసింది. ఏ వ్యక్తియైన ఈవిధులను పాటించకపోయిన లేక పాటించుటకు వ్యతిరేకించిన, పార్లమెంట్ ఒక చట్టంద్వారా తగిన జరిమానగాని, శిక్షగాని విధించాలన్నది. అంతేకాదు. పార్లమెంట్ అట్లా చేసే చట్టం, రాజ్యాంగంలో ఏ భాగాన్నైనా లేక ప్రాథమిక హక్కుల్ని భంగించేదిగ ఉందని, ఎవరూ, ఏ న్యాయస్థానంలోను, ప్రశ్నించరాదని కూడ చెప్పింది. ఒక ప్రాథమిక విధిని ఉల్లంఘించిన వారికి, సమంగా ఒక ప్రాథమిక హక్కును కోల్పోయేటట్లు శిక్ష ఉండాలని, కమిటిలోని కొందరు సభ్యులు అభిప్రాయపడ్డారు. చట్టబద్ధంగా ఈ ప్రాథమిక విధుల్ని అమలు పెట్టడం అసాధ్యమని, పార్టీ మరియు ప్రభుత్వ స్థాయుల్లో, తర్వాత జరిగిన చర్చలలో వెల్లడైంది. ముఖ్యంగా, ఈ సూచనను భారత కమ్యూనిస్టుపార్టీ వారు పూర్తిగా వ్యతిరేకించారు. అందువల్ల, విధిగా, ప్రభుత్వం ఈ సూచనను విరమించుకోవడం జరిగింది.[4]

1976 సెప్టెంబర్ ఒకటవ తేదీన, అప్పటి ప్రభుత్వం 59 క్లాజులలో ఒక బృహత్తర రాజ్యాంగ సవరణ బిల్లును పార్లమెంట్‌లో ప్రవేశపెట్టింది. దీనికే 44వ రాజ్యాంగ సవరణ బిల్లు అని పేరు. స్వరణ్‌సింగ్ కమిటి సిఫారసు చేసిన ప్రాథమిక విధులలో కొన్ని మార్పులుచేస్తూ మొత్తం పది ప్రాథమికవిధులను, ఇందులో పేర్కొన్నారు. ఆనాటి పార్లమెంట్‌లో ప్రతిపక్షాలకు చెందిన దేశ నాయకులందరు నిర్బంధంలో ఉండిపోయారు. పార్లమెంట్‌లో హాజరయ్యే సభ్యులకు కూడా ఎట్టి స్వేచ్ఛ లేకున్నది. దేశంలో అన్ని చోట్ల భయానక పరిస్థితులు నెలకొని ఉన్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో, 1976 నవంబర్‌లోనే, ఈ బిల్లుపై పార్లమెంట్ ఆమోదముద్ర పడింది. అనంతరం రాష్ట్రపతి సంతకమై అది 42వ రాజ్యాంగ సవరణ చట్టం (1976) అయింది. ఈచట్టం ప్రకారం, రాజ్యాంగం నాల్గవ ఆధ్యాయం చివర 51 (ఎ) అనే క్రొత్త ప్రకరణము చేర్చబడమైంది. దీని క్రిందనే పది ప్రాథమిక విధులు వ్రాయబడ్డవి. అవి వరుసగా :

1 ''మన రాజ్యాంగానికి బద్ధుడై, దాని ఆశయాలను, సంస్థలను, జాతీయ పతాకాన్ని, గీతాన్ని ప్రతి పౌరుడు గౌరవించవలె.

2 మన జాతీయ స్వాతంత్ర్యోద్యమాన్ని ఉత్తేజపరచిన ఉన్నతాదర్శాలను ప్రతి పౌరుడు పాటించవలె, ప్రవచించవలె.

3 భారతదేశ సర్వం సహాధికారాన్ని, ఏకరూపతను, సమైక్యతను పరిరక్షించడము మరియు పెంపొందించడము ప్రతి పౌరుని విధి.

4 దేశాన్ని కాపాడటాన్కి, అవసరమైనప్పుడు జాతీయ సేవ చేయడానికి ప్రతి పౌరుడు సిద్ధంగా ఉండవలె.

5 విభిన్న వర్గాల, ప్రాంతాల, భాషల, మతాలకుచెందిన భారత ప్రజలందరిలో సోదరభావాన్ని, స్నేహశీలతను పెంపొందించడము; మహిళల గౌరవప్రతిపత్తిని భంగించే చర్యలన్నింటిని విడనాడటం అందరి విధి.

6 సంపన్నము, సంగమమునైన వారసత్వంగా వచ్చే భారతీయ సంస్కృతిని కాపాడుకోవడము, గౌరవించుకోవడము ప్రజలందరి కర్తవ్యం.

7 వన్య మృగ జీవనం, నదులు, సరసులు, అడవులతో సహా మన ప్రకృతి రమణీయతను రక్షించుకోవడము, అభివృద్ధిపర్చుకోవడము, ప్రాణికోటి పట దయకలిగి ఉండటం అందరి బాధ్యత.

8 వైజ్ఞానిక, మానవతా దృక్పథాలను అలవర్చుకోవడం; ఆలోచన, సంస్కార భావాలను అభివృద్ధిపర్చుకోవడం పౌరులందరి ధర్మం.

9 ప్రతిపౌరుడు ప్రభుత్వ ఆస్తులను కాపాడవలె. హింసను అందరు విడనాడవలె.

10 సమిష్టి, వ్యష్టి సేవా కార్యక్రమాలలో ఆధిక్యతను సాధిస్తూ, ఎడతెగకుండా జాతి ఔన్నత్యానికి ప్రతి ఒక్కరూ దోహదపడవలె.''[5]

'మన రాజ్యాంగం మూడవ ఆధ్యాయంద్వారా ఈ దేశ ప్రజలందరికి కొన్ని ప్రాథమిక విధులను కల్పించింది. కాని ఎట్టి

విధులను గాని బాధ్యతల్నిగాని కల్పించలేదు' అనే విమర్శ రాజ్యాంగ రచనా కాలంనుండి వినవస్తున్నది. వ్యక్తి వికాసానికి ప్రాథమిక హక్కులు ఎంతగానో తోడ్పడతాయి. కాని, పరిపూర్ణ వ్యక్తిత్వానికి హక్కులు మాత్రమే సరిపోవు. హక్కులతోపాటు, వ్యక్తులకు నిర్దిష్టమైన కొన్ని విధులుకూడ అప్పగించినప్పుడు, వారి సర్వతో ముఖాభివృద్ధి సాధ్యమౌతుంది. వ్యక్తి అభివృద్ధిలో సమాజాభివృద్ధి యావత్తు ఇమిడి ఉంది. కాబట్టి ప్రతి హక్కుకు సమంగా ఒకవిధి ఉండాలనే వాదం న్యాయమైనదే. ఐనా, అనేక ఆధునిక రాజ్యాంగాలు కేవలం ప్రాథమిక హక్కులనే పేర్కొన్నవి. వీటితోపాటు, కొన్ని ప్రాథమిక విధులు కూడా ఉదహరించబడాలనే వాదం 1948 విశ్వమానవ హక్కుల ప్రకటనకు చాలా దగ్గర సంబంధం కలిగి ఉంది. అందులో ''సమాజంపట్ల ప్రతి ఒక్కరు కొన్ని బాధ్యతలు, విధులు కలిగి ఉన్నప్పుడే వ్యక్తికి స్వతంత్రమైన, సంపూర్ణమైన మూర్తిమత్వము సిద్ధిస్తుంది'' అని ఉంది.

ఈ వాదం కారణంగా, సమాజంపట్ల పౌరులకుండే బాధ్యతల్ని ఎరిగించడానికి, అన్ని సోషలిస్టు, కమ్యూనిస్టు దేశాలు తమ రాజ్యాంగాలలో ప్రాథమిక విధులను ప్రత్యేకంగా వ్రాసుకున్నాయి. ఉదాహరణకు, రష్యా రాజ్యాంగంలో 131వ ప్రకరణం, 1919 వైమా రాజ్యాంగంలో 163 (1)వ ప్రకరణం, 1963 యుగోస్లావియా రాజ్యాంగంలో 61వ ప్రకరణం, పోలిష్ రాజ్యాంగంలో 177 (2)వ ప్రకరణం, హంగిరీ రాజ్యాంగంలో 19వ ప్రకరణం మరియు చైనా రాజ్యాంగంలో 102వ ప్రకరణం ప్రాథమిక విధుల గూర్చి వివరిస్తున్నాయి.[6] ఈ విధంగా కొన్ని మౌలిక విధులను వ్యక్తులపట్ల విధించడంలో అర్థం లేకపోలేదు. ముఖ్యంగా, వీటిని రాజ్యాంగంలో పొందుపరచడంవల్ల, రాజ్యంపట్ల, దేశంపట్ల తన ధర్మమేమిటో ప్రతిపౌరుడు తెలుసుకొనుటకు వీలుంటుంది. విద్యా సంబంధంగా కూడా ఇవి ఎన్నో విలువల్ని కలిగి ఉన్నాయి. ప్రత్యేక పరిస్థితుల్లో, అవసరమైనప్పుడు, సంఘంపట్ల పౌరుని పాత్ర ఏమిటో ప్రాథమిక విధులు ఎల్లప్పుడూ గుర్తుచేస్తూ ఉంటాయి. రాజ్యాంగపరంగా, ప్రాథమిక విధులను గుర్తించడములో మరో బలవత్తరమైన కారణం కూడా ఉంది. ఏ సమాజంలోనైనా ప్రజలెప్పుడూ హక్కులకోసమే సహజంగా అరుస్తూ ఉంటారు. తామేమి చేయక, అన్నీ ప్రభుత్వమే చేస్తుందని, చేయాలని వాంఛిస్తారు. జాతి నిర్మాణ కార్యక్రమాలలో తమ పాత్ర ఏమిటో విస్మరిస్తారు. తమ కర్తవ్యాన్ని గూర్చి అంతగా పట్టించుకోరు. పౌరవిధులను రాజ్యాంగంలో రాసుకున్నప్పుడు ప్రజలట్లా వ్యవహరించడానికి వీలుండదు. అందుకే సోషలిస్టు, కమ్యూనిస్టు రాజ్యాంగాలు ప్రాథమిక విధులను ప్రత్యేకంగా పేర్కొన్నాయి. మన రాజ్యాంగంలో కూడా వీటిని పొందుపరచాలనే వారు పై అంశాలను వివరిస్తారు. ఈ వాదమే వీటికి రాజ్యాంగబద్ధత కల్పించింది.





విస్మయకర విషయమేమిటంటే, ప్రజాస్వామిక రాజ్యాంగాలని చెప్పబడే అమెరికా, ఆస్ట్రేలియా, కెనడా మొదలైన వాటిల్లో ప్రాథమిక విధుల ప్రస్తావన ఎక్కడా కన్పించదు. హక్కులు మాత్రమే అగుపిస్తాయి. 'విధులు హక్కులలోనే ఇమిడి ఉంటాయి. ప్రతి హక్కులోను ఒక విధి ఉండితీరుతుంది. కాబట్టి ప్రత్యేకంగా విధులను వ్రాసుకోవలసిన అవసరంలేదు' అనే సిద్ధాంతం ప్రాతిపదికగా ఈ రాజ్యాంగాలు రచించబడ్డాయి. వీటిని పోలి, వ్రాయబడిందే, చాలా మేర మన భారత రాజ్యాంగం కూడ. అందుచేతను, రాజ్యవిధాన నిర్దేశక నియమాలను ప్రత్యేకంగా పొందుపరచడం కారణంగాను ప్రాథమిక విధులను రాజ్యాంగంలో రాసుకోవాల్సిన అవశ్యకత రాజ్యాంగ నిర్మాతలకు కలుగలేదు. కాని, అత్యాయక స్థితిలో రాజ్యాంగానికి తెచ్చిన సవరణల్లో, ప్రాథమిక విధులుకూడా జతపర్చబడ్డవి. రాజ్యాంగంలోని 51 (ఎ) ప్రకరణం క్రింది పది ప్రాథమిక విధులను సాధారణ దృష్టితో చూస్తే, చాలా నిరుపద్రవమైనవిగా, ఘనమైనవిగా కన్పిస్తాయి. పరిశీలనా దృష్టితో, దీర్ఘంగాను, లోతుగను ఆలోచించి చూసినప్పుడు, ఈ విధులు అట్లా అగుపించవు.

42వ రాజ్యాంగ సవరణ చట్టంయొక్క బాహాటమైన ఉద్దేశాలలో ఒకటి, ప్రాథమిక హక్కులపై రాజ్యవిధాన నిర్దేశక నియమాలకు అగ్రత్వము కల్పించడం. ప్రభుత్వాలు ఏమి చేయాలో నిర్దేశక నియమాలు ప్రకటిస్తాయి. అంటే ప్రభుత్వాల విధులేమిటో వివరిస్తాయి. రాజ్యాంగములోని మూడవ అధ్యాయం పౌరులకు ప్రాథమిక హక్కుల్ని ప్రసాదిస్తున్నది. 'మన రాజ్యాంగం ప్రజలకెట్టి విధులను విధించడంలేదు' అనే భావంనుండి 'నిర్దేశక నియమాలకు అగ్రత్వము' అనే వాదం ఉద్భవించింది. 'నిర్దేశక నియమాలను అమలుపెట్టడంద్వారా ప్రభుత్వాలు సాధించాలనుకొనే ప్రగతికి ప్రాథమిక హక్కులు అవరోధాలు కల్పిస్తున్నాయి. ఏ విధులుగాని, బాధ్యతలుగాని లేని పౌరులు రాజ్యాంగం తమకిచ్చిన హక్కులను దుర్వినియోగం చేస్తూ ప్రభుత్వాలు తలపెట్టే ప్రగతి కార్యక్రమాలను దెబ్బతీస్తున్నారు' అనే దురభిప్రాయంనుండి 'నిర్దేశక నియమాలకు అగ్రత్వము' అన్నవాదన చివరికి మన రాజ్యాంగంలో చోటు చేసుకొంది.

నిజానికి రాజ్యాంగంలోని మూడవ అధ్యాయంలో 12 నుండి 35 వరకు ఉన్న ప్రకరణాలలో పొందుపరచబడ్డ ఏ ఒక్క ప్రాథమిక హక్కు సంపూర్ణమైనది కాదు. నిరపేక్షమైనది కాదు. సరైన, వివేకవంతమైన దృష్టితో, ఈ అధ్యాయంలోని ప్రకరణాలన్నిటిని చాలా జాగ్రత్తగా అధ్యయనంచేసి చూస్తే, ప్రతిహక్కుమీద అనేక నిర్బంధాలు విధించబడి ఉన్నట్లు విశదమౌతుంది. ఉదాహరణకు 17వ ప్రకరణం అస్పృశ్యతను నిషేధిస్తున్నది. దీన్ని ఎవరూ పాటించరాదని, పాటించడము నేరమని చెబుతున్నది. ఒక విధంగా, ఇది పౌరునిపై విధించబడ్డ ప్రత్యక్ష విధినేగాని, హక్కు కాదు. అట్లాగే 18వ ప్రకరణం తీసుకుందాం. అందులోని 2, 3, 4 కారికలు ఇట్లా ప్రకటిస్తున్నాయి:— భారత పౌరుడు ఏ విదేశీ రాజ్యంనుండి, ఎటువంటి బిరుదులు అంగీకరించరాదు. ఈ దేశంలో లాభదాయక ఉద్యోగం చేస్తూ, ఈ దేశ పౌరుడుగాని ఏ వ్యక్తి, రాష్ట్రపతి అనుమతి లేకుండా, ఏ విదేశీ రాజ్యంనుండి ఏ బిరుదును స్వీకరించరాదు. భారత రాజ్యపరిధిలో లాభదాయక ఉద్యోగం చేస్తూఉన్న ఏ వ్యక్తి, రాష్ట్రపతి పూర్వానుమతిలేకుండా ఏ విదేశీ రాజ్యంలోగాని లేక ఏ విదేశీ రాజ్యంనుండిగాని ఏ విధమైన బహుమతిగాని, భత్యంగాని లేక ఉద్యోగంగాని పొందరాదు. ఈ ప్రకరణం విధించే విధి న్యాయసాధ్యమైంది కాదు. దీన్ని ఉల్లంఘించిన వారు శిక్షార్హులు అని పార్లమెంట్ ప్రకటించవచ్చు. ఈ విషయమై రాజ్యాంగ సభలో చర్చ వచ్చినప్పుడు డాక్టర్ అంబేడ్కర్ ఇట్లా అన్నారు :

'బిరుదులు అంగీకరించకుండా ఉండటం, ఈ దేశ పౌరత్వాన్ని కొనసాగించడానికి సంబంధించిన ఒక అర్హత. ఎందుకంటే, దేశపౌరత్వం ఒక హక్కుగాదు. ఇది కొన్ని షరతులలో కూడిన ఒక విధి. బిరుదులు అంగీకరించకుండా ఉండటం, ఈ షరతుల్లో ఒకటి. దీన్ని ఉల్లంఘిస్తే, 'చట్టబద్ధంగా చర్యతీసుకొనే అధికారం పార్లమెంట్‌కుఉంది. పౌరత్వాన్ని పోగొట్టటం ఈ చర్యలలో ఒకటి.[7]

ఇక 19వ ప్రకరణాన్ని తీసుకొంటే, దీనిక్రింద ఏడురకాల ప్రాథమిక హక్కులు ప్రజల కివ్వబడ్డాయి. అవి :

1. వాక్, భావనా స్వాతంత్ర్యాలు.
2. ఆయుధరహిత శాంతియుత సమావేశానికి హక్కు.
3. సంస్థలు లేక సంఘాలను ఏర్పాటు చేసుకొనే హక్కు.
4. దేశంలో ఏ ప్రాంతంలోనైనా స్వేచ్ఛగా సంచరించే హక్కు.
5. దేశంలో ఎక్కడైనా నివశించే హక్కు.
6. ఆస్తి సంబంధమైన హక్కు.
7. ఇష్టంవచ్చిన వృత్తిలో ప్రవేశించి జీవనోపాధి సంపాదించుకొనే హక్కు.

కాని, దేశ భద్రతకు, విదేశాలతో మనకుగల స్నేహసంబంధాలకు, ప్రజల క్రమానికి, మర్యాదకు, నీతికి, శాంతియుత జీవనానికి, ప్రజా ప్రయోజనానికి భంగం వాటిల్లని విధంగా, ఈ హక్కులను పౌరులు అనుభవించాలని రాజ్యాంగం చెబుతుంది. ఈ మేరకు, ప్రభుత్వాలు అవసరమైన చట్టాలు చేసి, హక్కులను నిర్బంధించడానికి కూడా రాజ్యాంగము సమ్మతిస్తున్నది. ఐతే, ప్రభుత్వాలు విధించే నిర్బంధాలు సహేతుకాలై ఉండవలె.[8]

వాస్తవానికి, ఆచరణలో, ఇట్లా ప్రభుత్వాలు ప్రాథమిక హక్కులపై విధించే సహేతుకాలైన నిర్బంధాలే పౌరులపై రుద్దబడుతున్న ప్రాథమిక విధులు. ఈ నిర్బంధాలను విధించడంద్వారా,

ప్రభుత్వాలు కొన్ని హక్కులను, అధికారాలను పొందుతున్నాయి. చాలా ఆలోచించే, మన రాజ్యాంగకర్తలు ప్రాథమిక హక్కులు దుర్వినియోగపడకుండా కొన్ని నిరోధకాలను కూడా రూపొందించారు. అంతేకాదు. రాజ్యాంగం నాల్గవ అధ్యాయంలో రాజ్య విధాన నిర్దేశక నియమాలను ఉల్లేఖించడంద్వారా ప్రభుత్వాలపై కూడా కొన్ని విధులను, బాధ్యతలను విధించి, ఎంతో జాగరూకతతో రాజ్యాంగ నిర్మాతలు సమతౌల్యాన్ని నిర్వహించారు. కాబట్టి 'రాజ్యాంగం ప్రభుత్వాలకు విధులను, పౌరులకు హక్కులను మాత్రమే కల్పించింది' అని ఆరోపించడం సరికాదు. ప్రాథమిక హక్కుల పై నిర్బంధాలు విధించడం ద్వారా పౌరులకు కొన్ని విధులను, ప్రభుత్వాలకు కొన్ని హక్కులను, అధికారాలను రాజ్యాంగ పితలు కల్పించారు. పౌరులకు, ప్రభుత్వాలకు, ఇట్లా, 'హక్కులు–విధులు' విషయంలో-నిరోధ సమతౌల్యాలను ఎంతో విజయవంతంగా సాధించారు.

42వ రాజ్యాంగ సవరణ చట్టం (1976) ద్వారా, రాజ్యాంగం నాల్గవ అధ్యాయం చివర 51 (ఎ) ప్రకరణం క్రింద పది ప్రాథమిక విధులను ప్రత్యేకంగా పొందుపర్చడంవల్ల, రాజ్యాంగ నిర్మాతలు ఎంతో దూర దృష్టితో, వివేకవంతంగా సాధించిన ఈ న్యాయమైన, అవిరుద్ధమైన నిరోధసమతౌల్యాలు చెడగొట్ట బడుచున్నవి.

ప్రభుత్వాల దండనాధికారానికి వ్యతిరేకంగా ప్రాథమిక హక్కులు వ్యక్తియొక్క స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను భీమాచేస్తున్నది. రాజ్యాంగం అందించే వీటిని, ప్రజలందరు అనుభవించేటందుకు తగిన భౌతిక పరిస్థితులను కల్పించడానికి ఉద్దేశించబడ్డవే రాజ్య విధాన నిర్దేశక నియమాలు. ఈ దేశప్రజలందరికి సాంఘిక న్యాయాన్ని కల్పించి, సామ్యవాద తరహా సమాజాన్ని స్థాపించడమే ప్రాథమిక హక్కుల మరియు నిర్దేశక నియమాల వెనుకనున్న ఆశయం. ఈ హక్కులు, ఈ నియమాలు అన్యదేశీయాలేమీకావు. నవకల్పనలు అంతకంటే కావు. వీటి వ్రేళ్లు మన స్వాతంత్ర్య పోరాట చరిత్రలోనే ఉన్నవి. మన జాతీయోద్యమ లక్ష్యాలకు ఇవి ప్రతీకలుగా రాజ్యాంగంలోనిల్చాయి. జి. ఆస్టిన్ మాటల్లో 'మన రాజ్యాంగానికివి మనః సాక్షులు.'

రాజ్యవిధాన నిర్దేశక నియమాలకు, ప్రాథమిక హక్కులపై అగ్రగామిత్వము కల్పించడం మరియు వీటి ప్రక్కనే పది ప్రాథమిక విధులను చేర్చడంవల్ల, అనేక అనర్థాలు వాటిల్లే ప్రమాదం ఉంది. ఉదాహరణకు, సహేతుకాలైన నిర్బంధాలు విధించడం వల్లనే ప్రాథమిక హక్కులు అసంపూర్ణ హక్కులుగా మిగిలి ఉన్నాయి. పది ప్రాథమిక విధులను రాజ్యాంగంలో చేర్చడంవల్ల, ఈ హక్కులు మరింత కుదించబడ్డాయి. మరొక విషయం. నిర్దేశక నియమాలు ప్రభుత్వాల బాధ్యతల్ని, విధులను ప్రకటిస్తున్నాయి. ఐతే, నిర్దేశక నియమాలు న్యాయసాధ్యాలుగావు కనుక, ప్రభుత్వాలు వాటిని అమలు పెడితే పెట్టవచ్చు. లేకుంటేలేదు. అట్లాంటి పరిస్థితుల్లో ప్రజలు ప్రభుత్వాలపై ఎట్టి చర్య తీసుకొనే వీల్లేదు. అదీగాక, నిర్దేశక నియమాలను అమలుపెట్టే ఉద్దేశంతో, ప్రభుత్వాలు అనేక చట్టాలు, శాసనాలు చేసాయి. చేస్తున్నాయి. ఈ చట్టాలు, శాసనాలు అన్నీ ప్రజలపై సరిక్రొత్త విధులను విధించడం జరుగుతుంది. ప్రాథమిక హక్కులపై మరిన్ని నిర్బంధాలు ఉంచడమౌతుంది. ఉదాహరణకు 47వ ప్రకరణం క్రింద ప్రొహిబిషన్ ప్రవేశపెట్టినప్పుడు, ప్రతిపౌరుడు ఒక విధిని నిర్వర్తించవలె. అదే, మత్తు పానీయాలు సేవించకుండా ఉండటం. ఇట్టి ప్రక్రియల పర్యవసానంగా కొన్నాళ్లకు ప్రాథమిక హక్కులు పూర్తిగా హరించబడటమో లేక రద్దుగానటమో సంభవం కావచ్చు.

ఇక రాజ్యాంగములో పేర్కొన్న ప్రాథమిక విధులను పరిశీలిద్దాం. వీటిలో కొన్ని విధులు చాలా అస్పష్టంగాను తాత్వికంగాను ఉన్నాయి. మరికొన్ని విధులు ఇప్పటికే అమల్లో ఉన్న, నిర్దిష్టమైన అనేక చట్టాలలో, శాసనాలలో పేర్కొనబడ్డవే. ఉదాహరణకు, రాజ్యాంగబద్ధులై జాతీయ పతాకాన్ని, గీతాన్ని గౌరవించడం, ప్రభుత్వ ఆస్తులను ప్రతి పౌరుడు కాపాడటం ఉన్నాయి. భారత శిక్షా స్మృతి క్రింద, వీటిని పాటించక పోవడం నేరమని ప్రకటించబడే ఉంది. అట్లాంటప్పుడు, వీటిని రాజ్యాంగంలో వ్రాయాల్సిన అవసరమేముంది? అంతేకాదు. కొన్ని విధులను ఆచరణలో పాటించడం అసాధ్యం. ఉదాహరణకు, ప్రాణికోటి పట్ల దయ కలిగి ఉండటం, శాస్త్రీయ, మానవతా దృక్పథాలను అలవర్చు కోవడం, ఆలోచన సంస్కారభావాలను అభివృద్ధి పరచుకోవడం ఉన్నాయి. వీటిని ప్రజలు ఎట్లా పాటించగలరు? ఇవి ఆత్మగతమైన విషయాలు గదా!

మరొక విధిని తీసుకుందాం. దేశాన్ని రక్షించడం, జాతీయ సేవ చేయడం ఉంది. దేశరక్షణ, జాతీయసేవ చాలా ముఖ్యమైన విధులే. కాని, ప్రత్యేకంగా వీటిని రాజ్యాంగంలో ఉదహరించాల్సిన అవసరంలేదు. సాధారణ చట్టాలనేకం, వీటిని గూర్చి ప్రత్యక్షంగానో పరోక్షంగానో పేర్కొన్నవి. చాలా రాష్ట్రాలలో ఇంజనీర్లు, డాక్టర్లు మొదలైన వారు శాసన పరంగా జాతిసేవకు అంకితమౌతూనే ఉన్నారు. బలవంతంగా పౌరులని సైనిక సేవ చేయాలని చెప్పడం, గాంధీ పుట్టిన ఈ దేశంలో, చాలా విడ్డూరంగాను, విచిత్రంగాను ఉంది. జాతి ప్రమాదంలో పడ్డ ప్రతిసారి—దేశ నలుమూలల నుండి లక్షలాది యువతీ—యువకులు, స్త్రీలు—పురుషులు, చిన్నలు పెద్దలు, ఒకరేమీ—జాతి యావత్తు స్వయంగా, ఏ పిలుపుగాని, ప్రేరణగాని లేకుండానే తుపాకులు పట్టారు—తృణప్రాయంగా ప్రాణాలర్పించారు. దేశాన్ని, దేశ ప్రాదేశిక సమగ్రతను రక్షించుకున్నారు. మన గత రాజ్యాంగ చరిత్రలో జరిగిన సంఘటనలే దీనికి ప్రత్యక్ష నిదర్శనాలు. 9

ఈ విధులన్నింటికన్నా 'కుటుంబ నియంత్రణ ప్రయోజనాల దృష్ట్యా, ప్రజలందరు బ్రహ్మచర్యం పాటించడం ప్రాథమిక విధి'గా ఉండాలని 44వ రాజ్యాంగ సవరణ బిల్లుపై చర్చ సందర్భంగా, పార్లమెంట్‌లో ఒక ప్రముఖ కాంగ్రెస్‌వాది చమత్కరించారు.[10] 'ప్రాథమిక విధులన్నీ దైవభక్తి పూరితాలైన కోర్కెలుగా ఉన్నాయని, వీటికిబదులు ప్రతిపౌరుడు 1) సెక్యులర్ ప్రార్థనలు చేయవలె 2) పవిత్రంగా ఉండవలె 3) సమత్వంపాటించవలె 4) శాంతికి తోడ్పడవలె. 5) ఉత్పత్తిని పెంచవలె 6) బ్రహ్మచర్యం పాటించవలె' అని 'రాజ్యాంగంలో రచించుకొంటే కొన్ని మేళ్లు జరుగుతా'యని ఒక ఇండిపెండెంట్ సభ్యులు తమ ఆక్రోశాన్ని వెలిబుచ్చారు [11]

రాజ్యాంగంలో పొందుపరచబడ్డ పది ప్రాథమిక విధులు ప్రజలకే వర్తిస్తాయి గాని ప్రభుత్వాలకు వర్తించవు. మరి ప్రభుత్వాలు ఈ ప్రాథమిక విధులను ఉల్లంఘించే అవకాశం ఉంది. సంపన్నమైన, సంగమమైన భారతీయ సంస్కృతిని కాపాడటం, గౌరవించడం ప్రజల విధి. రేపటి ప్రభుత్వాలు ఈ సంస్కృతిని నేలమట్టం చేయవనే గ్యారంటీ ఏది?

ప్రాథమిక విధుల వెనుక, ఎట్టి న్యాయమద్దతు గాని, చట్టబద్ధమైన శక్తిగాని లేదు అనగా ఇవి న్యాయసాధనాలుగావు అట్లాంటప్పుడు ఊరికే వీటిని రాజ్యాంగంలో రచించుకోవడంలో అర్థంలేదు. న్యాయశాస్త్రరీత్యా ఆలోచిస్తే వీటికి రాజ్యాంగబద్ధత కల్పించాల్సిన అవసరంలేదు ఎందుకంటే, పౌరులందరూ రాజ్యాంగబద్ధులే. ఈ దేశంలో ఎవరూ చట్టానికి, న్యాయానికి అతీతులు కారు. రాజ్యాంగంలో వ్రాసినా వ్రాయకపోయినా ప్రజలందరు చట్టబద్ధులే—శాసనబద్ధులే.[12]

అమలుపెట్టడానికి వీల్లేనివిధంగా, రాజ్యాంగంలో ఈ ప్రాథమిక విధులను ఇరికించడంవల్ల ఒనకూడే ప్రయోజనం శూన్యం. కేవలం ఆలంకారికాలైన కారికలుగా లేదా నీతిప్రదమైన అనుజ్ఞలు మిగిలిపోతాయి. పైగ రాజ్యాంగ ఘటులను పెంచుతూ ఉన్నాయి. సూక్ష్మంగా గమనించినట్లయితే, ప్రాథమిక విధులు ప్రభుత్వాధికారాలను పెంచేవిగా ఉన్నాయి. వీటిని ఉల్లంఘించిన ప్రజల్ని శిక్షించే అవకాశం, అధికారం ప్రభుత్వాలకే ఉన్నాయి గాని, ఆ ప్రభుత్వాలే తమ కర్తవ్యాలను విస్మరించినప్పుడు (రాజకీయంగా ఎన్నికలలో మినహా ఇస్తే తప్ప) ప్రజలకు వాటిని దండించే అవకాశం లేదు. అంతేగాక ఈవిధులనేవి, ఏకపక్షంగాను, అసందిగ్ధంగాను ఉన్నాయి. ఏ సందర్భంలో ఒక విధిని పౌరుడు ఉల్లంఘించాడు అని నిర్ణయించేది ఎవరు? ప్రభుత్వాలా! శాసన సభలా! న్యాయస్థానాలా!

ప్రాథమిక విధులను నైతికంగా అమలుపర్చడం సాధ్యమౌతుంది గాని చట్టరీత్యాగాదు. ఉదాహరణకు నిర్బంధ కుటుంబ నియంత్రణ ఎటువంటి పరిణామాలకు దారి తీసిందో ప్రత్యేకంగా తెలుపవలసిన అవసరం లేదు. దీర్ఘకాలంలో విద్య, ఆర్థికాభివృద్ధి సమానావకాశాలు చట్టబద్ధంగా అమలుచేయడం సాధ్యమైనప్పుడు ఈ విధులు నైతికంగా వాటంతటవే అమలు పడతాయి కాబట్టి వీటిని రాజ్యాంగం నుండి తక్షణంగా తుడిచివేసుకోవలసిన ఆవశ్యకత ఎంతేని ఉంది.

## అధో జ్ఞాపికలు


1. N.A.Palkhiwala: 'Reshaping the Constitution' Illustrated Weekly of India. 4th July 1976 Vol. XCVII 4-10.
2. K. K. Katyal : 'Constitutional Changes' The Hindu dated 9-9-1976.
3. కె. ఐలయ్య : 'భారత రాజ్యాంగము – ప్రాథమిక విధులు' 31. ప్రసారిత. జనవరి–మార్చి 1978.
4. Reference cited No. 2
5. P Seshadri & K. R. Acharya : "Constitution Forty Second Amendment Act 1976–A Critical Study" 1977 Department of Publications & Press, Osmania University.
6. Reference cited No. 5
7. Constituent Assembly Debates, Vol. VII చూడండి.
8. 'భారతదేశ పాలనా వ్యవస్థ'. తెలుగు అకాడమి ప్రచురణ 42. 1975.
9. 'Fundamental Duties'—editorial in 'Commerce' Journal, July 10, 1976.
10. చూడండి 'The Hindu' dated 27-10-'76.
11. Reference cited No. 10
12. P. Jaganmohan Reddy : 'Social Justice and the Constitution' (a booklet).




# కలగూరగంప

## భావోద్యమాలు-వర్గతత్వం

ప్రకృతి పరిణామం, జీవపరిణామం, భావపరిణామం అనే వన్నీ ఒక క్రమంలోనివే.

అందువల్ల దైవభావం కానీ, ఆధ్యాత్మిక భావం కానీ, అతితత్వ—అతీంద్రియత్వభావాలు కానీ ఆదిమానవుడికి వుండడానికి వీలు లేదనే విషయం సామాన్య వివేకానికి సంబంధించినది. మానుష శాస్త్ర పరిశోధనలు కూడా యీ విషయాన్నే ధృవపరుస్తున్నాయి. కాబట్టి ఆదిమానవుడి తత్వం భౌతికతత్వమే—అతనిది స్వభావవాద వైఖరే.

ఐతే యేదో ఒక ముహూర్తాన మానవుడి బుర్రలో దైవ భావం అంకురించింది. అది అతనిలోని హేతుత్వానికి ఫలితమే కాని, మరొక విధంగా ఆ భావం అతనిలో బయలుదేరిందనుకోడానికి వీలులేదు.

ఆదిమ దైవ భావంలో అభౌతికత కానీ, అతీతత్వం కానీ వున్నట్లు మనకు ఆధారాలు లేవు. ప్రాచీన మత గ్రంథాలు ప్రతి పాదించిన సృష్టిక్రమాలు, మానవ అవతరణ, దేవతా పురుషుల కార్యకలాపాలు పరిశీలిస్తే ఆ విషయం రూఢి అవుతుంది.

సేశ్వరభావంతోపాటు సమకాలీనంగా నిరీశ్వర భావం కూడా బయలుదేరి వుంటుందనే విషయం యింగితం చెప్పే పాఠమే. ఐతే చరిత్ర మరొక పాఠంకూడా నేర్పింది : స్వభావవాదం — భౌతికవాద చింతన — నిరీశ్వరభావం యెంత సమర్థవంతంగా ప్రాకులాడుతూ వచ్చినా, ఆధ్యాత్మిక—భావవాద—దైవభావాలకు స్వాధీనమైపోయిన మనిషి మనస్సును వెనక్కుమరల్చడంలో అవిపూర్తిగా విజయవంతం కాలేకపోయినై; అయినా రాజుకొన్న నిప్పు ఆరలేదు. ఇది చారిత్రక వాస్తవం; ప్రత్యక్ష సత్యం.

అంతేకాదు—మత చింతన ఆధారంగా యావత్తు మానవ సమాజంలో వ్యాపించిపోయిన యెగుడు దిగుళ్లు కూడా చారిత్రక వాస్తవం. ప్రపంచంలో అన్ని జాతుల్లోనూ, మతాల్లోనూ వుచ్చ—నీచ తారతమ్యాలు పాటించబడినై. ఆర్యులు - అనార్యులు, సర్వ జనులు—అన్యజనులు, పవిత్రులు—కాఫిర్లు అనే తేడాలు ఆ విధంగానే ప్రవేశించి తరతరాలుగా సమాజాన్ని యేలుతూ వచ్చినై. దేహబలం కలవాళ్ళు కొన్నాళ్లూ, బుద్ధిబలం కలవాళ్ళు కొన్నాళ్లూ 'సామాన్యులు' —'పామరులు' అనబడే సామాజికులమీద పెత్తనం చేశారు. ఆ పెత్తనం లౌకికాధిపత్యాన్నిదాటి, జన్మతః కొందరు మనుషులు మిగతా మనుషుల కంటె అధికులు అనే భావం పెంపొందింది. ఆ వైఖరి భారతదేశంలో వర్ణవ్యవస్థ పేరుతో, కులవ్యవస్థ రీతిలో అతి నికృష్ట స్థాయికి దిగజారిపోయింది.

అంటే మనిషితోపాటే దేవుడు పుట్టలేదు — మతాలూ, కులాలూ, యెక్కువ తక్కువలూ పుట్టలేదు. మనిషి ఆలోచనాపరుడైన తర్వాతనే దేవుళ్లూ—దయ్యాలూ, మతాలూ—కులాలూ అవతరించినై. కాలం గడిచే కొలదీ జిజ్ఞాస స్తంభించిపోయి, అవి వికృత రూపం ధరించి, మనిషినే మింగివేసినై. మనిషి బహుధా పరాధీనుడైపోయాడు. ఆమనిషి మనిషిగామారితేతప్ప, అనేకరూపాల్లో వ్యక్తమవుతున్న పరాధీనతా భావం మనిషిలోనుండి పోదు. మనిషిని వర్గభావానికి బానిసగా భావించే అభ్యుదయవాదుల సిద్ధాంతాలకు మూలవిరాట్టని చెప్పబడుతున్న మార్క్సు మనిషిలోని పరాధీనతా భావాన్ని యిలా పేర్కొన్నాడు :

"The more man puts into God, the less he remains in himself" (Economic and Philosophic manuscripts of 1844, Moscow, 1977, p. 68)

"Every self-estrangement of man, from himself and from nature, appears in the relation in which he places himself and nature to men other than and differentiated from himself" (Ibid, p. 76)

అందువల్ల మనిషి వ్యక్తిత్వాన్ని — వస్తుత్వాన్ని యేదో ఒక కల్పిత దైవానికో, జాతి, మత, వర్గ భావాలకో దత్తం చేయడం అతని పరాధీనతా భావానికీ, వైమనస్యానికీ స్పష్టమైన గుర్తు. మనిషి యెంత యెక్కువగా తనను దేవుడికి సమర్పించుకొంటే, అంత తక్కువగా తనలో తాను మిగులుతాడు. మార్క్సు వాక్యంలోని 'దేవుడు' అనే పదాన్ని తీసివేసి 'జాతి', 'వర్గం' అనే పదాలను చేర్చవలసిన సామాజిక దశలో మనమున్నాం. పాతదేవుణ్ణి తీసివేసి కొత్త 'దేవుళ్లను' ప్రతిష్ఠించినంత మాత్రాన మనిషిలోని పరాధీనతా భావం పోదు. గడచిన మానవజాతి చరిత్ర అంతా యెప్పటికప్పుడు కొత్త దేవుళ్లూ, కొత్త మతాలూ పుట్టి గిట్టిన చరిత్రే. మనిషి దేనికీ పరాధీనుడు కాకుండా వుండగలిగితేనే, తనలో తాను వుండగలుగుతాడు. అదే మనిషి అస్తిత్వసారం.

సాంఘిక (వ్యక్తిత్వ) సమతాభావం, రాజకీయ (అధికార) సమతాభావం, ఆర్థిక (భద్రత)సమతాభావం తరతరాలుగా ఎందరో మానవతావాదులూ, విప్లవకారులూ బోధిస్తూ వచ్చారు. సమాజం అనేక రకాలుగా మారుతూనే వచ్చింది. ఐనప్పటికీ యింతవరకు యే సమాజంలోనూ సమత సాధించబడలేదు ప్రతి సమాజంలోనూ కొందరు మరి కొందరి కంటే "యెక్కువ సమానులు" (Some men are more equal than others) అనేభావం అచ్చు పడివుంది. కొందరు బ్రతకాలంటే మరికొందరిని చంపవలసిరావడమే ఆనవాయితీ అయింది. ఈ అసమతే సమతగా ప్రచారితమవుతూ వచ్చింది.

ఆ స్థితి పోవాలంటే ముందుగా ప్రతిమనిషీ తాను మనిషి ననే భావచైతన్యం పొందాలి.

మాటకు ముందు 'వర్గదోపిడి' అనడం ఒక్కటే అభ్యుదయ చిహ్నం కాదు. భావోద్యమాలు సమతా వాదానికి ద్రోహం తలపెడతాయనే వాదం వెనక రాజకీయావకాశవాదం పనిచేస్తున్నది 'ఆర్థిక దోపిడి' అనేది రాజకీయాధికార దోపిడి కోసం వుపయోగించుకొనే బూచి. నిజానికి భావోద్యమాలు వుద్దీపించే భావ వికాసమే సర్వ సమతా సమాజానికి మూలం. లౌకికతత్వంలో విశ్వాసం కుదురుకోని మనుషులతో, సొంత ఆలోచనలేని మనుషులతో, సొంత ఆలోచనల్ని వ్యక్తం చేయలేని వ్యక్తులతో కమ్యూనిటేరియన్ హ్యూమనిస్టు వ్యవస్థను నిర్మించడమంటే, బానిసలతో స్వేచ్ఛాసమాజాన్ని నిర్మించడమే.

అందువల్ల భౌతిక వాస్తవికవాది కానివాడు సర్వ సమతావాది కాలేడు. భౌతికవాదం ప్రచారం కానిది సర్వసమతావాదం ప్రచారం కాలేదు ఆర్థికం ఒక్కటే కాదు భౌతికం అంటే — మానవుడి అవసరాలన్నీ భౌతికావసరాలే. ఆధ్యాత్మికావసరాలనే వేమీలేవు. అందువల్ల ముమ్మందుగా ఆర్థికంగా బాగు (?) చేస్తే, భావాల మార్పు యధోచితంగా జరిగిపోతుందనేది పెద్ద అబద్ధం. చరిత్ర అంతా దానికి తిరుగులేని సాక్ష్యం. అందువల్లనే కావాలి — దైవ ప్రమాణాన్ని నిరాకరించే నిరీశ్వరవాదం కమ్యూనిజమనేదానికి తొలి మెట్టన్నాడు మార్క్స్. నాస్తికత్వాన్ని సైద్ధాంతిక మానవవాదంగా నిర్వచించాడు.

"Communism begins from the outset with atheism; but atheism is at first far from being Communism" (p. 98).

"Atheism being the suppression of God, is the advent of theoretical humanism and communism, as the suppression of private property, is the advent of practical humanism. They are but the first real emergence, the actual realisation for man of man's essence and his essence as something real' (p. 151).

మార్క్స్ దృష్టిలో నాస్తికత్వం లేక భౌతిక వాదం అనవసరం కాదు — నాస్తికత్వ పునాదినుంచే కమ్యూనిజం ప్రారంభ మవుతుంది.

నాస్తికత్వమంటే దైవభావాన్ని నిర్మూలించడం కాబట్టి, అది సైద్ధాంతిక మానవవాద మవుతుంది. కమ్యూనిజ మంటే సొంత ఆస్తి నిర్మూలన కాబట్టి, అది ఆచరణాత్మక మానవవాద మవుతుంది.

మానవుడి యొక్క నిజమైన అస్తిత్వసారాన్ని అవి నిష్పన్నం చేస్తాయి.

ఇతరులతోడి సంబంధ బాంధవ్యాల్లో మనిషి తన అస్తిత్వాన్నీ, వస్తుత్వాన్నీ విస్మరించడంలోనే అధీనతాభావం, వైమనస్యం బయల్పడతాయి.

మార్క్స్ చెప్పిన దాన్నిబట్టి మనిషి తన అస్తిత్వ సారాన్ని గుర్తించాలంటే, ముందుగా దైవ భావం (వగైరాలు) పోవాలి. దైవ విశ్వాసంతో బయలుదేరే మనిషి తన కంటె 'అధికుణ్ణి' ఒకణ్ణి సృష్టించుకొని, తన మనస్సునూ, ఆలోచనా విధానాన్నీ అతనికి స్వాధీనంచేసి, అతనిచుట్టూ తిప్పడంవల్ల — మనిషి అనే వాడు 'నాస్తి' అవుతున్నాడు. మనిషి బాగోగులకు అవసరమైన వాటి కన్నిటికీ మనిషికి బదులు దైవం కేంద్రంగా మారడంవల్ల మానవవాదమూ, కమ్యూనిజమూ (?) వగైరాలు అసంభవమై కూర్చున్నాయి.

అందువల్ల భౌతికవాద పునాదులులేని ఆలోచన యేరకమైన అభ్యుదయ సామాజిక సిద్ధాంతానికీ దారి తీయదని తేలుతుంది. భావాల పునాదులులేని సామాజిక బాహ్య నిర్మాణం స్వేచ్ఛకుకాక నియంతృత్వానికే-దారి తీస్తుంది ఇది చరిత్ర అప్పగించిన పాఠం.

ప్రజల యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండానే తమ భావాలను యితరుల మీద బలవంతంగా రుద్దడానికి ప్రయత్నించేసిన నిరంకుశులు చరిత్రలో అరుదేమీకాదు. ''వారేరీ ?...?'' అనకూడదు కానీ, 'తమ సిద్ధాంతాలకోసం రక్తపుటేర్లు కట్టించిన వారి సిద్ధాంతా లేవీ? ఐనా భావదాస్యంతో, సిద్ధాంతాల బానిసత్వంతో వారు చేసిన ఘోరాలను చరిత్ర చెరిపివేయలేదు.

ఈనాడు కొందరు మార్క్సిస్టులు హేతువాదం, మానవవాదం, నాస్తికత్వం పేర్లువింటేనే బెదిరిపోతున్నట్టు కన్పిస్తున్నది నాస్తిక ముద్ర తమ రాజకీయ పరపతిమీద దెబ్బ తీస్తుందనే అభిప్రాయం ఆ వైఖరికి ప్రచ్ఛన్న కారణమేమో తెలియదు కాని, మెడ మీద తల వున్నవాడెవ్వడూ మార్క్సిస్టులు ఆస్తికులని భ్రమించలేడు. నాస్తికులు కారని వూహించనూ లేడు.

హేతువాదం, నాస్తికత్వం, సెక్యులరిజం ఫ్రీ థాట్, మానవవాదం వంటి భావోద్యమాలన్నిటి వెనుకా మరొక ప్రచ్ఛన్న లక్ష్యం వుందనీ, వర్గ పోరాటాన్ని ప్రక్కదారులు పట్టించడమే ఆ వుద్యమాల వుద్దేశ్యమనీ ఆమధ్య ఒకబాధ్యతగల మార్క్సిస్టు అన్నప్పుడు నేను విస్తుపోయాను. విశ్వాసం, అనుసరణ అనేవి లౌకిక సిద్ధాంత అనుయాయుల్లో సైతం యెటువంటి విచిత్రమైన ఆలోచనా వైఖరులను ప్రోత్సహిస్తాయో — కొన్ని కొన్ని అభిప్రాయాలు వారిలో యెటువంటి వులుకునూ, భయోత్పాతాన్నీ కలిగిస్తాయో, ఆలోచించుకొన్నప్పుడు నాలో నేను నవ్వుకోకుండా వుండలేక పోయాను.

కానీ మార్క్స్ యెన్నడూ ఆ భావోద్యమాలను అంత కినుకతో చూచినట్లు లేదు. కమ్యూనిజమే చరమ లక్ష్యమని ఆయన అభిప్రాయ పడలేదు కూడా :

"Communism is the necessary form and the dynamic principle of the immediate future, but communism as such is not the goal of human development, the form of human society (P. 108).

అందువల్ల భౌతిక వాస్తవికవాద వైఖరి శాశ్వతమనీ, కమ్యూనిస్టు వ్యవస్థవంటివి సంధి దశలేననీ మార్క్స్ అభిప్రాయంగా మనకు అర్థమవుతుంది.

కమ్యూనిజం, హ్యూమనిజం—లేక కమ్యూనిటేరియన్ హ్యూమనిజం, లేక హ్యూమనిటేరియన్ కమ్యూనిజంలాంటి ఆలోచనా రీతులకూ, వ్యవస్థలకూ చేరే దారిలో భావోద్యమాల పాత్రను గుర్తిస్తే, ఆర్థిక 'అత్యయికతా' వాదులుచేసే భావోద్యమ వ్యతిరేక ఒంటెత్తు అతివాద వ్యాఖ్యానాలు సరికావని తేలుతుంది. 'ఆర్థిక వ్యత్యాసాలు సర్వరోగాలకు కారణం—ఆర్థిక విప్లవం (?) సర్వరోగ నివారిణి' అనే మూఢ నమ్మకమే యీ వ్యాఖ్యానాలకు కారణం.

నినాదాలలో కమ్యూనిస్టు ఆధిపత్యం వస్తే, గిస్తే — అది 'సున్నటి' ఆర్థిక వ్యవస్థను స్థాపిస్తుందనే ఆశ యీ బండ విశ్వాసానికి మూలం.

ఒకచోట మార్క్స్ మానవుడి భావాలన్నీ (అతని) ఆర్థిక పునాదిగా నిర్మాణ మవతాయన్నాడు. మరొకచోట పాలకుల భావాలే పాలితుల భావాలన్నాడు (జర్మన్ ఐడియాలజీ). అందువల్ల ముందుగా మనిషి ఆర్థిక పరిస్థితిలో మార్పుతెప్పిస్తే, తర్వాత మనిషి భావాలతోసహా అంతా సవ్యంగా అవశ్యంగా సర్దుకుపోతుందనే విశ్వాసం ప్రాతిపదికగా భావోద్యమాలు అనవసరం (అపాయకరం) అని తేల్చివేయడం జరుగుతున్నది. మరి కమ్యూనిజం భావోద్యమం కాదా? అందువల్ల యీ ఆలోచనా విధానమే సరయినది కాదు.

మనిషిని మనిషిగాకాక ఒక మతంలోనో, కులంలోనో, జాతిలోనో అవిచ్ఛిన్నమైన భాగంగా చూడడం యెలా అసమంజసమో, ఒక వర్గంలో భాగంగా చూడటం కూడా అలాగే అసమంజసమని మనం గ్రహించాలి. అందుకు మరల మన విశ్వాసాలు అడ్డు రాకూడదు. కుల, మతాల్లోవున్న సమిష్టి అహమే జాతి, వర్గాల్లోనూ వున్నది. కొంచెం ఆలోచిస్తే అది అర్థం కానిదేమీ కాదు. అవి యెంత వాస్తవమో, యివీ అంతే వాస్తవాలు.

కులమతాలరీత్యా మనిషిని విభజించడం తప్పయినప్పుడు, జాతి, వర్గాలరీత్యా విభజించడం తప్పెందుకు కాదు? హేతుబద్ధంగా ఆలోచిస్తే వాటిలోనూ మనిషి ప్రాముఖ్యత మృగ్యమేకదా? మనిషిని వదలి వర్గభావం, వర్గ వైరుధ్యం, వర్గపోరాటం, వర్గ నియంతృత్వం, వర్గనీతి, వర్గన్యాయం, వర్గశాస్త్రం, వర్గసంస్కృతి అంటూ మానవుడి అస్తిత్వంలోని సర్వస్వాన్నీ వర్గపరంగా అర్థం చేసుకోవడం హేతుబద్ధమెలా అవుతుంది?—కాదని మార్క్స్—యేంగిల్సులే చివరి రోజుల్లో గుర్తించినట్లు వారి కరెస్పాండెన్సును బట్టి తెలుస్తుంది.

మానవ సమాజాన్ని మొత్తాన్నీ ఒక్కదానిగా కాక ద్వంద్వాలుగా విభజించి చూచే చారిత్రక వ్యాఖ్య యింకా యిలా యెన్నాళ్లు కొనసాగాలి? పురోహితవర్గం ✕ భూస్వామ్యవర్గం, భూస్వామ్య వర్గం ✕ పెట్టుబడిదారీవర్గం, పెట్టుబడిదారీవర్గం ✕ కార్మిక వర్గం, పాలకవర్గం ✕ పాలితవర్గం = దోపిడిచేసేవర్గం ✕ దోపిడి చేయబడేవర్గం—ఈ ద్వంద్వాలలోతప్ప మానవుణ్ణి మనం చూడలేమా? (ప్రతి కమ్యూనిస్టు రాజ్యంలోనూ యీ ద్వంద్వాలున్నాయని మార్క్సిస్టు లంగీకరిస్తారా?)

మనిషిని మనిషిగా తీసుకొంటే అతని తత్వం భౌతిక వాస్తవికవాదం (Physical realism). మనిషి ఆ లౌకికతత్వానికి చేరుకోవాలంటే భావవికాసం కావాలి. ఆ భావవికాసం కావాలంటే మనిషి మనస్సు, మతం, యింకా తత్తుల్యమైన ఆధికారిక ప్రమాణాల సంకెళ్లనుంచి తప్పించుకోవాలి.

చరిత్రలో ఎల్లప్పుడూ రెండే రెండు వర్గాలుండేవంటారా? యేమో—ఆ వాదాన్ని చరిత్ర సమర్థించదేమో! అధికార పోరాటంలో యిరుకొనే పార్టీలే (వర్గాలే) రెండుకానీ, వర్గ విభజన చేసుకొంటూపోతే ప్రతి సమాజంలోనూ అనేక వర్గాలుండి తీరాలి.

అంతేకాక యేవర్గ భావాలు ఆ వర్గానివే అన్నప్పుడు, పురోహిత వర్గతత్వ శాస్త్రమేమిటి? భూస్వామ్య వర్గతత్వ శాస్త్రమేమిటి? పెట్టుబడిదారీవర్గ తత్వశాస్త్రమేమిటి? అవి మూడూ ఆధ్యాత్మిక వాదపు పిలకలేనా? కార్మిక వర్గాని దొక్కదానిదే గతి తార్కిక భౌతికవాదమా? బూర్జువా ప్రజాస్వామ్య విప్లవానికి తాత్విక పునాదులు వేసింది భౌతికవాదం కాదా? భౌతికవాద పునాదులు వేసినవారు పురోహిత మేధావి వర్గంకాదా? రాజరికం భౌతిక వాదాన్ని ఆమోదించలేదా?--అందువల్ల తత్వశాస్త్రాన్ని వర్గపరంగా విభజించడం సరైన శాస్త్రీయ అవగాహన లేకపోవడం వల్లనే.

అంతేకాదు—ఏ తత్వమయినా వ్యవస్థీకరణ పొందితే మతంతో సమానమైపోతుందని మనం గ్రహించాలి. మతాలన్నీ అలా 'భగవాన్ ఉవాచ' అంటూ యేర్పడినవే. విజ్ఞాన ప్రగతితో వచ్చే మార్పులను బట్టి ప్రతి సిద్ధాంతమూ మారిపోవాలి. పరిణతిలేని ప్రతివాదమూ మతమై కూర్చుంటుంది.

ఈ దేశంలో వర్గసిద్ధాంతం ప్రాతిపదికగా కమ్యూనిస్టు వుద్యమం ప్రారంభమై అర్ధశతాబ్దం దాటింది. ఆనాడు మార్క్స్ ప్రతిపాదించిన వర్గసంబంధాలు యిక్కడ లేవు. భావ వికాసోద్యమ కారులెవ్వరూ యిక్కడ రాదగిన వర్గపోరాటాన్ని ఆటంకపరచలేదు. ఆలస్యపరచలేదు కూడా--ఐనా ఆ పోరాటం రానేలేదు. ఇంతలో వస్తుందని ఆశించవచ్చునేమో విజ్ఞులూ, తజ్ఞులూ చెప్పాలి.

అనుచరవర్గంలో భావవిప్లవం తేవడానికి నాయకులు సమగ్ర ప్రయత్నం చేయలేదు. మరొకరకంగా సామాజిక విప్లవం జరగడానికి వీలుందనే ఆలోచన వారికి రాలేదు. మార్గాల్లో ద్వంద్వాల ప్రసక్తి రాలేదు అందువల్ల పార్టీ అనేది భావాలులేని బాహ్యనిర్మాణమైంది—సూపర్ స్ట్రక్చర్ అయింది.

భావోద్యమాలు వద్దనేవారి తాత్పర్యమేమిటి?—''సామాన్యులారా, మీకు భావాలేమివద్దు. పిచ్చి పిచ్చిగా ఆలోచించవద్దు.

మీకోసం మేము ఆలోచించిపెడతాం. మీకెటువంటి సమాజం కావాలో, ఎలాంటి పరిపాలన కావాలో మాకు తెలుసు. మీరంతా **మా** వెనక వుండండి. మేము చెప్పినటు చేయండి. మీకు కావలసినంత కూడు పెడతాం. గుడ్డలిస్తాం. యిళ్లు కట్టిస్తాం. మనిషికి కావలసినవి అవే. మీకు అన్ని సౌకర్యాలూ చేకూరుస్తాం. అంతేకాని మీకెలాంటి సమాజం కావాలో, యెలాంటి పరిపాలన కావాలో మీరు ఆలోచించుకోవద్దు. మీకేమి కావాలో మీకు తెలియదు. తెలుసుకొనే ప్రయత్నం చేయడం (భావవికాసం) విప్లవద్రోహం'' అనేనా ?

ఇది స్మృతికారులు చెప్పిన పాఠమే. జనంకోసం వాళ్ళు ఆలోచించారు. అదే గొప్ప త్యాగం — కానీ అది మానవతత్వం కాదు. మానవవాద విధానం కాదు.

భావాల పునాదిలేని యే వుద్యమమూ విజయం పొందదు. పొందకపోగా వెర్రితలలు వేస్తుంది. వివేచనలేని నాయకులు భావవికాసంలేని ప్రజలను వెనక్కు నడుపుతారనేందుకు చరిత్రలో చాల వుదాహరణలు కనిపిస్తాయి.

మనుషులు తమ చరిత్రను తామే సృష్టించుకోవాలి. ఈ మాట మార్క్సు కూడా అన్నాడు. కానీ యింతవరకు జరిగిన చరిత్రలో నాయకులే మనుషుల చరిత్రను సృష్టిస్తూ వచ్చారు. తమ చరిత్రను తాము సృష్టించుకోగల మనుషుల్ని సృష్టించే ప్రయత్నం యింతవరకు జరగలేదు. ''సోదరులారా, మీరంతా చాలా తెలివికలవారు, గొప్పవారు, బలవంతులు, మీ చరిత్రను మీరు సృష్టించుకోగలరు'' అని జనాన్ని వుబ్బవేయడం వారికున్న వివేకాన్ని చంపడానికే కాని, దానికి వుద్దీప్తి కలిగించడానికికాదు. ఇలా తరతరాలుగా మనుషుల వివేకాన్ని మతానికో, ధర్మానికో, కులానికో, రాజ్యానికో, జాతికో, వర్గానికో బలిపెట్టడంద్వారా ఆ యా యుగ నాయకులు చరిత్రను యెప్పటి కప్పుడే వెనక్కు తిప్పగలుగుతూ వచ్చారు. అందువల్లనే వుపనిషత్తుల తర్వాత పురాణాల ప్రాభవం, దార్శనిక చింతన తర్వాత ఆచార్యత్రయ వేదాంతం, బౌద్ధం తర్వాత హిందూతత్వం విజృంభించగలిగినై. ఈనాడు ప్రజాస్వామ్యం తర్వాత నియంతృత్వం విజృభించగలిగితే, దానికి కారణం బహుళ ప్రజానీకం యొక్క అవివేకంలోనూ, భావదారిద్ర్యంలోనూ వుంటుంది.

ఇటీవలి ప్రపంచ చరిత్ర అందరకూ తెలిసిందే. ఈ శతాబ్దంలో జర్మనీ తత్వజ్ఞానానికీ, శాస్త్రాభ్యున్నతికీ ఖ్యాతికన్నదేశమే. 1920 దశకంలో జర్మన్ కమ్యూనిస్టుపార్టీ ప్రపంచంలోకల్లా పెద్దది. కానీ జర్మనీ (కార్మిక) జనాభాలో వర్గచైతన్యం—''కమ్యూనిస్టు'' చైతన్యంలేదు. ప్రజ మతస్థుల్లాగా తండోపతండాలుగా కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం పుచ్చుకొన్నారు. వర్గవిద్వేషం పార్టీ బలానికి పునాది అయింది. హిట్లర్ జాతిద్వేషాన్నీ, జాత్యహంకారాన్నీ రెచ్చగొట్టి అధికారం చేపట్టాడు. జాతిద్వేషం వర్గద్వేషానికి పైచేయి అయింది. వర్గాభిమానం జాత్యభిమానానికి లొంగిపోయింది. కమ్యూనిస్టులు(?) మూకవుమ్మడిగా హిట్లర్ నాజీపక్షంలో చేరిపోయారు. రస్సెల్ అన్నట్టు, మార్క్సువాదానికో వ్యా[illegible]త్రంగా కల్పించిన [illegible]

కూపానికి హిట్లర్ వాస్తవిక రూపమిచ్చాడు. జాతిలోని అంతర్గత కారణంవల్లనే—ప్రజల్లో భావవిప్లవం, భావవికాసం జరగకపోవడంవల్లనే హిట్లరైట్ నాజీజం విజృంభించింది. హిట్లరు దేవతామూర్తి అయ్యాడు!

అందువల్ల జనాన్ని అజ్ఞానంలోవుంచి యేదో జరిగిద్దామని ఆశిస్తే, అది యెన్నడూ జరగదు. ముందు తామెవరో జనానికి తెలియాలి. కూటికేకలువేస్తూ, అభ్యుదయ నినాదాలిచ్చేవారిలో యెవరెవరో, తమ శ్రేయస్కాములెవరో, జనం అర్థం చేసుకో గలగాలి. 'లోకాస్సమస్తాస్సుఖినోభవంతు' అనే దానికిముందు 'గోబ్రాహ్మణేభ్యః శుభమస్తునిత్యం' అనే ఆకాంక్ష యెందుకుందని వివేచించే జ్ఞానం జనంలో పెరగాలి. అందుకు భావవిప్లవం జరగాలి. ప్రజలంతా భావవికాసం పొందాలి.

యూరపులో శతాబ్దం పైకాలంనుంచి కమ్యూనిస్టు విప్లవ భావాలు ప్రచారంలో వుండిపోయినై. భౌతిక భావవిప్లవం పుంజుకొన్నందువల్ల రాజకీయ విప్లవ ఛాయలు పొడసూపినై. అవి బూర్జువా (జాతీయ) ప్రజాస్వామ్య విప్లవాలుగా మాత్రమే ఆగిపోయినై కాని కార్మిక(వర్గ) విప్లవాలు జరగలేదు. జరిగినచోట్ల విఫలమైనాయి. కారణం సామాజిక విప్లవం రానిలోపమే. సామాజిక చైతన్యం లేనిలోపమే.

విప్లవం రక్తప్లావితం మాత్రమే కానవసరంలేదు. భావవికాసంతో కూడిన సామాజిక విప్లవం రానప్పుడే ఆ అవసరం వున్నట్లు కన్పిస్తుంది. జరిగే తిరుగుబాటులూ, కొట్లాటలూ, పోరాటాలూ, కల్లోలాలూ అన్నీ విప్లవాలుకావు. సోషలిజం పేరుతో సాగినంత మాత్రాన ప్రభుత్వాలన్నీ ప్రగతి కాముకాలు కానవసరం లేదు. నాజీ హిట్లరు ఆదర్శం కూడా ''నేషనల్ సోషలిజమే.'' ఈనాడు ప్రపంచంలో సోషలిజం పేరుతో సాగుతున్నదంతా నేషనలిజమే.

వర్గచైతన్యమనేది ఒక తప్పుడు సమాసం (wrong phrase) వర్గచైతన్యంయెక్కడవుంది? యెప్పుడువుంది? యెక్కడ వచ్చింది? దాయాది మాత్సర్య మనేదాన్ని యీనాడు ''సవర్గ మాత్సర్యం''గా చెప్పుకోవాలేమో? లేకుంటే యీనాడు కార్మికవర్గ రాజ్యాలనబడే వాటిమధ్య, సోషలిస్టు రాజ్యాలనబడేవాటిమధ్య జరుగుతున్నదేమిటి? ఎందుకా వైరాలు? ఎందుకా యుద్ధాలు?

రష్యా × యుగోస్లేవియా, యుగోస్లేవియా × ఆల్బేనియా, రష్యా × చైనా, చైనా × వియత్నాం, వియత్నాం × కంబోడియా— ఎందుకు వాటిమధ్య స్పర్థ? ఎందుకు వాటిమధ్య యుద్ధాలు? ఏమిటి దీని అర్థం? సోవియట్‌రష్యా, యుగోస్లేవియా, జెకోస్లోవకియా, హంగేరీసంబంధాల పూర్వచరిత్ర యేమిటి?

ఇందులో మన అభిమానాన్నిబట్టి ఒకరికోపు కాయడమూ, దురభిమానాన్నిబట్టి రెండవ వారిని రివిజనిస్టులు, బూర్జువాలు, సామ్రాజ్యవాదులు, విస్తరణ దురహంకారులు, జాతీయ తీవ్ర [illegible] నద్దు శబ్దంతో ముద్రలు వేయకుండా నిష్పంగ

బుద్ధితో ఆలోచిస్తే యే కమ్యూనిస్టు కార్మికవర్గ రాజ్యం జాతీయ వాద పరిధిని దాటివచ్చింది? ఎమ్. ఎన్. రాయ్ అన్నట్లు యీనాడు మనం కమ్యూనిజం పేరుతో చూస్తున్నదంతా యెర్రరంగు వేసుకొన్న జాతీయవాదం (Nationalism Painted red) కాదా ? లేకపోతే ఒక కార్మిక వర్గరాజ్యం (!) పొరుగు కార్మిక వర్గరాజ్యంతో ఆధునిక మారణాయుధ సంపత్తితో యుద్ధాలు చేయడమనేది యేలా సంభవిస్తున్నది ? సరిహద్దు వివాదాల్లోకి దిగి, పొరుగు రాజ్యాల్లోని ప్రాంతాలు తమకు చెందిన వనితగాడడంయెలా సంభవిస్తున్నది. ఆ వైఖరి సోషలిస్టులదా ? నేషనలిస్టులదా? సామ్రాజ్యవాదం యెలా వుంటుంది ? ఇలాకాదా ?

మార్క్సిజం—లెనినిజం ప్రకారం ఆ పోరాటం జరగవలసింది విస్తరణ వాదులైన పెట్టుబడి దారీ రాజ్యాల మధ్య కదా ? కానీ ఈనాడు మనం చూస్తున్న దేమిటి ? ఒక్క నినాదాల్లో తప్ప, అంత ర్జాతీయ కార్మిక వాదమనేది సిద్ధాంతంలో కానీ, ఆచరణలో కానీ కన్పిస్తున్నదా ?—లేదు ఎందువల్ల?

పైగా మార్క్సిస్టు వ్యాఖ్యానాలకు విరుద్ధంగా పెట్టుబడి దారీ రాజ్యాల మధ్య అంతర్జాతీయ ఐక్యత కన్పిస్తున్నది కదా ? ఎందువల్ల ? అది యేవిధంగా జరుగుతున్నది ?

అందువల్ల వర్గ వాదులకు పునరాలోచన అవసరమని తేలుతున్నది.

వర్గ దోపిడి, వర్గ శత్రుత్వం, వర్గ చైతన్యం వంటి పడికట్టు పదాల ప్రయోగం మాత్రమే అభ్యుదయ చిహ్నం కాదు. పెట్టుబడిదారుల వంకబెట్టి తిట్టు కవిత్వం చెప్పడం ప్రగతివాదం కాదు. పేదవాడి ఆకలిని అధికార సోపానా లెక్కడానికి ప్రచార సాధనంగా వినియోగించుకొనే రాజకీయ నాయకులంతా అలాంటి రంకెలు వేసే వారే. పెద్ద పెద్ద పేర్లు పెట్టుకొన్నంత మాత్రాన అధికార రాజకీయాలూ, అవకాశవాద రాజకీయాలూ అసలు రాజకీయాలు కానేరవు.

ఇందిరాగాంధీ రాజనీతి వేత్త కాదు. రాజకీయ వ్యూహ రచయిత కాదు. అందువల్లనే వెనుకబడ్డ రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు కూడా ఆమె అధికార పీఠాన్ని రక్షించలేక పోయాయి. ఆమె వోటమికి కారణం ప్రజల చైతన్యం కాదు. కానీ ఆ తాత్కాలిక ప్రజావెల్లువనే చైతన్యంగా భ్రమించడం, వర్ణించడం జరిగినై. ప్రజలు ఆమెను గద్దె యెక్కించడంలో యెంత విచక్షణా జ్ఞానాన్ని వినియోగించారో, దించడంలోనూ అంతే విచక్షణాజ్ఞానాన్ని వినియోగించారు. భావ వికాసంలేని వారి చేతిలోని వోటు, గుడ్డివాడి చేతిలోని రాయి ఒకటేనని రుజువు చేశారు.

ఇందిరను వోడించిన వుత్తరాది రాష్ట్రాలవారు చైతన్యవంతులైతే, ఆమెకే వోటు చేసిన దక్షిణాది రాష్ట్రాలవారు జడులు కావాలి. ఇందిరకు వోటిచ్చిన దక్షిణాదివారు చైతన్యవంతులైతే ఆమెను వోడించిన వుత్తరాది వారు మూఢులుకావాలి. అంతే కదా మరి ?

తెలంగాణా వుద్యమం, ఆంధ్రోద్యమం, ఉక్కువుద్యమం... చూచాం. ఇంకాయెన్ని చూడబోతామో !

ఐతే ఆందోళనలన్నీ విప్లవాలు కావు. ఎక్కడయేమి జరిగినా, దాన్ని రాజకీయంగా మార్చడం రాజకీయంకాదు. ప్రజల సమస్యలు ప్రజల సమస్యలేకాని రాజకీయపార్టీల, నాయకుల సమస్యలు కారాదు. కానీ యీ రోజుల్లో పార్టీల సమస్యలు, నాయకుల సమస్యలు, గ్రూపుల సమస్యలు ప్రజల సమస్యలై కూర్చుంటున్నాయి. ఈ విషయంలో రాజకీయ పార్టీలవారందరూ పెద్ద మనుషులే. అందరూ యెత్తుగడల పేరుతో సమస్యల్ని సృష్టించి జారార్లు చేసేవారే.

అందువల్ల కావలసింది మూకల కల్లోలం కాదు — మానవ చైతన్యం. అది మానసిక చైతన్యం. దానికి సాధనం భావవిప్లవమే. అది సామాజిక పరం కాలేదు. భావ విప్లవం సామాజిక విప్లవం కావాలి. సంపద కంటె ముందుగా భావాలు (సామాజిక విప్లవ భావాలు) సంఘపరం కావాలి. అప్పుడే మనుషులకు కావలసిన నిజమైన వ్యవస్థ — మానవవాద వ్యవస్థ సాధ్యమవుతుంది.

మనుషులందరి ''యిష్టం''తో నిమిత్తం లేకుండా, కొద్ది మంది వ్యక్తులు—అధికారం హస్తగతం చేసుకొన్న ''ఒకరో—ఇద్దరో — ముగ్గురో'' మనుషులందరి పైన యేదైనా వ్యవస్థను రుద్దడం మానవతా విధానం కాదు. అది కమ్యూనిజమూ, సోషలిజమూ కాదు. అది మనుషుల్ని గొర్రెల మందలుగా చేసి కసాయీ వృత్తిని చేసేట్టి నిరంకుశ నియంతల టోటలిటేరియనిజం.

ఏ వ్యవస్థ యెందుకు కావాలో, అది కోరుకొనే మనిషికి తెలియాలి. తెలుసుకోగల జ్ఞానం, తెలుసుకొనే హక్కు మనుషుల కుండాలి. తీయని పేరు వెనక వుండే దుర్గంధాన్ని వాళ్లు గమనించ గలిగి వుండాలి.

నాయకులూ, రాజ్యాంగ రథసారథులూ ప్రేరేపిస్తే యిరుగు పొరుగు రాజ్యాల్లో వున్న కార్మికులు పరస్పరంవూచకోత కోసుకొనే రాజ్యాంగ వ్యవస్థ- అది కమ్యూనిజం పేరుతో వున్నా, మరొక తీయని పేరుతోవున్నా అభ్యుదయ నిరోధకమైనదే. అది కమ్యూనిస్టులమధ్య యుద్ధంకాదు—రాబట్లమధ్య యుద్ధం. పేరులోవున్న నాగరికార్థం దేని పాశవికతత్వాన్నీ మార్చలేదు. మరి ఆ విషయం తెలుసుకోవలసిన అవసరం 'సామాన్య మానవుడికి' వుంది.

అందువల్ల వెనకబడ్డ దనుకోబడుతున్న యీ దేశం కూడా నినాదాలతో మోసపోరాదు.

ఈ దేశంలో అనాదిగా జరుగుతూ వచ్చింది ''యాంటీ భావ విప్లవం''. అందువల్ల యిక్కడ ''యాంటీ సామాజిక విప్లవ పరిస్థితులు'' స్థిరపడిపోయినై. భావ విప్లవంలోనే వాటిని బద్దలు కొట్టాలి.

కాని, ఈ విప్లవ కవులు — కమ్యూనిస్టులు నేటి రష్యా చైనా వియత్నాముల స్పర్థల ద్వారా అంతర్పరీక్ష చేసుకోకపోతే, వీరు కాంక్షించే ప్రజాక్షేమం, ప్రపంచశాంతి చేకూరలేవు. ఈ శతాబ్దంలో, కారల్ మార్క్సు వ్రాసిన క్యాపిటల్ గ్రంథం కలిగించిన

ఏ రాజకీయ విప్లవాలూ అనుకొన్నంతగా వాటిని సాధించలేవు.

రాజకీయ వ్యవస్థలు వస్తున్నాయి, పోతున్నాయి. కానీ అహేతుకతకు తాకట్టుపడ్డ మానవ మనస్తత్వానికిమాత్రం విముక్తి చేకూరటంలేదు.

ఈ దేశంలో మొదటిసారిగా రెండున్నరవేల సంవత్సరాలకు పూర్వం లోకాయతులు, చార్వాకులు కుల మత – పరతత్వాలమీద నిలబడి పోరాడినట్లు తెలుస్తుంది. తర్వాత జైనులు, బౌద్ధులు వైదికాచారకాండమీద ధ్వజమెత్తారు.

అనంతరం యెందరో సాంఘిక విప్లవవాదులు కులతత్వం మీద, మూఢ మతాచారాలమీద దాడి చేశారు. ఐనప్పటికీ కుల విభాగం, విభాగ విధానం సాంఘిక జీవనంలో భాగమైపోయింది. ఫలితంగా క్రైస్తవులేమి, యితర మతాలవారేమి కులాల ప్రకారం యెవరి గూటిలో వారు దూరిపోయారు. కాగా దైవం, మతం, కులం, మూఢ విశ్వాసాలు, దురాచార దుస్సాంప్రదాయాలు—వాటిని ఆశ్రయించుకొని లాభిస్తున్న వ్యక్తులూ, వర్గాలూ, సమాజాన్ని ఆర్థికంగా పీడిస్తూ, సాంఘికంగా అంతరాలు పెంపొందిస్తూ, మానసికంగా దాస్య భావం నాదుకొల్పడం జరిగింది; ఇది యింకా జరుగుతూనే వుంది. భావాలు వికసించకపోతే ముమ్ముందు కూడా అలా జరుగుతూనే వుంటుంది.

అందువల్ల ప్రగతి నిరోధక శక్తుల్ని యెదుర్కోవాలి. సమగ్ర మానవ వికాసాన్ని సాధించాలి. అందుకోసం అభ్యుదయ కాముకులంతా వాదభేదాలతో నిమిత్తం లేకుండా కలిసి పనిచేయాలి. ఇతర విభేదాలు యీ కృషిలో అడ్డురావలసిన పనిలేదు.

జరిగితే గిరిగితే వర్గ సంఘర్షణలకూ, విప్లవాలకూ, లేక యితర వ్యాపకాలకూ యీ సామాజిక భావ విప్లవ కార్యక్రమాలూ, సన్నాహాలూ యేవిధంగానూ అడ్డురావు. అడ్డువస్తాయనే వుద్దేశం తోనే యింతవరకు యీ దేశంలో రాజకీయ స్వాతంత్ర్య పోరాటం ప్రారంభమైన నాటినుంచి నేటివరకు జరిగిన తతంగంలో – రాజకీయ నాయకులు స్వీయ రాజకీయ ప్రయోజనాలకోసం కుల—మత—దైవాలను వాడుకొన్నారు. ఇది యిలాగే కొనసాగితే యీ దేశ రాజకీయ—ఆర్థిక—సాంఘిక పరిస్థితులు యింతకంటె ముందుకు సాగుతాయని వూహించడం అవాస్తవికంగా వుంటుంది.

అందువల్ల మనం ఆచరించబోయేముందు ఆలోచించాలి. అందరినీ ఆలోచించనీయాలి. ఆలోచించే స్వేచ్ఛమాత్రమే కాదు—ఆలోచించగల శక్తికూడా యితరులకు కలిగేట్లు చూడాలి. వూరక ఆవేశాల్లో, వుద్రేకాల్లో జనాన్ని ముంచెత్తటం ఆరోగ్యంకాదు. అది ఆలోచనా రహితమైన ఆచరణకు దారితీస్తుంది. ఆలోచనారహితంగా ఆచరించడం మానవ లక్షణంకాదు.

ఐతే మనం ఆలోచిస్తున్నామా, లేదా, అనే విషయాన్ని గురించి కూడా ఆలోచించాలి. నిజంగానే మనం సొంతంగా ఆలోచిస్తున్నామని గుండెమీద చెయ్యి వేసుకొని చెప్పగలగాలి.

ఎందుకంటే అయినదానికీ, కానిదానికి మతస్థులు తమ మత గ్రంథాలమీదనో, గురు బోధలమీదనో ఆధారపడుతున్నారు. మనం కూడా అస్వతంత్రులమై, విచక్షణారహితంగా యితరుల ఆలోచనల్నే మన ఆలోచనలుగా భ్రమించి, నాయకుల ప్రబోధాలకూ, ప్రలోభాలకూ దాసోహమని చిత్తశుద్ధికి భిన్నంగా ప్రవర్తిస్తే, యిక మతస్థులకూ—వారి వాదాన్ని కాదనేవారికి తేడా యెక్కడ?

అందువల్ల భావవికాసం ప్రాథమికావసరం. భావవిప్లవం ప్రథమ కర్తవ్యం దానికి స్వతంత్రాలోచన ప్రథమసోపానం

అందరికీ స్వేచ్ఛకావాలి – అన్నిటికీ స్వేచ్ఛ కావాలి.

ఆలోచించడానికి స్వేచ్ఛవుంటే, ఆచరించటానికీ, అనుభవించటానికీ స్వేచ్ఛను సాధిస్తాం, ఐతే ఆలోచనా స్వేచ్ఛ మనలో యెంతమందికి వుంది ?

ఎందుకంటే ఆలోచనా స్వేచ్ఛ అతి భయంకరమైనది.

దేవుడున్నాడా, లేడా అని ఆలోచించడానికి భయం.

మతంయొక్క మంచి చెడ్డల్ని గురించి ఆలోచించడానికి భయం.

మన విశ్వాసాలు తప్పేమో అనుకోడానికి భయం.

మరొకరి విశ్వాసాలను సమ్మతించడానికి భయం.

ప్రాణంసైతం వదలుకోడానికి సిద్ధపడే మనకు మన విశ్వాసాలను వదలుకోడానికి భయం.

ఇలా విశ్వరూపం ధరించే భయమంతా స్వేచ్ఛాభయమే. (Fear of freedom).

స్వేచ్ఛ అంటే యేమిటో అవగాహన చేసుకోకుండానే, స్వేచ్ఛకోసం పరితపిస్తాం. బానిసత్వంకోసం పోరాడుతూ కూడా అదే స్వేచ్ఛ అని భ్రమిస్తాం అందువల్ల స్వేచ్ఛను గుర్తించడానికి కూడా భావవికాసం కావాలి. బందెలదొడ్డి రాజకీయాలు భావ వికాసానికి మార్గాలుకావు.

స్వేచ్ఛ అనేది అత్యుత్తమమైన మానవ విలువ. స్వతంత్రం వున్నప్పుడు దాని విలువ తెలియదు. కడుపునిండాతిండి లభిస్తున్నప్పటికీ నిర్బంధం (ఖైదు)లో వున్నప్పుడు తెలుస్తుంది స్వాతంత్ర్యం విలువ.

గాలీ, నీరూ పుష్కలంగా దొరుకుతున్నాయి కాబట్టి వాటి విలువ తెలియదు. కొరవడినప్పుడు తెలుస్తుంది వాటి విలువ. అంతటా విస్తరించిన గాలి ఐదునిమిషాలపాటు మనకు దూరమైతే, అప్పుడు తెలుస్తుంది దాని విలువ యెంతో.

ముట్టుకొన్నదంతా బంగారం కావాలని కోరుకొన్న మైదాసుకు ఆహారం ముట్టుకొన్నప్పుడు ఆహారం విలువ మాత్రమే తెలిసింది. కూతురును ముట్టుకొన్నప్పుడు తెలిసింది ప్రేమ విలువ యెంతో, జీవితం విలువయెంతో—బంగారం విలువయెంతో !

అందువల్ల స్వేచ్ఛయొక్క విలువ గ్రహించడానికీ, అనుభవించడానికి కూడా భావ వికాసం పొందడానికి యే వర్గతత్వాలూ, మతతత్వాలూ అడ్డురాకూడదు.

భావోద్యమాలు వద్దనేవారు తమ సొంత రాజకీయ ప్రయోజనాలమీద దృష్టి కేంద్రీకరించుకొంటున్నారు. అందుకువారి ఆదర్శ వాదం (మతదృక్పథం) దోహదం చేస్తున్నది. ఆ ఆదర్శ సాధనలో

మతస్థుల్లాగా వారు కూడా సదసద్వివేకాన్ని కోల్పోయి యెలాంటి కార్యాచరణకైనా సిద్ధపడతారు.

అలా జరగటానికి కారణం అధీనభావం — సెల్ఫ్ ఎస్ట్రేంజ్ మెంట్, వైమనస్యం — ఎలైనేషన్.

మనిషి తనను మరొక వ్యక్తికో, సిద్ధాంతానికో తాకట్టు పెట్టుకొనే మనస్తత్వాన్ని మార్క్స్ సైతం గర్హించాడు. దాన్నే మార్క్స్ ఎంతో స్పష్టంగా Placing himself in men other than and differentiated from himself అని వర్ణించాడు.

అందువల్ల భావోద్యమాలపట్ల జుగుప్సాభావం పెరిగేటంతగా వర్గభావం పట్ల అధీన మనస్తత్వం పెరగటం ఆరోగ్యకర లక్షణం కాదు.

మనిషి విశిష్టమైన సృజనాశక్తి కలవాడు. అతని సృజనా శక్తి బహుధా వికసించింది.

దైవాన్నీ, మతాన్నీ, సంఘాన్నీ, రాజ్యాన్నీ యితర వ్యవస్థలనూ సృష్టించుకొన్నవాడు మనిషే. ఐతే అతని సృష్టి అతని వ్యక్తిత్వాన్ని బలి కోరరాదు. అందుకోసం వాటి నతడు సృష్టించుకోలేదు.

చివర కీనాడు తన సృష్టికి తన వ్యక్తిత్వాన్ని బలి పెట్టని మనిషి సృష్టి కావలసిన అవసరమే మిగిలిపోయింది.

అలాంటి స్వతంత్ర భావుకుణ్ణి, స్వేచ్ఛా మానవ సమాజ నిర్మాతని సృష్టించడానికి తోడ్పడగలిగింది భావ వికాసోద్యమ మొక్కటే; జాతి, మత, వర్ణాది సమిష్టి అహంభావాలు దానికి అడ్డు నిలవకూడదు.

అందువల్ల ముందు మనం మనిషిని సృష్టించాలి. మనిషి లోని మనుష్యత్వాన్ని మేల్కొల్పాలి. ఇతరులకు దత్తం చేయబడిన మనుష్యత్వాన్ని తిరిగి మనిషి రాబట్టుకొనేట్లు చూడాలి. అదీ మన ప్రథమ కర్తవ్యం.

*శ్రీ రావిపూడి వెంకటాద్రి*

# దినకర్‌జీ విమర్శ

## ఏది దుర్విమర్శ ?

ఒక చెంప మీద కొడితే ఇంకొక చెంప ఇచ్చి కొట్టించుకుని ఒళ్ళు హూనం చేసుకుని మహాత్ముడిని కాదల్చుకోలేదు కాబట్టి— 'ముల్లు'ని 'ముల్లు'తో తీయటమే నా ధ్యేయం కాబట్టి—అం కె. గారికి అలా సమాధాన మివ్వక తప్ప లేదు.

## బజారు మాటల్లో సాహిత్య విలువల్లేనా ?

మాట కొస్తే—బజారులో దొరికిన పూలకి పరిమళముండ దని వాదించగల సమర్థులే — మీరు — తీరా ఆచరణ కొస్తే—మీరే వాటిని కొనగలరు కూడా. సాహిత్యం గానీ, తత్సంబంధమైన విలు వలుగానీ, జీవితంతో ముడిపడి వున్నన్నాళ్ళూ—ఆ జీవితం బజార్ల మధ్య ఫుట్‌పాత్‌ల మధ్య ప్రవహిస్తున్నన్నాళ్ళూ—(ప్రభుత్వాలు మారినా, సిద్ధాంతాలు మారినా) బజారు మాటలు కూడా సాహిత్యా వతార మెత్తుతాయి, తప్పని సరి.

తవ్వకాల్లో తేలిన రాజప్రాసాదాల శిథిలాల్లో చచ్చిపోయిన మాటలో, లైబ్రరీ షెల్ఫుల్లో అసూర్యంపశ్యలుగా మిగిలి వడలి పోతున్న పుస్తకాల్లో ముక్కి పోయిన మాటలో, ఈ నాడు సాహిత్య విలువల్ని నిర్ణయించటాన్ని ఎంతమాత్రం సహించేదిలేదు.

బజారు మాటల్తోనే సాహిత్యంమీద ధ్వజమెత్తిన వేమన తర్వాత200 ఏళ్లు నడిచినా, బజారు మాటల్తోనే సాహిత్యం మీద చెంపదెబ్బకొట్టి ఒప్పించిన దిగంబర కవిత్వం తర్వాత 15 ఏళ్లు పరిగెత్తినా, ఇంకా కనీసం చూరైనా లేని శూన్యాసకి వేలాడే వారి నేమనాలి ?

- అ పా ర్థ ం

రంగనాయకమ్మనూ, ఇందిర హస్తాన్ని ఎందుకు పేర్కొ న్నానో అర్థం కాక, అది నా "అభిమాన పురస్సరమైన ఉప దేశంగా" అర్థం చేసుకో గలిగితే ఏమనాలి ? (ఎందుకైనా మంచిది మరోసారి చూ. ఫిబ్రవరి '79 భారతి—కలగూరగంప.)

అర్థం చేసుకోక పోయినా పోయిందేం లేదు. కానీ, అపార్థం చేసుకొంటేనే ఇవన్నీ ఎదురవుతయ్.

అన్ని భావాలకూ మంచి వేదికగా నిలుస్తున్న 'భారతి'కి గీతలూ - గిరులు గీయటానికి ప్రయత్నించటం 'సంకుచితత్వం' కాదా ? ?

*శ్రీ నందిని సిధారెడ్డి*

# లేఖలు

## తెలుగు సామెత-సంస్కృతీకరణ

భారతి—జూన్ '79 "తెలుగు సామెత-సంస్కృతీకరణ"— ఆంగీరసగారి చర్చపై నా సూచనలు :—

"అజాశనాః పరం యాతా
ఆయాతా మహిషాశనాః"

అనే సంస్కృతీకరించబడిన సామెతకు మూలం-

1 "కోళ్లను తిన్నవారు పోయి
గొర్రెలను తినే వారు వచ్చారు" అనేను, అని "ఆంగీరస" గారు పేర్కొన్నారు.

2 'గొర్రెల్ని దినేవాడు బోతే
బర్రెన్ని దినేవాడు వస్తాడు'' అనేది వాడుకలో ఉన్నసామెత అనీ, ఆ సామెత ప్రకారమే సంస్కృతీకరణ జరిగిందనీ నేను సూచించాను. (మే 79 భారతి-లేఖలు.)

మొదటి సామెత కూడా వాడుకలో వుండవచ్చుగానీ, పై సంస్కృతీకరణకు మూలం రెండో సామెత (నేను చూపినది) మాత్రమే. సంపాదకులు తాము ఎరిగినదే సరైన మూలం అని తమ సమీక్ష (మార్చి 79 భారతి భ్రాతృ లేఖః-- గ్రంథ విమర్శలు)లో భావించారు. దాన్ని నేను "తప్పుగా చూపించారు" అన్నాను. వారు చూపించిన తెలుగు సామెత పాఠం సంస్కృతానికి

సరైనమూలం కాదు. గనుక ''తప్పు'' కాక ఒప్పుఎలా అయిందో నాకూ తెలియడం లేదు !

''తెలుగు సామెతలు—ఒకే అభిప్రాయం గలవి ఎన్నో ఉన్నాయి.'' అని ఆంగీరసగా రన్నారు. కాబట్టి సంస్కృతీకరణకు సరైన మూలపుసామెత ఎట్లా వున్నదో వారు విచారించి వుండ వలసింది. నేను 'తప్పు' అన్నానని వారెందుకు అభిప్రాయపడు తున్నారో, సరైన మూలపు సామెత చూపిన తర్వాత గూడా ? (డి. వి. నరసరాజుగారి సినిమాపాట ఉదాహరించాను.)

1 పై రెండో సామెత ప్రకారమే సంస్కృతీకరణ జరిగిందని నేను సూచించాను. దాని మీద వారు అది సరియైన సంస్కృతీ కరణ కాదని అభిప్రాయపడుతున్నారు.

1 'అజ' శబ్దానికి నిఘంటువులలో గొర్రె అని అర్థం వున్నా అది ప్రసిద్ధం కాదు అని ఆంగీరసగారు అనటం న్యాయం కాదు. ఒక శబ్దానికి ప్రసిద్ధంగా ఉన్న అర్థంలోనే దాన్ని వాడాలన డం సహృదయత అవుతుందా ? వారు తమ సమీక్షలో సూచించిన లోపాన్ని, వేరే విధంగా నైనా (లోపం గానే), పునరుద్ఘాటించాలని ప్రయత్నించడం తప్ప మరేమీ కాదు.

(2) అజా (ఆకారాంత స్త్రీలింగ) శబ్దానికి ఆడమేక అని అర్థం. అకారాంత పుంలింగ మైతే (అజః—అజము) మేక పోతు అని అర్థం. మహిష శబ్దానికి దున్నపోతు అనీ, మహిషికి బర్రె అనీ అర్థం. మేష శబ్దానికి పొట్టేలు, మేషికిగొర్రె అనీ అర్థం.

మేషి - మహిషి — శబ్దాలను సంస్కృతంలో వాడవలసి ఉండగా, సంస్కృతీకరించినవారు అజ—మహిష శబ్దాలు వాడారనీ, అవే మంతగా పట్టించుకో దగ్గవి కావనీ నేను సూచించాను.

(3) ఆంగీరసగారు ప్రయత్నించి కుదిర్చిన సంస్కృతీ కరణ యిట్లా వున్నది—

''గతా మేషాశినాః సంప్ర
త్యాగతా మహిషాశనాః

ఇందులో నేను చెప్పిన ''యతి ప్రాసల కూర్పు'' రానే లేదు. ఇతర భాషలలోకి అనువదించేటప్పుడు రావాలంటే సామాన్యంగా కుదరదు—అన్న నా మాటకు లక్ష్యంగానే వున్నది యీసంస్కృతీ కరణ. భ్రాతృలేఖలోని సంస్కృతీకరణంలో ఆద్యక్షరమైత్రి అయినా కుదిరింది. ఆంగీరసగారి కూర్పులో యతిగాని ప్రాసగాని కుదర లేదు కద ?

*శ్రీ బండి నాగరాజు*

## ఆశు సాహిత్యం

డా. వెల్చేరు నారాయణరావుగారి 'తెలుగులో కవితా విప్ల వాల స్వరూపా'న్ని సమీక్షిస్తూ (జూలై, '79) శ్రీ మరుపూరు కోదండ రామరెడ్డి ''ఆశుసాహిత్యం ఓరల్ ట్రెడిషన్ అనే దానికి మంచి పేరు'' అని తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అయితే ఈ అభిప్రాయం సరికాదని చెప్పడానికి చింతిస్తున్నాను.

డా. నారాయణరావు తమ గ్రంథంలో వాడిన ఆశుసాహిత్య— మనే పదం 'ఓరల్ ట్రెడిషన్'కు సమానపదం కాదు. మౌఖిక సంప్రదాయమే మూలపదం స్వరూపాన్ని చాలా వరకు తెలియ జేస్తుంది. మౌఖిక సంప్రదాయానికి చెందిన వాటిలో జానపద సాహిత్యం ఒకటి. డా. నారాయణరావుగారు ''జానపద వాఙ్మయం, ప్రజా వాఙ్మయం, ఇత్యాది పేర్లు అక్షరాస్యులైన ఉన్నతవర్గాల వాళ్ళు ఆదరణ దృష్టితో ఇచ్చిన ముద్దుపేర్లే కాని, ఆ సాహిత్యపు నిజస్వరూపాన్ని ఆవిష్కరించేవి కావు'' అని వ్రాయడంవల్ల(పు.4) వారికి అలిఖిత సాహిత్యమైన జానపద సాహిత్య స్వరూపం సంపూర్ణంగా తెలియదని అనుకోవలసి వస్తుంది.

ఆశువుగా చెప్పడం అన్నది అలిఖిత సాహిత్యానికి ఉన్న అనేక గుణాలలో ఒకటి మాత్రమే జానపద సాహిత్యాన్నంతటినీ దృష్టిలో ఉంచుకొని లక్షణ నిర్దేశం చేయవలసి ఉంది. అంటే గేయాలు, కథాగేయాలు (వీరగాథలు మాత్రమే కాదు), గద్యకథలు, సామె తలు, పొడుపుకథలు - ఇవన్నీ అలిఖిత సాహిత్యమే. అదీకాక భాషా పరంగా, ఛందోపరంగా, ఏవో కొన్ని ఉదాహరణలు మాత్రం తీసు కొని, అలిఖిత లేక మౌఖిక సాహిత్యాన్నంతటినీ ఆశుసాహిత్యంగా నిరూపించబూనడం సాహసమనాలి.

గురజాడను అసంపూర్ణ విప్లవానికి ప్రతినిధిగా చెప్పడంలో కూడా సమగ్ర దృక్పథం లోపించింది. వాటి విషయం మరోసారి.

*డా సుందరం*

## అభిప్రాయ సేకరణ

డా. మురళీధర్‌గారు జూలై, 1979 -''భారతి''లో ఇలా అన్నారు:

''అసలు ఇటీవల 'భారతి'లో ప్రచురింపబడే, అభ్యుదయపు పేరుతో రచించిన కవిత్వాలు, తలా తోక లేని రచనలు చూస్తే పాత కాలపు కవిత్వాలు ఎన్నోరెట్లు నయమనిపిస్తుంది అసలు రచయిత ఏమి చెప్పదలచు కొన్నాడో, కొద్దిగా జ్ఞానము కల మన వంట వారికే తోచకపోతే...''

కవితల విషయంలో నేనీ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను. సాహిత్య పాఠకలోకంలో 'భారతి' అభిప్రాయాలు సేకరిస్తే అత్య ధికులు నాలాగే ఏకీభవించవచ్చునని కూడా నమ్ముతున్నాను. ''అన్ హెల్తీ ఇన్‌హిబిషన్'' మంచిదికాదు కాబట్టి ''భారతి'' ముందుకు వస్తుందని ఆశిస్తూ ఈ లేఖ వ్రాస్తున్నాను.

*శ్రీ రావి రంగారావు*

ఆగష్టు భారతి ('79)లో ప్రచురించబడిన విసుర్మనా వ్యాసాన్ని—'శేషేంద్ర చారిత్రక అవసరం కవిసేన!' అనే శీర్షికకు బదులుగా 'శేషేంద్ర చరిత్రకు అవసరం కవిసేన!' అని చదువుకో వలసిందిగాకోరుతూ—

*శ్రీ నందిని సిధారెడ్డి*

# గ్రంథ విమర్శలు

## కర్షకుడా ! కార్మికుడా !!

[గేయ సంపుటి. వాసాల నర్సయ్య. క్రౌన్ 1/16, 50 పేజీలు, వెల : 2-50, ప్రతులకు : వాసా శౌరి, తెలుగు పండిట్, 2-1-50/ఇ, మెట్‌పల్లి, కరీంనగర్ జిలా -505 325.]

ఈ గేయాలలో మనసు పండబారుతూ—తన్నుదాను తెలుసుకొంటూ—సంస్కార వాసనలు అలవరచుకొంటున్న ఒక కవి మృదు హృదయం ప్రతిబింబిస్తున్నది. భావాలను వ్యక్తం చేసిన భాష సరళంగా నడచి, మంచి నుడికారాన్ని పెంపొందజేసుకొని ఉన్నది; శైలిలో ఒక సౌందర్య మున్నది.

ఈ కవి మాతృభక్తి చదివిన వారిని చకితం చేస్తున్నది "ఆకటి మంట కాలెడు కడుపు తల్లికె గోచరించును — పెళ్ళాము ముల్లెయను జూచును, కన్నతలి యె కడుపు చూచును" అంటాడు "పండుటాకులు మనసు కేవో పాఠములు గరపంగ జూచును" అని ప్రకృతి పాఠాల గుర్తించమంటాడు. "కష్టపడుచు బ్రతుకు చీమ, కలిసి మెలసి బ్రతుకు చీమ" అని దానిని చూచి బ్రతుకు దెరువు నేర్చుకోమంటాడు. చిలుకను గూర్చి చెప్పిన భావన యింపితంగా ఉన్నది — "పండు పండును బొడవ పండెవో నీ ముక్కు"— అనుట. సంక్రాంతి ముగ్గును చూచి "ముగ్గులోని అందానికి మురియబోకు, గాని, దాని ముడులవలె జీవితాన సుడులున్నవి కను" మన్న పాఠాన్ని గమనిస్తే భూతల జీవి బాగుపడగలదు. ఇది కవిని ఆధ్యాత్మిక పథాన నడిపిస్తున్నది; కాబట్టే మతం లేకుంటే మానవత బాగుపడదంటాడు. ఈదృష్టి ఉండబట్టే, గ్రామ సౌభాగ్యాన్ని సౌమనస్యాన్ని చెడగొట్టే రాజకీయ పిశాచంపైన విరుచుకొనిపడుతు బాగా నూకులుబెట్టినాడు. "ధరణిమాత తనువులోని నలములట్టు కాల్వలెవ్వో పరచుక పారుచునున్నది" అని పోచంపాడు ప్రాజెక్టును వర్ణించినది కవితా విస్ఫులింగం.

ఈ కవికి అంబేద్కర్ మీద గొప్ప గౌరవం; కాని ఇతర హరిజనోద్ధారకులను విస్మరించడం ఏమంత బాగలేదు.

## వేణీ సంగమం

[ఖండికలు. రావికంటి వసునందన్. క్రౌన్ 1/16, 54 పేజీలు, వెల : రు. 3–50, ప్రతులకు : ఆంధ్రసారస్వత పరిషత్, తిలక్ రోడ్, హైదరాబాదు 500 001 ]

ధారాశుద్ధి — భాషా ప్రౌఢి — భావ పరిమళం గలిగిన సాంప్రదాయిక కవితా ఖండిక లివి. గేయం వృత్తం సరి ఉజ్జీగా నడుస్తున్నవి. చాలా చోట్ల రమ్య కవితా గుణం తళుకొత్తుతున్నది. కవిగా లోకపు తీరుపై కత్తిగట్టుతూ హృదయ మార్దవం చూపుతాడు. "క్రింది మెట్టున దానవత్వము మీది మెట్టున నిర్జరత్వము—నడుమనుంటివి మానవుడవై—దిగెదవో ఎక్కెదవో తెల్పుము" అని, తన్ను పెంచుకొన్నా కుంచుకొన్నా మానవుడే చేసుకోవాలని బాగాచెప్పినాడు. కవికి చక్కటి నిర్వచనం — ఉషా సుందరి కంటికోనల పద్మినీ కర కుట్మలంబుల మలయపవన తరంగ డోలిక నుదయ మందితి — నేను కవిని! ప్రౌఢి శ్లేషలో సౌకుమార్యం దీపించే రచనగూడ చేయగలడు — దోషావరణము లందున్న (పాపము-రాత్రి) జనముల కనుల్ — దెరిపింప, నవ్య జీవనము ఏడి పాలింప — సాధు జీవనము (నీరు — జీవితము) గల్గిన సరసుల(సరసహృదయులు—కొలనులు) మనఃకమల ములన్ విరియింప మిత్రు (సూర్యుడు—స్నేహితుడు)డుదయించె!

భావపూర్ణములైన కొన్ని కమ్మటి నుడికారాలు: — చిరిపి నవ్వుల మెఱుపు తీవెల నందముగ జోడించుకొంటివి నీ సుచేలాంచలమె తిక్కని వాక్కులకు విజయ ధ్వజమ్మో — ఎక్కడ గాంచినను పాపపు రక్కసి తల విరబోతలె ఆలవర్ణ మొకటేనా? పాలవర్ణ మొకటేనోయ్—అన్నది వేమన పద్యానికి అనుకరణమైనా బాగున్నది.

వేణీ సంగమ భాగం కృష్ణ మధుర ప్రేమ వర్ణన "బీటవారిన వారి మానస క్షేత్రాల సంతోషముల పంట బండించు నా మేటి" మంచి భావుకత. —పాల మునిగి వెన్నెల దేలు గోపాలునకేటి కవిత — తన్నుబడి భువికి దిగిన వాగీశ్వరి బొడుగానక వెఱ్ఱిమాపుబడి ముదుసతి బమ్మ నాల్గుదెసల జూచు(నాల్గు ముఖాలు కాబట్టి) మంచి ఊహను మంచిగా చెప్పినాడు.

## ఎఱ్ఱ గులాబి

[పాటల కథలు—పిల్లలను ఆకర్షించే అచ్చు. నార్ల చిరంజీవి. క్రౌన్ 1/16, 48 పుటలు, వెల : రు. 1–25, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ-524 004.]

పెద్దలు పిల్లలకు కథలు చెప్పి విజ్ఞానాన్ని కూర్చడం మన ప్రాచీన సంప్రదాయం; కాని ఈనాడు వినేవారులేరు—అంతకుముందే చెప్పేవారూ లేరు. పాటల కథల ప్రక్రియను చేపట్టిన ఈ కవి ప్రశంసాపాత్రుడు. పాటలలో చెపితే శిశు మానసాలకు బాగా ఎక్కుతవి. అందువల్లనే కవి "ఇపుడే పూచిన పూవులా రా, చెబుతా నొక కథ మీకిపుడు" అంటాడు ప్రాపంచక ఛాయలు అలముకొని స్వచ్ఛ తరుణ మానసాలలో ప్రవేశించిన అంశాలుగట్టిగా పాతుకోనిపోతవి.

ఈ రచన, సరళంగా చిన్న మాటలతో కథ జెప్పే బాల బాలికల మనసులకో విషయం హత్తుకోనిపొయ్యేటట్టు సాగినది. "ఎఱ్ఱ గులాబి"లో ఒక బుల్‌బులి (మన కోకిల కాబోలు—ళూ పాటల రాణి) ఒక తోటలోపాడే ఒక బాలుడితో నేస్తం పెంచుకోని, ఆతని పాటకు పరవశించేది. బాలునికి ఒక ప్రియురాలు జోడై ఎఱ్ఱగులాబిని కోరింది.

బుల్‌బులి గులాబి ముళ్ళతో తన ఎదనుచీల్చి పచ్చి నెత్తురుతో ఆ పువ్వు తెలుపును ఎరుపుజేసి మిత్రునికి కానుకబెట్టి అసువులు బాసినది. ఆ ప్రేమ వారాశి కథే ఈ ఎర్రగులాబి. ఈ త్యాగం భావోద్వేగంతో ఊపివేస్తున్నది. భారతం శాంతిపర్వంలో, అతిథిగావచ్చిన ఒక కరకు కిరాతుని ఆకలి దీర్చేదానికి ఆత్మార్పణం చేసిన పావురం కథవలె ఇది రమ్యంగా ఉన్నది.

''ఉప్పే మధురం'' అన్న గీతం బాలురకు బాగా నచ్చుతుంది. ''ఆలోచన'' మంచి ఎత్తుగడతో, కవితా స్ఫూర్తిగల గీతంతో ప్రారంభమవుతున్నది. ఇందులోనే — మబ్బులు కదిలినా చంద్రుడు కదిలినట్లు కలిగే భ్రాంతిని తొలగించే ఒక బాల శాస్త్రజ్ఞుని వివరణజ్ఞానం బాగా చెప్పబడినది. మొత్తం పుస్తకం అంతా మనోరంజకంగానే ఉన్నది.

ఈ కవి మన కథలను ఇదేవిధంగా బాలబాలికల మనసుల కెక్కేటట్లు కథలుగా వ్రాస్తే బాగుంటుంది. ''దశమినాటి బాలుడు—చంద్రుడు'' అంటాడు—బాగా ప్రాయం మీరినవాడుగదా దశమినాటి చంద్రుడు.

## భావనా తరంగాలు

[గేయసంపుటి. భా. వ. నరసింహం — 1/16 క్రౌన్- 108 పేజీలు; ధర: రు. 3-25; ప్రతులకు: ఆంధ్ర విజ్ఞాన సమితి; మాడల్ ప్రెస్; 137—సాక్చి మార్కెట్; జంషెడ్‌పూర్ (బీహార్).]

భా. వ. నరసింహంగారి ఊహలే భావనాతరంగాలుగా శీర్షికలో ఇమడటం ఒక చెణుకు. ఈ రాష్ట్రేతరాంధ్రకవి (ప్రవాసాంధ్రులనడంలో ఏదో ఒక మచ్చ ఉన్నట్లున్నది.) గేయాలు, వ్రాలబోతున్న కవిప్రాయంతో బాటు పండబారుతున్న ఎద — లోచూపుతో, అలౌకిక నీడల వదలి ఆధ్యాత్మిక వెలుగులోనికి ప్రవేశిస్తున్నవి ప్రకృతి ప్రీతితో కరగిపోతూ శిశుహృదయాన్ని ప్రేమించి, లోకపు పోకడల వ్యాఖ్యానిస్తున్నాడు—ఈ కవి. ఒందు సరసమేగాని విరసంలేదు. అందువల్లనే ''పరుగులిడు కురంగాలు భావనా తరంగాలు'' అని చాటుకోగలుగుతున్నాడు. భావసౌకుమార్యానికి తగినట్లు భాషాపేశలత పదబంధ సౌరభము ఈ గ్రంథమంతా లోతుగా వెడల్పుగా పరచుకొని పోయిఉన్నవి. ఇందలి వివిధ విషయాల పఠనం ఆశాజ్యోతిని చూపి ఆనందాన్ని కలిగిస్తున్నది. వీటి భాషలో ఇమిడిక కనబడుతున్నది.

ఇందు విరిసి గుబాళిస్తున్న నుడికారాలు కొన్ని:- సిగ్గుతో తలవంచి తన నీడనే నీట చూచుకొని మురిసేటి కలువ పూహొయలు, నెలవంక హొయలులో సొంపును జూచి చదువరి ఆనందించగలడు. ''కలలవల''లో ఆదిశంకరుని అధ్యాస వాసనలను కవి మూల్కొంటున్నాడు. ప్రార్థనాయత్త చిత్తంతో ప్రార్థిస్తూ— అరవిందం మంచుకన్నీటితో అభిషేకం చేసింది నీకు, నా హృదయంలో భక్తి రగిలేదెప్పుడు—అని ఆరాట పడుతాడు. ''ప్రగతి'' ఆధ్యాత్మిక వాసనా బంధురము—ఆ మధుమాసవేళ ఆమని నింపె కోరికలు, నిండుగా నవ్వినవి నింగితారకలు; సిగ్గుతోడ వెలదిమోము సంధ్యారాగములు కురియ; వారి ఆనందమే పొంగెనా లేక, నింగిపై వెన్నెలలు వికసించెనా; ''జీవనయాత్ర'' నది అంటున్నది—కరుణతో నను చూచి శిల లిచ్చినవి దారి, పాడుచును దుముకుచును పయనించినాను—అనుటలో మధుర భావుకత ప్రదర్శితమవుతున్నది; ఇట్లే, నదిని చూచి సముద్రం చేసినపని—దూరమున నను జూచి పొంగిపోయిన విభుడు చేతులెత్తుచు నన్ను చేరదీసెను వేగ—అనుట కవితా స్ఫూర్తి కలిగి ఉన్నది.

ఎందుకు- నవ్వులు కురిపిస్తావు ఎల్లవేళలా? నాకు తెలుసు ఆ నవ్వుల వెనుక నీవు దాచుకొన్న విష జ్వాలలు - You may laugh and laugh yet be a Villain అన్న షేక్స్‌పియర్ వాక్యాలు గమనం వస్తున్నవి. ''అంతర్వాహిని''లో కళాపూర్ణోదయంలోని సుగాత్రి శాలీనుల సంగతి బాగా ఇమడ్చబడినది

ఇక రెండు చేదుమాత్రలు:—''పంచరంగుల అంబుదములు'' మేఘాలలో ఉండేడి సప్తవర్ణాలు. ''కురిపించె మనపైనఅమృతంపు ఝరులు'' ఝరులు పారేవి, కురిసేది వర్షంగదా!

## ఉత్తిష్ఠ

[వచన కవితలు. చౌడూరి. డెమ్మి 1/8-80 పొరటలు; మూల్యం: రు. 5/—ప్రచురణ: సరోజినీ ప్రచురణలు, పాలమూరు.]

ఈనాటి కొత్తతోవల కవులకు, హైందవత్వ ప్రియుడైన ఈ కవికి లక్ష్యంలో భేదము లేదుగాని, వాటి కారణాలలో ఆచరణ విధానంలో మాత్రమే వ్యత్యాసమున్నది. మన ప్రాచీన సంస్కృతిలో లోపం లేదుగాని, దానిని చెడగొట్టిన వారిదే దోషమని, ఒక మత సంస్కర్తవలె ధ్వజమెత్తినాడు.

ఈయన కవిత్వం సూటిగా బల్లెంపోటువలెనున్నా, దీని లక్ష్యం హింసించడం గాక సంస్కరించడం కావటంచేత ప్రయోజనకారి అవుతున్నది. ఈయన హిందూసంఘంలోని కుళ్ళును కడిగినా, దానిని బాగుపరచనేనని, దొంగస్వాములమీద వేమనయోగివలె విరుచుకొని పడుతాడు. ఈ రచన బాణీ అంతా ఎగతాళి ఎత్తిపొడుపులది. ఈ సెటైర్ పద్ధతి మనకు కొంతతక్కువ. ''ఈనాటి మనిషి పట్టిపీనుగు—ప్రతి బాధను మోస్తున్న రాచ ఏనుగు'' అని ఆవేదనపడి—ఉత్తిష్ఠ—మేలుకోమని జాగృతి గీతం పాడుతున్నాడు. ''కొత్త పాతల కలయికే జీవితం'' అని, ఆచరణీయ సామరస్య సమన్వయ విధానాన్ని కోరుతున్నాడు; ఈ కవి ఆకాంక్ష మెచ్చదగినది.

ఒక్క తారాశశాంక న్యాయానికి చెవులు కండ్లు నోరు మూసుకొన్న మన మారలిస్టులు నేటి— ''వీధిలో శృంగారపు కొమ్మలు—వీధిగోడలమీద సినిమా బొమ్మలు—ఏమూల చూచినా సెక్సు పుస్తకాల—ఏ పుస్తకం విప్పినా స్త్రీల గాత్రాలు'' చూచి (మురిసిపోతూ)

ఊరకున్నదానికి దెబ్బతీస్తున్నాడు. ''నేతి బీరకాయ'' లోపల ఒకటి బయటకు ఒకటి చెప్పే నేటి సంఘ కాపట్యాన్ని బాగా పారబట్టుతున్నాడు. ''స్లోగన్ల మూటలను వ్యాగిన్లలో నింపుతూ'' ఉండే ఉద్యమాలను నిరసించి, పనికివచ్చే పనిని చేయమంటాడు. అందుకే ''రేపులేదు ఈనాడు నిజం కార్య శూరుం కమ్మని మంచి మాట'' అంటాడు. ''రేపను మాటకు రూపులేదు; ఎన్ని రేపులో క్షితిపై నిన్నలందు గలసెన్ సఖీ'' అని ఒమర్ ఖయ్యాము (రాయ ప్రోలు) అన్నది ఇదేమాట. ''చౌరస్తాలో బ్రతుకురస్తా'' ఖండిక మంచి అవహేళన రచన. నిజానికి విమర్శకుడేగదా సంఘాన్ని సరిదిద్ద గలిగినది.

భాష సరళంగా దాపరికం లేకుండా చెప్పతున్నట్లు. మాటలలో ఒక ఓజస్సు ఉన్నది.

## జాషువా కవి కోకిల

[జాషువా కవితపై పద్యాలు వ్యాసాలు. సంకలనం: బి. థియ డోర్. డెమ్మి 1/8. 120 పొరటలు; వెల: రు 6–50; ప్రతులకు: మహాకవి జాషువా జయంతి సమితి, మిషన్ హైస్కూల్ రోడ్, నర్సాపురం, పశ్చిమ గోదావరి.]

''తెలుగున్ తియ్యదనమ్ము లుట్టిపడ నుద్దీపించు నీ దివ్య భావన–కావ్యరచనా సారస్యమ్మన పుల్కరించిన భూమాత'' అని బెళ్ళూరు శ్రీనివాసమూర్తిగారన్నది–అప్పటమ్మైన తెనుగు నుడికారం గలిగిన ఈ లోక కవికి అతికినట్లు సరిపోయినది. జాషువా విశ్వపౌరుడు. కవితాదేవి ద్వారా మానవుని మహిత పరచిన సమదర్శనుడు. చందన మలందినా, కత్తితో కొట్టినా తొణకని నిండు మనిషి. ఏనుగుమీద ఊరేగించి, అంతటి మహాకవి–చెళ్లపిళ్ల వెంకట శాస్త్రి గండపెండేరం తొడిగినా పొంగని — ''పృథివిసురులు దక్కనితర జాతులు కవిత అల్లరాదు, నేరమంద్రు'' అని మొగాన విసరినా కుంగనివాడు ఈ జాషువా!

భావకవితా యుగంలో జాను తెనుగు నుడికారాన్ని పూల పల్లకీలో ఊరేగించిన ఏ కొద్దిమంది జాతీయ కవులలో ఈయన ఒకడు. దళిత వర్గాల ఉన్నతికి గాంధీజీయే ఏరుగడ అని ఆశపడినాడే ని, అగ్రజాతుల ద్వేషించి ఎరుగని పెద్ద మనిషి. ఈ వ్యక్తిత్వాన్ని శాశ్వతం చేయను, పూర్వజన్మ సుకృతంవల్ల మధుర కవితా తపస్వి అయినాడు. రెండోయుద్ధ సమయంలో ఈయన ప్రభుత్వ ప్రచారకుడు అయినప్పుడు, మాబోటి సన్నిహితులం ఎంత ఆయాస పడినా, దేశాన్ని గురించి, ఉద్రూత లూగించే కవిత్వం చెప్పినాడు. యుద్ధాన్ని తిక్కన మాదిరి వర్ణించినాడు.

ఈ సంకలనం, ఈ కవి కోకిల సమగ్ర సాహిత్యమూర్తిని తీర్చైన తెన్నులలో చిత్రిస్తున్నది. జాషువా కవితా సుధను గ్రోలి ఆనందించి అనుభవించి హృదయపూర్వకంగా వ్రాసి, పాఠకుని అనుభవింప జేస్తున్నారు — ఆ సరస హృదయులైన రచయితలు. వీరు జాషువా వ్యక్తిత్వాన్ని కవితాగుణాన్ని భిన్న దృక్పథాలలో వ్రాసి, ఆంధ్రలోకానికి ఎరుకపరుస్తున్నారు. ఇందలి పద్యాలు వ్యాసాలు విలువైనవి. ఇట్టి సంపుటాలు ఇంకా ఎన్నో వెలువడి, కవి కోకిల సంపూర్ణమూర్తిని మలిచి, ఆంధ్ర సాహిత్య శిల్పమందిరంలో ప్రతిష్ఠింప బడవలసి ఉన్నది.

జాషువా, ఫిరదౌసి (స్వర్గమని అర్థం) కావ్యాన్ని ఎం. జి. థామస్ ఇంగ్లీషుచేసి, ఒక జాతీయ తెనుగు కవిని, ఆయన రచనా సౌభాగ్యాన్ని ఇంగ్లీషు ప్రపంచానికి కానుక పెట్టడం చాలామంచిపని. మన రమ్య కవి సమయాలను మధురభావాలను విదేశాలకు ఎగుమతి చేయవలసినది ఎంతో ఉన్నది. ఇంతకుముందు దువ్వూరు రామిరెడ్డి కవికోకిల భావాలు ఇంగ్లీషులో డాక్టర్ కజిన్సు మదికెక్కి ఉండినది. ఇప్పుడు మంగుళూరులో పనిచేస్తున్న జి. ఆర్. కృష్ణ ఇంగ్లీషు రచనలు కామన్‌వెల్తు సత్కారాన్ని పొంది ఉన్నవి. ఈ అనువాదం ఇంగ్లీషుకు సహజమైన జాతీయతతో మంజుల పదబంధంతో, షెల్లీ–కీట్సు ధారను రుచి చూపుతున్నది. ఎస్. వి. ఎ. ఆర్. శాస్త్రిగారు జాషువా ముంతాజ్ మహలును (తాజ్ అంటే కిరీటం) ఇంగ్లీషు చేసినారు, బాగానే ఉన్నదవాల కాని, Queen Muntaj Mahal deserted Shah Jahan, అన్న పంక్తి ఆ రాణి ప్రేమకు అపార్థం కల్పిస్తున్నది. డెసర్ట్ అంటే మోసగించి లేచిపోవడంగాని మరణించడమనే అర్థం రాదు పద్యాలుగుమందిని కని, భర్త ప్రేమాంకంలో అసువులు బాసిన ఆమె ప్రేమను క్రిందు చేస్తున్నది–ఈచిన్న పదం.

థియడోర్‌చేసిన ఫిరదౌసి ఇంగ్లీషు తర్జుమాగూడ బాగున్నది.

## తూరుపు

[ఆధునిక సాహిత్య కర పత్రిక–1978 నవంబర్ మొదటి బులెటిన్, వెల: 0–60, అచ్చంపేట–509 375.]

కర పత్రిక అన్న పదబంధం కొత్తదనంతో సొంపుగాఉన్నది. ఇందుకు ఒక సాహితీ మిత్ర బృంద రచనలు– గద్యం, గేయం, విమర్శక వ్యాసాలుఉన్నవి. ''తిరుగుబాటు మా వేదాంతం'' అన్న ధోరణిలోనే ఇవి ఉన్నవి. ఇది తప్పు గాదు, వింటూ ఉందాం. ఈ సంకలనాలు కొందరికి ప్రోత్సాహానికి మరికొందరికి సాధనకు పనికివస్తవి.

---

భావ విప్లవం ఉత్తేజము ఇంకే పుస్తకంగాని కలిగించలేదు; కొత్త చరిత్రనే సృష్టించినది. కాని, కాలం జరిగే కొలది ఆచరణలో చాలా సూత్రాలు భగ్నమైనవి. క్యాపిటలిజంలోనే, దాని పీనుగు గుంట త్రవ్వేవారుంటారు అన్నారు మార్క్స్. అదేమాట ఇప్పుడు కమ్యూనిజానికి గూడ అన్వయిస్తున్నది. ప్రపంచ కార్మికులనంతా ఏకం గమ్మనిన కమ్యూనిష్టు రాజ్యాలే ఇప్పుడు జాతీయ భావంతో స్వదేశాల పొలిమేరలకోసం పరస్పర యుద్ధాలకు దిగి, ఎందరో నిరపరాధ కాందిశీకుల రక్తం మడుగులు గట్టిస్తున్నారు. తుపాకిగొట్టం గుండానే విప్లవం అన్న మావో సూత్రం భిన్న విప్లవాల నిర్మూలనానికే అన్వయింపబడుతున్నది. అంటే, జాతీయతే శాశ్వత మానవ స్వభావమని తేలింది. కాబట్టి ఈ భావాన్ని పెంచుకొంటూ (జాతీయత అన్య దేశాల ద్వేషం అన్న దోషంగూడ దీనిలో ఇమిడే ఉన్నది) సహజీవనంతో శాంతిని దేశ ఐశ్వర్యాన్ని ప్రజాశ్రేయాన్ని పెంపొందించడమే రానున్న శ్రేయోరాజ్య స్వరూపమేమో అనిపిస్తున్నది. ఈ పక్షంలో ఎందరో మేధావులున్నారు. రష్యా క్యాపిటలిస్టు అమెరికాతో పొత్తుకు చూస్తూ, కమ్యూనిష్టు చైనాతో రచ్చ బెట్టుకొంటున్నది. వియత్‌నాం ఇంకొక కమ్యూనిష్టు దేశాన్ని (కాంపూచియా) ఆక్రమించుకొన్నది. అంటే—భూమి ఆశ సామ్రాజ్య దేశాలకు కమ్యూనిష్టు దేశాలకు సమంగానే ఉన్నదని, ఇన్నేండ్ల కమ్యూనిష్టిక్ ఎక్స్‌పెరిమెంటు వెల్లడిస్తున్నది. కమ్యూనిజంలో కాలదోషం బట్టిన ఏవో కొన్ని సిద్ధాంతాలున్నట్లున్నది సమన్వయబుద్ధితో రక్తదాహంమాని, దోపిడీలు వదలి లోకశాంతిని గూర్చవలసిన బదనాయం కమ్యూనిష్టులదిగానే ఉన్నది.

**శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి**

## ఆంధ్రప్రదేశ్ చరిత్ర

[ఆంధ్రప్రదేశ చరిత్రలో ప్రధాన ఘట్టాలు రచన : జి. వెంకట రామారావు, వెల : పన్నెండు రూపాయలు, ప్రాప్తిస్థానం : రచయిత, ఇం. నెం. 18-7-739/2, అవుట్ సైడ్ గౌలీపుర, హైదరాబాద్ – 500 203.]

"సమకాలీన చరిత్ర అంటే నడుస్తున్న చరిత్రను వ్రాయడమంటే సంఘటనలను శాస్త్రీయదృష్టితో పరిశీలించి అవి అలా జరగడానికి దోహదపడిన పరిస్థితులను చిత్రించడం అన్నమాట. ఈ పద్ధతిలో చరిత్రవ్రాసే రచయితకు నిగ్రహం చాలా అవసరం. వస్తునిష్టంగా వ్రాయాలని ఎంతప్రయత్నించినా రచనలో రచయిత దృష్టి ఎంతోకొంత గర్భితంగానో ప్రత్యక్షంగానో ఉండకతప్పదు. ఇలాంటి రచనలో రచయిత దృష్టి ఎంత తక్కువ వ్యక్తమయితే అది అంత మంచి రచన అవుతుంది" అన్నాడొక బ్రిటిష్ చారిత్రకవేత్త. ఈ దృష్టితో చూచినప్పుడు శ్రీ జి. వెంకటరామారావు వ్రాసిన యీ పుస్తకం బాగున్నదని అనిపించినది.

1948 సెప్టెంబరు 17వ తేదీన నిజాం నవాబుల పరిపాలన హైదరాబాద్ సంస్థానంలో అంతరించింది. సంస్థానంపై పోలీసుచర్య ఆ తేదీన ముగిసినది. నిజాం నవాబు ఆ రోజున రేడియోలో తన సంస్థానంలోని ప్రజలనుద్దేశించి ప్రసంగించాడు. ఆ తర్వాత సివిల్ పద్ధతిలో మిలటరీ పరిపాలన జరిగింది. మేజర్ జనరల్ జయంత్‌నాథ్ చౌధరి 1948 సెప్టెంబరు 18వ తేదీన హైదరాబాద్ రాష్ట్ర పరిపాలనా బాధ్యతలను స్వీకరించాడు. అధికార హోదాను బట్టి ఆయన మిలటరీ గవర్నర్ అయినా, పరిపాలన సివిల్ పద్ధతిలోనే నడిచింది. ఆంధ్రప్రదేశ్ ఆధునిక చరిత్రలో ఇది ప్రధాన ఘట్టం.

తెలంగాణా సాయుధ పోరాటంవల్ల కొన్ని సత్ఫలితాలు కలిగాయన్న యీ రచయిత (7వ పుట) అభిప్రాయంతో అందరూ ఏకీభవిస్తారా? భూసంస్కరణలు తెలంగాణా సాయుధ పోరాటం ఫలితం అనడం శాస్త్రీయ దృష్టి అవుతుందా? కానీ విప్లవం విజయవంతమయితే అది స్వతంత్రమవుతుంది. (9వ పుట) అన్న యీ రచయిత అభిప్రాయం సబబుగానే ఉన్నది. అయితే స్థానిక కొంతమంది రాజకీయవాదులు నడిపించే పోరాటాన్ని విప్లవం అని అనగలమా?

బూర్గుల మంత్రి వర్గం అన్న అధ్యాయంలో శ్రీ వెంకట రామారావు వ్రాసిన చరిత్ర బాగున్నది. ఆ తర్వాత భాషా ప్రయుక్త రాష్ట్రాల చరిత్రను గుర్తుచేసినప్పుడు రచయిత ఇంకా కొంత విపులంగా వ్రాస్తే బాగుండేదనిపించుతుంది.

బ్రిటిషువారితో పోరాడిన వీరులు, 1857 విప్లవం. విప్లవ వీరులకు పుట్టిల్లు, ప్రజల మనిషి ప్రకాశం, శ్రీబాగ్ ఒడంబడిక, గోపాలరెడ్డి గారి మంత్రివర్గంఅనే శీర్షికల కింద ఈ రచయిత వ్రాసిన విషయాలు ఈ తరం యువకులూ, రచయితలూ చదవవలసినవి.

పెద్ద మనుషుల ఒప్పందం, వివరాలను ఈ పంచ సూత్ర పథకం తెలుగు ప్రజల మాగ్నకార్టా, ప్రాంతీయాభివృద్ధి సంఘాల ఏర్పాటు వంటి ప్రయోజనకరమయిన పెక్కు విషయాలు ఈపుస్తకంలో ఉన్నాయి. శ్రీ పి. వి. నరసింహారావు, శ్రీ జలగం వెంగళరావుల హయాంలో కంటే శ్రీ బ్రహ్మానందరెడ్డి హయాంలో రాష్ట్రం అధిక అభ్యున్నతిని సాధించిన సంగతి నిజం కాదా?

1977లో కోస్తాజిల్లాలకు విపరీతమయిన కష్టనష్టాలు కలిగించిన తుఫాన్ గురించీ, ప్రభుత్వం ప్రజలకు అందజేసిన సహాయం గురించీ ఇంకా వివరంగా వ్రాస్తే బాగుండేది. అలాగే శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీ దామోదరం సంజీవయ్యల రాజకీయాలను కూడా ఇంకా సమగ్రంగా వ్రాయడం సాధ్యం కాదా? యిలా అప్పంత మాత్రానవే ఈ పుస్తకంలో లోపాలున్నాయని భావించరాదు. ఇది మంచి పుస్తకం. రాష్ట్రరాజకీయాలను పూర్తిగాకాకపోయినా కొంతవరకయినా తెలుసుకొనగోరే విద్యార్థులూ, యువకులూ, పత్రికా రచయితలవంటి వారందరూ చదువవలసిన పుస్తకం ఇది.

**శ్రీ ఎ. ఎస్. అవధాని**

Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.